# ఉన్నపాటున పట్టుబడ్డారు

నిజంగానే. దేవుడు చల్లని చూపు చూచాడు లక్ష్మి. ఈ ఏడు మామిడి కాపు బ్రహ్మాండంగా వుంది!





















# ఉత్తరాలు

## విజ్ఞప్తికి జవాబు

ఏప్రిల్ 20 వ తేదీన ఆంధ్రప్రదేశ్ ముఖ్య మంత్రి గౌ. శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డిగారు మద్రాసు వచ్చినప్పుడు ఆంధ్ర చలనచిత్ర పరిశ్రమ తరఫున మద్రాసు "విజయా గార్డెన్స్"లో సన్మానము చేయబడింది. ఆ సందర్భములో అనేక సన్మాన పత్రములు సమర్పించ బడినవి. అందులో తెలుగు చలనచిత్ర పరిశ్రమ సభ్యుల తరఫున శ్రీ ఎస్. వి. రంగారావుగారు సమర్పించిన విజ్ఞాపన పత్రములో హైదరాబాదులోని శ్రీ సారథీ స్టూడియోస్‌ను గురించి కొన్ని ఆరోపణలు చేయ బడినవి. దీనిలో ఆంధ్ర ప్రభుత్వం సబ్సిడీ ప్రకటించిన అనంతరం దానిని అందుకొన అర్హులైన శ్రీ పి. గంగాధరరావు (హైదరాబాదుమూవీసు) గారు హైదరాబాదులో చిత్రం నిర్మించాలని అక్కడకు వెళ్ళారని, కాని అక్కడ ఒక అగ్ర నటుడు అభిమానించే నలుగురైదుగురు నిర్మాతలకు తప్ప తమకు చిత్రం నిర్మించే అవకాశం ఆ స్టూడియోలో లేనందువల్ల తిరిగి మద్రాసులో ప్రారంభించారని పేర్కొన బడినది.

ఇందులోని నిజా లేమిటి ?

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం సబ్సిడీ స్కీమును 1964వ జనవరి మొదటి వారంలో ప్రకటించింది. 1962 అక్టోబరు అనంతరం శ్రీ గంగాధరరావుగారు సారథీ స్టూడియోలో కాలుపెట్టి ఎరుగరు. 1964 జనవరి ప్రభుత్వ ప్రకటన అనంతరం తమకు హైదరాబాదులో స్టూడియో సౌకర్యములు లేవని ఎలా నిందించ గలుగుతున్నారు.

1962లో శ్రీ సారథీ స్టూడియో అతి క్లిష్ట దశలో ఉంది. అంతవరకు శ్రీ గంగాధరరావు గారు తమ చలన చిత్ర నిర్మాణమును హైదరాబాదులోనే జరిపారు. తరువాత వారు తమ వ్యాపార అవుసరాలకు మద్రాసు వెళ్ళిపోయారు. తమ డబ్బింగ్‌చిత్రాలు కూడ మద్రాసులోనే తీశారు.

తమ వ్యాపార అవుసరాలకని హైదరాబాదును విడిచి వెళ్ళిన శ్రీ గంగాధరరావు గారు ఈ ధోరణి ప్రదర్శించడం, బాధ్యులయిన శ్రీ యస్. వి. రంగారావుగారు ఈ నిరాధార ఆరోపణలు భాధ్యత గల సమావేశంలో బాధ్యుల సన్మాన పత్రములో చదవడం చాలా విచారకరం ఇట్టి నిరాధార విషయాల ప్రచారం మూలంగా ఆంధ్ర చలనచిత్ర పరిశ్రమకు ఇచ్చట గాని, అచ్చటగాని జరుగు మేలు ఏమిటి ?

మరొక విషయం. ఇచ్చట అగ్రనటుడు అభిమానించే వారికి తప్ప సారథీ స్టూడియోలో వేరొకరికి వసతులు దొరకవని మాపై మరొక ఆరోపణ !

శ్రీ నాగేశ్వరరావుగారు హైదరాబాదు వచ్చిన అనంతరం ఇచ్చట నిర్మించబడి విడుదల అయిన చిత్రాలు 5. ఇవిగాక శ్రీ నాగేశ్వరావు లేని చిత్రాలు సారథీ స్టూడియోలో నాలుగు నిర్మాణములో ఉన్నవి శ్రీ నిలయం పిక్చర్స్ మురళీ ఫిలిమ్స్, సిద్ధి ఫిలింస్, సుగంధీ పిక్చర్స్‌వి వీరు శ్రీ నాగేశ్వరరావు గారు 1963వ సంవత్సరములో హైదరాబాదు వచ్చిన తరువాతనే తమ నిర్మాణ కార్యకలాపాలు ప్రారంభించారు. ఇదే కాలంలో బొంబాయి సంస్థ అయిన ఎవ్. డి. ఫిలింస్ తమ రీ రికార్డింగును ఇక్కడనే పూర్తి చేసుకున్నారు. వాణి కళా మూవీస్ వారు తమ చిత్రం డబ్బింగు పూర్తి చేశారు. ఎందరో బయటి నిర్మాతలు అవుట్‌డోరు షూటింగులకు వచ్చి ఈ స్టూడియో సౌకర్యాలను వినియోగించుకున్నారు పైన వివరించిన కారణంగా ఒక్క గంగాధరరావు గారికే ఈ సౌకర్యాలు లోపించాయా ! శ్రీ సారథీ స్టూడియో 1958లో హైదరాబాదులో స్థాపించ బడినది. ప్రభుత్వం ఏదో ఆదరిస్తుందని గాని, హైదరాబాదు మా ఆర్జనకు అన్ని విధాలా చిత్ర పరిశ్రమ హంగులను సిద్ధ పరచి ఆహ్వానించిందని గాని ఇచ్చటకు రాలేదు మేం. ఆంధ్రాభిమానముతో మా చేతనయినది, చేయ గలిగింది చేద్దామని వచ్చాం. అనేక వ్యయ ప్రయాసలు పడ్డాం. శ్రీ అక్కినేని నాగేశ్వరరావు గారి మకాం మార్పు నిర్ణయం మాకు స్తోమతు ప్రోత్సాహాల నిచ్చింది. ఆంధ్ర ప్రభుత్వ నిర్ణయం మా పునాదులను మరింత గట్టి పరచింది. నూతన ఆశలకు మూలమయింది. ఇందు మూలంగా హైదరాబాదులో పరిశ్రమాభివృద్ధి సత్వరం జరిగి ప్రభుత్వ ఆశయం నెరవేరుతుందని ఉవ్విళ్ళూరుతున్నాం.

ఈ సమయంలో సారథీ స్టూడియోపై ఈ ఆరోపణలు ఎందుకు ? అవి ఎవరికి మేలు చేస్తాయి?

ఆంధ్ర ప్రభుత్వ వైఖరి మూలంగా పరిశ్రమాభివృద్ధికి సావకాశాలు కనిపిస్తున్నాయి. వీటిని బాధ్యతతో వినియోగించుకొని, మరిన్ని సౌకర్యములు కలిగించమని కోరడం, సద్వినియోగం చేసుకోవడం, పరిశ్రమలోని బాధ్యుల కర్తవ్యం. దానినుండి వేరుబడి, పరస్పరం నిందించుకొనడం ఎవరికి శ్రేయస్కరం కాదని మనవి చేస్తున్నాం.

శ్రీ సారథీ స్టూడియోస్ ప్రయివేట్ లిమిటెడ్
తరఫున సి. వి. వి. ఆర్ ప్రసాద్.

## కథలు

మీరు పోయిన వారంలో వ్రాసిన ప్రకారవే 24—4—1964 సంచికలో "ఆర్ఫియస్" గారు రచించిన "వాహిని" కథను ప్రచురించి పాఠకలోకానికి ఎనలేని ఆనందాన్ని కలిగించారు. అణువణువునా ఆనందోద్రేకాలను కలిగించిన యింత చక్కటి తెలుగు రచయిత విదేశాలలో ఉన్నత విద్యాభ్యాసం చేస్తున్నారంటే మనందరికీ గొప్ప గర్వ కారణం.

గోపాలకృష్ణ (హైదరాబాదు)

* * *

ఈ వారం 15—5—64వ తేదీ ఆంధ్ర పత్రికలో మీరు ప్రచురించిన 'చివరి మలుపు' కథ నన్నెంత గానో ఆకర్షించింది. ఆ కథ చదువుతూన్నంత సేపు నా కళ్ళు చెమ్మగిల్లాయి. అట్లాంటి 'పాపలంటె' నాకెంతో ఇష్టం. అట్లాంటి 'పాప' లున్న వారి జీవితం ఒక దివ్యానుభూతి. కథ చాలా సహజ సిద్ధంగా, నిజానికి దగ్గరగా ఉంది. ప్రతి వారికి, ప్రత్యేకంగా అట్లాంటి చిన్న పాప అంటే ఎంతో ఇష్టమైన నాలాంటి వాళ్ల హృదయాలలో నాటుకొని పోయే కథ. ఎప్పటికి మ[రువ] లేను.

శ్రీనివాస్ రావు (తెనా[లి])

## అసురసంధ్య

'అసుర సంధ్య' — 2 చదివాను. రచయిత పొరపాటు చేశారు. ( 52పేజీలో ) తాను సృష్టిం[చిన] సుభద్రమ్మ పాత్రను ఉన్నట్టుండి ఓసారి సు[ంద]రమ్మగా మార్చేశారు. ఇక మీదట ఈలాంటి పొరపాట్లు దొర్లవని ఆశిస్తున్నాను.

— 'శోభశ్రీ' ( రామన్నపాలెం

* * *

గొలుసు కథ "అసుర సంధ్య" ఆశించినం[త] బాగా లేక నిరాశ కలిగించినది. మాధవరావు రాజ రావుని హంతకునిగా నైతే పట్టుకున్నాడు కా[ని] ఏ విధముగ అనునది నిరూపణ చేయలేదు. ఇ[ది] సమంజస మైనది కాదు.

డి. ఆర్. వేణుగోపాల (అనంతపురము)

## సీరియల్ కథలు

మీరు ప్రచురించిన "ఎండమావులు" "సంపెంగ పొదలు" క్రిందటి పత్రికతో అయిపోయినందులకు నేను యెంతో విచారిస్తున్నాను. మొదటినుండి ఆఖరు వరకూ 'ఎండమావులు' నవల నా హృదయాన్ని కదిలించి వేసింది. రచయిత అయిన హరికిషన్ గారికి నా అభివందనలు. ఎండమావులలోని స్వాతి పాత్రను రచయిత చాలా చక్కగా సృష్టించారు. దానికి తోడుగా జ్యోతి పాత్రగూడా చాలా చక్కగా చిత్రీకరించారు. "బావ తన్ను ప్రేమించటం లేదనే విషయం స్పష్టంగా తెలిసి జ్యోతి నిరాశతో మంచాన పడుతుంది." ఈ సన్నివేశం నా హృదయాన్ని కదలించివేసింది. స్వాతి తన భర్తను జానకిరాంకు అప్పగిస్తూ చెప్పిన మాటలు మాటలు రచయిత యెంతో నైపుణ్యంగా వ్రాశారు. ప్రతిపాత్ర చాలా చక్కగా చిత్రించిన రచయితగారు అభినందనీయులు. ముఖ్యంగా స్వాతి పాత్ర నా హృదయంలో చెరగని ముద్రగా నిలిచింది.

"సంపెంగ పొదలు" నవల వ్రాసిన 'సి. ఆనందరామం 'కు నా అభినందనలు. శంకర్, దుర్గల వైవాహిక జీవితంలో చెలరేగిన కలతలను రచయిత చాలా బాగా వ్రాశారు. ఇందులోని ఉమ పాత్ర చాలా ఉదాత్తంగా చిత్రీకరించబడింది. గిరిలాంటి ఉదాత్త పాత్రను చిత్రీకరించిన రచయిత లభివందనీయులు. ఇందులో హరి పాత్రపై నాకు యెనలేని సానుభూతి కలిగింది. ప్రతి పాత్రనూ యెంతో సమర్థనీయంగా చిత్రీకరించిన రచయిత అభినందనీయులు.

యస్. రాజారావ్. రాంబాబు. (శ్రీకాకుళం)

## ఊమెన్ కార్టూన్

15—4—64 వార పత్రికలో వూమెన్— హిందూ దేశము నుండి వెళ్లే ముస్లిం కాందిశీకులను భూతద్దంతో నుండి చూస్తున్నప్పుడు జయప్రకాశ్‌కి, వారి సంఖ్య హెచ్చుగా కాన్పించు చున్నట్లుగ వేసిరి. భూతద్దంలో నుండి చూస్తున్నప్పుడు రూపము పెద్దదిగ కన్పడును గాని సంఖ్య హెచ్చదు. ఇటువంటి తప్పిదములు ఇంక ముందు దొర్లవని ఆశించుచున్నాను.

వందివాడ ।పఫులా రాణి (కాకివాడ)

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 29—5—'64
క్రోధినామ సం॥ వైశాఖ బహుళ తదియ
సంపుటము 56 సంచిక . 39

స్థాపితము :
1908

*

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

## ఒక సంవత్సరం చందా వివరాలు

ఇండియా రూ. 15.60. ఇతర దేశాలు ఓడమీద ( Sea Mail ) రూ. 28 60. విమానం ద్వారా (Air Mail) బ్రిటన్, జర్మనీ, ఇతర యూరోప్, ఆఫ్రికా దేశాలు రూ. 120.00. అమెరికా రూ. 176.80. ఆస్ట్రేలియా రూ. 148.20.

విడిప్రతి 30 న.పై.
సంవత్సర చందా 15.60 న పై.
6 మాసాల చందా 7.80 న.పై.

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
8. తంబుచెట్టి వీథి, మద్రాసు-1




నమ్మండి, నమ్మకపోండి... ఈ లైబ్రరీ భవనం కట్టించటానికి ఎంత డబ్బుయిందో మంత్రిగారిచేత ప్రారంభోత్సవంచేయించటానికి దానికిరెట్టింపయింది

## మనలో మాట

32, 33 పేజీలలో ప్రారంభం అవుతున్న 'బాలసాహితి' శీర్షిక వివరాలు ఆ పుటలలోనే చదువుకోవచ్చు! కాని ఈ కథావళిలో రాబోయే కథలు కొన్ని 'అసలు' ఏ దేశాలవో చెప్పడం కష్టం...

*   *   *

కాశీమీద వ్యాసం వ్రాసిన శ్రీ చిట్టిబాబుగారి సీరియల్ ఒకటి త్వరలో ప్రారంభం అవుతుంది...

*   *

ఈ వారం వనితాలోకం వ్యాసం రచయిత్రి శ్రీమతి నాయని కృష్ణకుమారి పేరు తెలుగు పాఠకలోకానికి బాగా తెలిసినదే...

*   *   *

వచ్చేవారం మరొక సీరియల్ కథ "మనసున మల్లెలు" ప్రారంభిస్తున్నాము. రచయిత శ్రీ రంగధామ్‌గారు పాఠకులకు సుపరిచితులే!

*   *   *

## విషయానుక్రమణిక

ముఖచిత్రం : 'రాముడు - భీముడు'లో జమున.

**కథలు :**


| | | |
|---|---|---|
| మంచి అమ్మ | — | 16 |
| నరహరి నిజాయితీ | — | 30 |
| ఆ కిటికీ | — | 14 |


**సీరియల్ కథలు :**


| | | |
|---|---|---|
| రామచరితమానస్ | — | [illegible] |
| కూలిన గోడలు | — | 44 |


**శీర్షికలు : వ్యాసాలు : సినిమా.**


ఉత్తరాలు — 3, ఉమెన్ క్యాప్సూల్ — [illegible], మ్యాడిర్లీ లేఖ — 7, రాజధాని కబుర్లు — ఇంటింటి పజ్యాలు—9, సరాగమాల — 11, కాశీపట్నం చూడరబాబు.......... — 12, సమిష్టి కుటుంబాలవల్ల స్త్రీస్వాతంత్ర్యం తగ్గిపోతున్నదా ? ( వనితాలోకం ) 20, వనితావాణి — 23, శ్రీ బ్రహ్మానందరెడ్డితో ఇంటర్వ్యూ 24, వారఫలం — 27, కుందేలూ — ఏనుగా బాలసాహితి — 32, ప్రభుత్వం — పరిశ్రమ (వ్యాసం) - 40, సిరి మిరపకాయలు—58, సినిమా — [illegible]


రంగుల రాట్నం
బొంబాయి
ఏ. ఐ. సి. సి. సమావేశం


చైనా


ఇంద, యీ కత్తి పుచ్చుకో. ఇందే మాకు వెన్ను పోటులు పొంద వచ్చు


మూడు ఏకాకులు
దేశ వ్యాప్తంగా వస్తున్న వ్యతిరేకత

# తాను కాశ్మీరియేగాని భారత పౌరుడు కాడట!

## — షేక్ అబ్దుల్లా

ఓపక్షం రోజులపాటు "ఇండియా"లో వుండి, షేక్ అబ్దుల్లా తిరిగి కాశ్మీర్‌కు పయనమై వెళ్లారు. ఇండియాలో దేకదా, 'కాశ్మీర్' అని మారడగవచ్చు! కాని సంగతి అదికాదు, షేక్ అబ్దుల్లాగారు ఢిల్లీని ఇండియాగానూ, కాశ్మీరును కాశ్మీరుగాను అభివర్ణించారు. నేనూ అందుకే ఇలా వ్రాశాను

ఇటీవలి పత్రికా గోష్ఠిలో ఆయన్ను "మీరు భారతీయులా" అని ఒక విలేఖరి ప్రశ్నించారు. ఈ ప్రశ్నకు సహించలేక పోయారు కాబోలు, కోపంగానే సమాధానమిచ్చారు— తాను మొదట భారతీయుడా లేక మహమ్మదీయుడా— ? అన్న వివాదాలు చౌకబారువని అబ్దులాగారి ప్రత్యుత్తరం. తాను 'ఇండియా'కు 'షేక్ అబ్దుల్లా'గానే వచ్చాడట, త్వరలో పాకిస్తాన్‌కు వెళ్లనున్నది కూడా 'షేక్ అబ్దుల్లా'గానే నట! ఇంకా, స్పష్టంగా చెప్పాలంటే, షేక్ అబ్దుల్లాగారు, తాను 'భారతీయుణ్ణి' అని చెప్పుకోవటానికి అంగీకరించలేదు.

'కాశ్మీరు భారత దేశంలో కలియాలి' అనే విషయం తిరుగులేనిది కావడమే కాక, నెహ్రూ అబ్దుల్లాల సమాలోచనలు కూడా ఆ విషయ పరిధిలోనే జరగాలన్నది కూడా ఒకానొక 'కాబినెట్' నిర్ణయమే కాదా ?— అని అడిగినప్పుడు, "అలా భావించే వాళ్లంతా" భ్రాంతిలో ఉన్నారని, "మమకారం తప్ప ఇంకేమీ లేదని" అబ్దుల్లా సమాధానం చెప్పాడు. అబ్దుల్లా వెనుకటి భద్రతా సమితిలో తాను కాశ్మీరును ఆక్రమించుకోవాలనే ఉద్దేశంతో గాక దురాక్రమణ బాధితులను రక్షించాలనే ఉద్దేశంతో ఉన్నానంటూ, భారత దేశం చేసిన ఫిర్యాదు ఈ సందర్భంలో పేర్కొని, అది మొదలు కాశ్మీరుకు ఎన్నో వాగ్దానాలు, ప్రతిజ్ఞలను అందించటం జరిగింది అన్నాడు శ్రీ షేక్ అబ్దుల్లా. దీనిని బట్టి విడుదల అనంతరం షేక్ అబ్దుల్లా, ఆ వాగ్దానాలన్నింటిని గుర్తించి తీరాలని భావిస్తున్నట్లే మనం అనుకోవచ్చు.

"నన్ను జైల్లో పెట్టిన వాళ్లనే నేను కౌగలించుకుంటున్నాను, వాళ్లతోనే సమాలోచనలు జరుపుతున్నాను. కారాగారవాసం నాకు పదకొండేళ్లపాటు కల్పించిన వాళ్లనే ప్రేమించి చూస్తున్నాను. ఇది నా విశాల హృదయానికి తార్కాణం" అనికూడా అబ్దుల్లా పేర్కొన్నాడు.

అయితే, ఇక్కడ కొన్ని వ్యాఖ్యానాల అవసరం ఉంది. కౌగలించుకోవటం కేవలం స్నేహానికే చిహ్నం కాదు. వెనుకటికి అఫ్జల్లాఖాన్ శివాజీని కౌగలించుకొన్నాడుగా! కాస్త బుర్రపెట్టి ఆలోచిస్తే రాజాజీకి, అబ్దుల్లాజీకి ఒక ధ్యేయం—, అదే పండిత జవహర్‌లాల్ నెహ్రూగారిని కీర్తిభ్రష్టుణ్ణి చేయాలి అన్నది— ఉన్నట్లు స్పష్టమవుతున్నది....

మరి కాస్త వివరించనివ్వండి: 17 ఏళ్ల క్రితం కాశ్మీరు ప్రజలకు స్థానికంగా, అంతర్జాతీయంగా కూడా ప్రచురితమైన వాగ్దానాలను భారత దేశం చేసిన మాట వాస్తవమే. అలాగే అబ్దుల్లా కూడా భారత రాజ్యాంగ బద్ధుడుగానే కేటాయింపుగా చాలా ప్రకటనలు చేశాడు. (పోనీ, జవహర్లాల్ గారి అనుయాయులే అనుకొందాం.) గత ఐదు సంవత్సరాలుగా కాశ్మీరు ప్రజలు భారత దేశంలో ఐక్యమయిపోవటానికి ఇష్టపడుతున్నట్లే, గత మూడు సార్వత్రిక ఎన్నికల వలన బుజువవుతున్నట్లు, చాలా మంది భావిస్తున్నారు. పైగా, భారత దేశం చేసిన వాగ్దానాలన్నీ ఈ మధ్య కాలం నెరవేర్చినట్లే అయిందనీ, ఇప్పుడు స్వయం నిర్ణయం అనే దానికిగానీ ప్రజాభిప్రాయ సేకరణ అనేదానికి గాని ఎంత మాత్రమూ అవకాశం లేదని 'భారత్' భావిస్తున్నది. కాని రాజాజీ, అబ్దుల్లాలు అనేదేమంటే స్వయం నిర్ణయ శక్తికి గానీ, అభిప్రాయ సేకరణకు గానీ, ఇంతవరకూ కాశ్మీరులో జరిగిన ఎన్నికలు ప్రత్యామ్నాయాలుగా స్వీకరించదగ్గవి కావు. దీనంతటికే ఒకటే తాత్పర్యం— రాజకీయంగా పండిత జవహర్‌లాల్ నెహ్రూగారిని అబ్దుల్లా పూర్తిగా పడగొట్టాలని ప్రయత్నం చేస్తున్నాడు. కాశ్మీరు అనే "రావణాసురిడి కాష్టం" మీద భారత పాకిస్తాన్‌ల సుహృద్భావ, సత్సంబంధాలు నెలకొనాలని గగ్గోలు పెట్టే పత్రికలకు కూడా ఇదే ఏకైక లక్ష్యం. అబ్దుల్లా "భారత పత్రికలు తనపట్ల 'కరుణార్ద్ర దృష్టి' కలిగి ఉండాలని" కోరాడు. జాతీయత, మానవ ధర్మానికి ఎంత మాత్రమూ వ్యతిరేకము కాదు. మహాత్మ గాంధీగారు మానవ తత్వ ప్రబోధకుడు. జాతీయ తత్వ ధురీణుడు కూడా. అంచేత అబ్దుల్లా మానవ ధర్మమనే సాకుతో జాతీయ విధిని కాదని రెండు నాలికల మాటలు మాట్లాడుట సబబుగా తోచదు. పైగా, అబ్దుల్లా భారత దేశానికి 'సెక్యులరిజం' కాశ్మీరీలకు 'జాతీయత' ఎలా చెప్తున్నాడో అనూహ్యం. తనది కాశ్మీరు గనుక భారత పౌరుడు కాదట అబ్దుల్లా!

కాశ్మీరు సమస్యా పరిష్కారానికి అబ్దుల్లా చెప్పే మూడు సూత్రాల మార్గం ఏమిటంటే, దాని ఫలిత మేమయినా సరే, భారత–పాకిస్థాన్ దేశాలు రెండూ ఓటమిని కాని, కించపాటును గానీ పొందకూడదు. అది భారత దేశ మత రాహిత్య సిద్ధాంతానికి వ్యతిరేకంగానూ వుండకూడదు, కాశ్మీరు ప్రజల అభిమతానికి భిన్నంగానూ వుండకూడదు.

ఒక వైపు పాకిస్తాన్‌లో నియుక్తత్వమూ, సైనికపాలన హెచ్చిపోతున్నా కొందరు ఇండియాలోని 'సెక్యులరిజం' లోని లోపాలనే వెలికి తీయాలని ఆరాట పడుతున్నారు. దీనికి కారణం జమ్మూ, లడక్ ప్రాంతాలలో ఉండే మహమ్మదీయేతరులను తన వలలో వేసికోవాలనే అబ్దుల్లా సంకల్పం.

ఒక పత్రికా సంపాదకుడు ఇండియాను మూడు భాగాలుగా విభజించాడు. మొదటి వర్గం మంత్రులు, ఉన్నతాధికారులు— అబ్దుల్లా వలలో

## న్యూఢిల్లీ లేఖ

వీళ్లంతా పడలేదు. రెండవ వర్గం : కొన్ని కార ణాల ననుసరించి, ఇండియాను బలపరుస్తున్నారు.

మూడవ వర్గం— తటస్థులు. వీళ్ల దృష్టిలో అబ్దుల్లా వాదన కొంతవరకు సమంజసం. రుచి చెప్పటానికి తినిచూడాలి— అన్నట్లు నెహ్రూగారు అబ్దుల్లా సిద్ధాంతం మీద ఎన్నికల్లో పోటీ చేస్తే ఈ తటస్థులంతా ఎంత మంది ఉన్నారో తేలి పోతుంది. ఇంతవరకు పండిట్ నెహ్రూకుగాని, కాంగ్రెసుగాని ప్రజల వద్ద నుంచి, 'కాశ్మీరు ప్రతి పత్తిని' మార్చమని ఎలాంటి వర్తమానమూ లేదు. అందువల్ల, కాశ్మీరు ప్రతిపత్తిని మార్చ టానికి ఏదో విధంగా, ప్రజల వద్ద నుంచి ఒక తాకీదు పొందవలసి ఉన్నది.

**సరే ఇక అబ్దుల్లాకథలో మరో అంశంకూడా చర్చనీయాంశమే. ఆయన్ను అకస్మాత్తుగా విడుదల చేయటంతోనే, ఇండియా-పాకిస్తాన్ స్నేహాన్ని పెంపొందించే యంత్రాంగాన్నొకదానిని ఆయనకు అప్పగించటం జరిగింది.**





ఆయనకు ఆ బాధ్యతలను, యంత్రాగాన్ని ఎవరు అప్పగించారో ఎవరికీ తెలియదు. ఈ విష యాన్ని బట్ట బయలు చేసే సాహసం కూడా ఎవరూ చేయలేదు— దానికి కారణం ఒకటే— దాదాపు నెల రోజుల నుంచీ రాజద్రోహాన్ని, దేశ ద్రోహాన్ని ప్రచారం చేస్తున్న ఈ వ్యక్తిని ప్రముఖు డుగా గుర్తించాలని ఉత్తర్వులు రావటమే !.... ఈ నాడు ఆయన చేసే పరిష్కారం మీదనే భారత దేశంలోని లక్షలాది మహమ్మదీయుల భవిష్యత్తు ఆధారపడి ఉన్నది. అబ్దుల్లా ఢిల్లీ వస్తూనే భారత దేశం పట్ల భక్తి విశ్వాసములతో మెలగవలసిందని మహమ్మదీయులకు విజ్ఞప్తిచేశాడు. ఇకపాకిస్తాన్‌లో మహమ్మదీయేతరుల విషయం—వారిని ఆ ప్రభుత్వం జయవంతంగా గెంటివేస్తున్నది !

అబ్దుల్లా ప్రకారం, ఇండియా— పాకిస్తాన్‌ల స్నేహానికి 'కాశ్మీర్' పెద్ద అవరోధంగా నిలిచిం దట ! అబ్దుల్లా చేయదలచిన కాశ్మీరు 'సమస్యా' పరిష్కారంలో ఉన్న అంశాలేవో లోగడనే చెప్పు కొన్నాం.. అందలి సాధక బాధకాలను ఇప్పుడు చర్చిద్దాం.

సమస్యా పరిష్కారం మూలంగా వచ్చే విలువ లను పాకిస్తాన్‌తో గాని, ఇండియా గాని ఓటమి, అవమానాలుగా భావించుకో కూడదు— అంటాడు అబ్దుల్లా. పైగా, ఆయన సంయుక్త కాశ్మీరులోనే ఎప్పుడూ అభిలషిస్తారట. ఇండియాకు సంబం ధించినంతవరకు పాకిస్తాన్ ఆక్రమించుకొన్న కాశ్మీరు భూభాగం ఇండియాకు చెందవలసిందే. అందు వల్ల ఇండియాలో ఆ నిర్ణీత భూభాగం యొక్క కలయిక, భారత దేశం యొక్క కోరికలను అనుస రించి జరగవలసిందే.... అయితే సమస్య అదికాదు.. అలాంటి పరిష్కారాన్ని కాశ్మీరు ఏకోన్ముఖంగా అంగీకరిస్తుందా ? జవాబు : అసంభవం. అందు వల్ల పాకిస్తాన్‌ను కూడా 'సంయుక్త కాశ్మీర్' సమస్యగా ఒక భాగస్థుణ్ణి చేయాలని అబ్దుల్లా సంకల్పించినట్లు విదిత మవుతోంది. అంటే, ఇంకా వివరంగా చెప్పాలంటే, కాశ్మీరులో పాకిస్తా న్‌కు మరికొంత స్థానం ఏర్పడుతుంది. ఇలాంటి స్థానాన్నే కావాలని పాకిస్తాన్ ఏడేళ్లుగా కోరు తున్నది. అలాంటి పరిష్కారమే జరిగితే, అది నెహ్రూగారి విధానానికి విజయమా ? లేక—

62వ పేజీ చూడండి

**రాజధాని కబుర్లు**

# 'రవీంద్రభారతి'లో విశ్వకవి జయంత్యుత్సవాలు!

ఈమధ్య ఓ ప్రముఖ జర్నలిస్ట్ అన్నాడు. మనం హైదరాబాదులో ఏ మీటింగ్‌కు వెళ్ళినా, ప్రేక్షకుల్లోనూ మార్పుండదు, ఉపన్యాసకుల్లోనూ భేదం ఉండదు. అయితే సబ్జెక్టు మాత్రం మారుతూ ఉంటుందని, దీంట్లో కొంత అతిశయోక్తి ఉన్నా, గంభీరమైన సత్యం మాత్రం లేకపోలేదు. కాని హైదరాబాద్ బెంగాలీ సమితి వారు, రవీంద్ర భారతిలో జరిపిన రవీంద్ర జయంతి ఉత్సవం పైమాటకు కేవలం విరుద్ధంగా కనిపించింది. ఉపన్యాసకులు బెంగాలీవారు ముఖ్య అతిధిగా శ్రీ సీతారాం గార్ని ఆహ్వానించారు. ఉపన్యాసాలు ఇంగ్లీషులోనే! ప్రేక్షకులు మూడు వంతులకు పైగా బెంగాలీ వారే! ఎందుకంటే రవీంద్రనాన్ టాగూర్ బెంగాల్ వాస్తవ్యులు కాదు! నృత్యం, సంగీతం, నాటకం, రవీంద్రుని గొప్పతనాన్ని శ్లాంఘించిన తరువాత, వరసక్రమంలో కార్యక్రమాలుగా రూపొందినాయి. కర్ణ, కుంతీ సంవాదమయితే నేమి, రవీంద్రుని 'వశీకరణ్' నాటకమయితే నేమి, బెంగాలీ భాషలో ప్రదర్శింపబడటం వలన ఇతర భాషల వారు అర్థం చేసుకోలేక పోవటం సహజం. ఉత్సాహంగా ఇంత మంది బెంగాలీలు ముందుకువచ్చి, మూడు గంటల కార్యక్రమాన్ని కొనసాగించటం మెచ్చుకో తగ్గది. ప్రపంచ విఖ్యాతి చెందిన రవీంద్ర కవీంద్రులు, కేవలం బెంగాలీయుల 'సంస్మరణానికే' పరిమితమయిపోతున్నాడా అనిపించింది!

ఆంధ్రప్రదేశ్ ఆర్యవైశ్య రజతోత్సవ మహాసభలు జరిగాయి. ఆంధ్రప్రదేశ్ నలుమూలల్నుంచి వైశ్య ప్రముఖులు విచ్చేశారు. వర్తక విధానాలు మారిపోవటం వలన, కీలకమైన వ్యాపారములను ప్రభుత్వం వారు చేపట్టటం వలన, వైశ్యులు, పాత వ్యాపార పద్ధతులను కట్టిబెట్టి, అన్ని రంగాల్లోనూ చొరవ చేసుకుని, ముందుకు రావలసిన ఆవశ్యకతను గురించి నాయకులు ఉద్బోధించారు. స్వసంఘంలో ఉన్న బలహీనతలను తొలగించి, ఆర్థిక, విద్యా సాంస్కృతిక రంగాలలో పురోభివృద్ధి సాధించటానికీ, సాంఘిక దురాచారములకు అమర్యాదలకు, అన్యాయములకు తమ సంఘము గురికాకుండా, కాపాడుకునే నిమిత్తమై ఆర్యవైశ్య సంఘము యేర్పడింది గాని, కులద్వేషంతోనూ, అసూయతోనూ ఈ సంస్థ స్థాపించింది కాదని శ్రీ కాకరపర్తి భావనారాయణ శ్రేష్ఠిగారు విశదీకరించారు.

సికింద్రాబాదులో వైశ్య ప్రముఖులు మొదటి నుంచి ప్రజాహిత కార్యాల్లో హెచ్చుగా పాల్గొంటూ సాంఘిక దురాచారాలను అరికట్టటంలో శాయశక్తులా ప్రయత్నిస్తూ ఉండటం, చాలా మందికి తెలిసిందే. వీటితో పాటు రాజకీయాల మీద కూడా ఆసక్తి చూపెట్టటం ఈ మధ్యలో కనిపిస్తూనే ఉంది. శ్రీయుతులు జూలూరి వీరేశలింగం గుప్త, కొత్తూరి సీతయ్య గుప్తగార్ల పేర్లు వినిపిస్తూ ఉంటాయి. ఈ సందర్భంలో, మంత్రి గురుమూర్తిగారు సరేసరి, ఈ ఇద్దరు వర్తక, వాణిజ్య రంగాల్లో సన్నిహిత సంబంధాలు పెట్టుకుంటూ మిగతా అనేక రంగాల్లో కూడా కృషి చేస్తూ ఉండటం, పురవాస్తవ్యులకు తెలిసిందే! ప్రస్తుత పరిస్థితుల దృష్ట్యా, వారి అనుభవాన్ని మేళవించి, చేసిన ఉద్బోధలు గమనార్హం.

* * *

'కొహరా' పిక్చర్స్ విడుదల సందర్భంగా ప్రఖ్యాత సినీడైరెక్టర్, సంగీతదర్శకుడు శ్రీ హేమంత్ కుమార్ హైదరాబాద్ వచ్చారు. ఆయన వెలుబుచ్చిన కొన్ని అభిప్రాయాలు కొంత మందికి వెగటనిపించాయి. నిర్మాత, కేవలం, ధనార్జన కోసమే చూస్తాడు కాని, నీతిని ఉద్బోధించటానికి గొప్ప కళాత్మకంగా తన పిక్చర్ పేరు ప్రతిష్ఠలు సంపాదించుకోవాలని మాత్రమే చూడడు. ఓ వేళ అంత త్యాగం ఏ నిర్మాతైనా చేస్తే, రెండో పిక్చర్స్ తియ్య లేడు, కారణం దివాళా తీయటమే! పిక్చర్స్ ఏ విధంగా ఉండాలి అనే విషయం మీద ప్రభుత్వం వారు శ్రద్ధ చూపాలి. నిర్మాత మాత్రం కేవలం పెట్టుబడిని రాబట్టుకుని, లాభం కోసం, ఎలాంటి దృశ్యాలు ఉంచాలి, ఎలాంటి సినిమా తీయాలి అనే వాటి మీదనే శ్రద్ధాశక్తులు కనపరుస్తాడు. మన దేశంలో సినిమా పాటల మీద మోజుగా ఉంది. అందుకనే పిక్చరంతా బాగా లేకపోయినా వీనుల విందుగా నాలుగు పాటలుంటే సరి, నిర్మాత, దెబ్బ తినకుండా బైట పడతాడు. ఈ రహస్యాన్ని, నిర్మాత లందరూ గ్రహించే ప్రతి సినిమాలోనూ, పాటలు చొప్పించటానికి ప్రయత్నం చేస్తారు. హిందీ సినిమాలు తీయటం మహా కష్టం. దేశం మొత్తం మీద విడుదలవుతుంది కాబట్టి, ఆయా రాష్ట్రాల వారి అభిరుచులను మనస్సులో పెట్టుకుని, సినిమాను రూపొందించాలి. ఇతర భాషా చిత్రాలకు ఈ అవస్థ లేదు. ఏ నిర్మాత కూడా ఎక్కువ డబ్బు ఖర్చుపెట్టి పిక్చర్ తీయాలని తహతహ లాడడు. చాలా తక్కువ డబ్బుతో సినిమాలు తీయటానికి నిర్మాతలు చాలా మంది సంసిద్ధంగా ఉన్నప్పటికీ, అలాంటి వాటిని సాహసించి తీసుకోవటానికి, ముందుకు వచ్చే డిస్ట్రిబ్యూటర్స్, ఎగ్జిబిటర్స్ చాలా తక్కువం. అందు వలనే పేరుపడ్డ నటీ నటులకు డబ్బు ఎక్కువిచ్చి 'స్టార్ వాల్యూ' ఉన్న పిక్చర్స్ తీయటానికే పూనుకోవలసి వస్తోంది. ఈ అభిప్రాయాలతో పాటు సినిమా పరిశ్రమ పట్ల, ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం చూపెట్టిన ఆదరాభిమానాలకు, కృతజ్ఞత కూడా వెలిబుచ్చారు.

అన్నట్టు, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం అంటే

౫౫ వ పేజీ చూడండి

## ఇంటింటి పజ్యాలు

ఆరుద్ర

### 6 ద్ర 7 డ్పు

ఆనందర్రావుగారుండే ఇంటి నెంబరు పన్నెండు
అందుకే వారి జీవితంలో సౌఖ్యాలు మెండు
అబ్బాయిగారి కారు నెంబరు ఆరూ ఏడూ మూడూ నాలుగు
అందుకే మలుపు తిరిగేటప్పుడు కీచు కీచు మూలుగు
అని చెప్పాడు మునుపో సంఖ్యాశాస్త్రజ్ఞుడు
ఆయన ఎప్పటికీ మాటలాడే ఇంగితజ్ఞుడు
మిలటరీ లారీని గుద్దినా పాడవలేదు అబ్బాయిగారి కారు
మీకు తెలుసా కారణం దాని నెంబరులో మొదటుంది ఆరు
ఆనందరావుగారింట్లో ఎందుకుంటుంది పగలే చీకటి ?
అయ్యో తెలీదా పన్నెండులో ముందుండేది ఒకటి
నిత్య నూతన కారణాలు చెప్పే న్యూమరాలజీ
నిద్దలో కూడా నవ్వు తెప్పించే హ్యూమరాలజీ 

చిన్న దెబ్బలను అశ్రద్ధ చేయకండి

# బ్యాండ్-ఎయిడ్*

## ప్రథమ చికిత్స పట్టీలను ఉపయోగించండి



మీరు చిన్నవని భావించే కోతలను మరియు గాయములను అశ్రద్ధచేస్తే వాటితో ఎక్కువ చికాకులు కలుగవచ్చును. కోతలకు మరియు గాయములకు బ్యాండ్ - ఎయిడ్ ప్రథమ చికిత్స పట్టీలను వేస్తే వాటికి శుభ్రమైన, ఆరోగ్యరక్షకమైన రక్షణ కలుగుతుంది. పూర్తిగా వాటర్ - ప్రూఫ్వైన బ్యాండ్ - ఎయిడ్ ప్రథమ చికిత్స పట్టీలు వీలుగా ఉండేలా ఒక్కొక్కటే విడివిడిగా ప్యాకుచేయబడినవి.

* ట్రేడ్ మార్కు

**జాన్సన్ & జాన్సన్**
**ఆఫ్ ఇండియా లిమిటెడ్**
30, ఫోరెట్ సిట్, బొంబాయి 26




JWTJ 2593

# సరాగమాల



వి. ఎ. కె. రంగారావు

కొంత మంది పఠితలు అప్పుడప్పుడూ వ్రాస్తూ వచ్చారు పాత రికార్డులు కావాలంటే యెలా దొరుకుతాయని. నేను వెళ్ళినపుడు సుమారు ఒక వంద రికార్డులను కొని తెచ్చుకున్నాను. ఈ పాత వాటిలో చాలమట్టుకు యంగ్ ఇండియా, బుల్‌బుల్ కంపెనీలవి. తక్కినవి కూడా స్వల్పంగా ఉన్నవి. పాతవని వీటిని ఉపేక్షించ నవసరం లేదు. ''బాలరాజు''లో ఎస్వరలక్ష్మి పాడిన అపూర్వ గీతాలూ, ''స్త్రీ సాహసం''లో సుబ్బరామన్ చేసిన అమర గీతాలు, ''రత్నమాల'లో భానుమతి పాడిన అతి సుందర గీతాలూ యంగ్ ఇండియా లోనివే. ఇక బుల్‌బుల్‌వి పాత హిందీ పాటలు, మెలోడి కంపెనీవి ''హరిశ్చంద్ర'', ''సొంత వూరు'' మొదలైన చిత్రాల లోనివి. వీటిల్లో చాల చక్కని పాటలు ఉన్నాయి. ఈపై రికార్డులు కాకినాడ గిరి యెండ్ కంపెనీలోనూ, తెనాలి శ్రీనివాస స్టోర్స్‌లోనూ, బందరు ఫ్లవర్ కంపెనీలోనూ, విశాఖ వైజాగ్ యెంపోరియమ్‌లోనూ, గుడివాడ కృష్ణా ఫాన్సీలోనూ ఉన్నాయి. రద్దీలేని సమయంలో వెళ్లి అడిగితే ఓపికతో చూపిస్తారు. కనీసం నాలుగైదన్నా మంచివి దొరుకుతాయి తప్పక. ప్రయత్నించి చూడండి.

* * *

మరొక ముఖ్యమైన విషయం. నన్ను కొన్ని చోట్ల సన్మానించారనే వార్త కొన్ని పత్రికలలో పడినది. ఇందులో కొంచెం పొరపాటు జరిగినది. జరిగింది సన్మానసభలు కాదు. నేను పాఠకులను కలుసుకోవడానికని కొందరు యేర్పరచిన సమావేశాలూ, అల్పాహార విందులూ, వేళా పాళాలేకుండా వేడి పానీయాలు సేవించడాలు. వీటి గురించి వర్తమానం పత్రికలకు పంపినపుడు ''రిసెప్షన్'' అనే ఆంగ్ల పదం వాడి ఉండటం దానిని కొందరు సన్మానం అని అనువదించడం వలన జరిగిన తంతు ఇది అంతా.

సమావేశాలు తెనాలిలో నటనాలయ వారు, యువ సమాజ్ వారు యేర్పాటు చేశారు. మొదటి దానిలో నే నెన్నో రోజుల నుంచి కలుసుకోవాలని ఉవ్విళ్ళూరుతున్న అసమాన హాస్య నటి స్వరాజ్యలక్ష్మిని కలుసుకోవటం, ఆమె పాట వినటం జరిగింది. ఆ సంస్థ కార్య నిర్వాహక వర్గంలో ఒకరైన జాన్సన్ సుమధురంగా దాశరధి గేయాన్ని ఒకటి వినిపించడం జరిగింది. ఈ సమావేశంలోనే నలుగురూ చెప్పుకునే తెనాలి రసికత్వం మూర్తీభవించిన ఒక వ్యక్తిని కలుసుకునే, మాటలతో పోటీపడే, చివరికి వోడింపదలచి వోడిపోయే అదృష్టం కలిగింది. అవును మరి శివునిపై జావళీలు వ్రాస్తే మరే మవుతుంది!

యువ సమాజ్ వారు యేర్పాటు చేసిన కలయిక ఇంకా ''ఇన్ ఫార్మల్''గా జరిగింది. ఈ చోటనే యెంతో నిశితంగా సరాగమాలను— చదువుతున్న పఠితులను కలుసుకో గలిగాను. ఇక్కడ ప్రసంగాలు యేవీ జరగలేదు కానీ పఠితల ప్రశ్నలకు నేను జవాబు చెప్పడం ఒక ప్రశ్నోత్తర శీర్షికలాగా నడచింది. దీనిని నిర్వహించినది ఎస్. బి. చౌదరి.

ఏలూరులో సుమారు పదిహేను కళా సముతులు కలసి గెడ్డం ప్రభాకరరావు అధ్వర్యాన, డాక్టర్ శంకర శ్రీరామారావు అధ్యక్షతన సభ జరిగింది. వీరి గురించి పాఠకులు తెలుసుకోవలసినది చాలా ఉంది. పైవారం వ్రాస్తాను. ఈ సభకే నా ప్రియతమ జానపద రచయితలలో ఒకరైన కొనకళ్ల వెంకటరత్నం (ముసురేసిందంటే పైన అసలే మతి పోతది మామా) వచ్చారు. కాని వారితో అయిదు నిమిషాలు కూడ మాట్లాడటానికి వ్యవధి లేక పోయిందే అని చాలా చింతించాను.

గుంటూరులో సి. నారాయణరెడ్డి అభిమానులు ఒక నలుగురు నాపై (అవును పగలే వెన్నెల గురించే) దండెత్తారు. సామాన్యంగా కాదు. రూముకి తీసుకు వెళ్లి, తినడానికి ఫలహారం ఇచ్చి టీ త్రాగించి మరీ. విద్యావంతులూ, వివేకవంతులూ అయిన వీరందరూ నాతో యేకీభవించారని చెప్పలేను గాని సి. నా. రే. అంటే అసూయతో వ్రాశానని అనుకోలేదు, సి. నారే పాటలన్నీ అందులో ఒకరు ఒక పుస్తకంలో భద్ర పరుస్తున్నారు. పాటతో బాటు నేను సరాగమాలలో ''నా పేరు సెలయేరు'' ''మదన సుందర'' వంటి అద్వితీయ గీతాల గురించి వ్రాసినది పొందు పరచారు. అక్షణంలో చాల గర్వించాను. భర్తృహరి సుభాషితం గుర్తుకు వచ్చినది. పూలతో కలసిన నార కూడ శిరోధార్యమే గదా అని. లేకపోతే నాలుగు దశాబ్దాలైనా వన్నె తరుగని ఆ రచన లెక్కడ, వారం వారం ఉబుసుపోకకు వ్రాసే సరాగమాల యెక్కడ ? ?

* * *

గుప్త స్వరాలు :

మూగమనసులు చిత్రంలో మొదటి పరిచయ వాక్యాలు పలికినది ఆత్రేయ. ఎంత మంది పాఠకులు ఆ సంగతి కనిపెట్టారు ? ఆత్రేయ ''ఆదర్శం''లో ఒక వేషం వేసిన విషయం కొంత మందికి తెలిసే ఉంటుంది.

* * *

నాలుగేళ్ళుగా సినిమాలో పాడని ప్రఖ్యాత గాయకి బాలసరస్వతీదేవిచే మళ్లీ పాడించటానికి ప్రయత్నాలు జరుగుతున్నాయని అధికార వార్త.





'దాగుడుమూతలు చిత్రం'లో యన్. టి. రామారావు.

ముద్దా చిట్టిబాబు

# "కాశీపట్నం చూడరబాబు..."



కాశీ మందిర స్వర్ణ గోపురం.

—ఫోటో : జితేంద్ర అగ్రవాల్.

గంగా తరంగ రమణీయ జటాకలాపం
గౌరీ నిరంతర విభూషిత వామ భాగమ్
నారాయణప్రియ మనంగ మదాపహారం
వారాణసీ పురపతిం భజ విశ్వనాథమ్.

కాశీపతి విశ్వనాథుడు, ఆయన సతి అన్నపూర్ణ, ఆమె సవతి దుర్గాంబ. వీరి బిడ్డడు డుంఠి గణపతి. వాహనం నందీశ్వరుడు. వీరికి తోడు భైరవుడు. వీరందరూ వెలసిన నగరం కాశికాపురం.

"అయోధ్యా మధురా మాయా
కాశీ కాంచి అవంతికా
... పురీద్వారవతీ ..." అనే మోక్షదాయకమయిన సప్త పురాణాలలో ఒకటి ఈ ముక్తి పురి. ఉత్తరంగా వరుణ, దక్షిణంగా అసి అనే రెండు నదుల మధ్య వెలసింది వారణాసి. గంగానది ఉత్తరంనుంచి దక్షిణంగా ప్రవహిస్తున్నా కాశీలో మాత్రం దక్షిణంనుంచి ఉత్తరంగా ప్రవహిస్తోంది. ఇదీ కాశీ గంగ ప్రత్యేకత.

మానవుడు కోరికల పుట్ట. ఆ కోరికలు తీరటానికని తీర్థయాత్రలు చేస్తాడు. దేవుళ్ళను కొలుస్తాడు. అయితే — అంతటి ప్రియమైన కోరికలనూ కాశీలో వదిలి పెడతాడు. ఎక్కువ మక్కువయిన ఏదో ఒక పదార్థాన్ని కాశీలో విధిగా వదలాలని నియమం.

తిరుపతి వెంకన్నకు భక్తులు నీలాలు, నిలువు దోపిడులు ఇస్తారు. గయలో పితురులకు తర్పణాలు వదులుతారు. విశ్వనాథుడు వెలసిన గంగా తీరంలో జీవితాంతం గడపటానికి, జీవితాన్ని చాలించటానికీ సిద్ధపడతారు. 'కాశ్యాంతు మరణాన్ముక్తిః' అని పెద్దల వాక్యం.

కాశికి మహా స్మశానమని మరొక పేరు. పూర్వ కాలపు కాశీయాత్రను 'వెనుకాశీయాత్ర' అన్నారు. గుంపులు గుంపులుగా బయల్దేరిన యాత్రికులు కాలినడకని సాగుతూ, మజిలీలు చేసుకుంటూ ఎప్పటికో— ఎన్నటికో చేరుకునే వారు. అలా వెళ్ళినవాళ్ళు మళ్ళీ తిరిగి వచ్చేదాకా నమ్మకం లేదు. కాగా... కాశికి వెళ్ళినవాళ్ళూ, కాటికి వెళ్ళినవాళ్ళూ ఒకటే అనుకునేవారు. అయితే — అంత దూరం వెళ్ళలేక మాకు 'గడపలోనే కాశీ' అనుకుని తృప్తిపడే వాళ్ళూ ఉన్నారు.

సంస్కృత విద్యలకు కాణాచి కాశీపట్నం. కాశీ పండితులంటే పూర్వం ఎంతో గౌరవం. సరస్వతిని ప్రసన్నం చేసుకున్న ఈ పట్నంలో ఈ నాడు బనారస్ హిందూ యూనివర్శిటీ స్థానం



కాశీలో బిర్లాలు కడుతున్న ఒక దేవాలయం.

—ఫోటో : జితేంద్ర అగ్రవాల్.

విర్వరుచుకుంది. భారతీయ గురుకుల పద్ధతిలో విద్యలు నేర్పటం ఇక్కడి ప్రత్యేకత. విశ్వ విద్యాలయం ఆవరణలో మాలవ్యాజీ నిర్మించిన పెద్ద శివాలయం చూసి తీరాలి.

హిందూ, బౌద్ధ, మహమ్మదీయ మతాలు వర్ధిల్లిన నగరం వారణాసి. మన పురాణేతిహాసాలలో కాశీపుర ప్రశంస అడుగడుగునా అగుపిస్తుంది. బుద్ధ భగవానుడు తన అయిదుగురు శిష్యులకూ ధర్మోపదేశం చేసిన మృగదావం— సారనాథ్ — ఇక్కడికి దగ్గరే ఉంది. మన అశోక చక్రం సింహం గుర్తూ ఇక్కడివే. బుద్ధ జాతక కథలు— ఫలానా రాజు కాశీనగరాన్ని పాలించే టప్పుడు — అంటూ ప్రారంభమవుతాయి.

విశ్వనాథాలయాన్ని ఆనుకుని మసీదు ఒకటుంది. నిజం చెప్పాలంటే— ఈ మసీదే పూర్వం విశ్వేశ్వరుడి గుడి. ఔరంగజేబు కాలంలో— హిందూ మతానికి ఆపద వచ్చిన ఆ నాడు— మన విశ్వనాథుని గుడి మసీదుగా మారింది. అప్పుడు విశ్వేశ్వరుడు పక్కనున్న నూతిలో దాక్కున్నాట్ట! ఆ నాడు కాశీపతిని కాపాడిన ఆ నుయ్యే జ్ఞానవాపి. జ్ఞానవాపిలోని తీర్థాన్ని పవిత్రంగా భావిస్తారు యాత్రికులు.

కాశిలో ఎక్కడ చూసినా శివలింగాలే! ఎటు చూసినా శివాలయాలే ఏ ఘట్టంలో స్నానంచేసి ఏ మార్గాన్ని విశ్వనాథుడి దర్శనానికి బయల్దేరినా ఈ లింగాలూ, ఆలయాలూ మనకి అడుగడుగునా అగుపిస్తాయి. లెక్క ప్రకారం వారణాసిలో ఘట్టాలు 360. తీర్థాలు 360. ముఖ్య లింగాలు 360. కాని, ఈ నాడు మనకు వీటిలో కొన్ని మాత్రమే కనబడతాయి.

గంగానది పొడుగునా కలకల్లాడుతూ మనల్ని ఆహ్వానించే ఘట్టాలలో— కేదార, మణికర్ణిక, దశాశ్వమేధ, హరిశ్చంద్ర, హనుమాన్, అహల్యాబాయి ఘట్టాలు దర్శించి తీరవలసినవి. ఇవి ఒక్కొక్కటే ఒక్కొక్క పురాణ కథను, పూర్వ గాథను పెనవేసుకుని ఉన్నాయి. ఇటువంటి పవిత్ర భాగీరథీ తీరంలో



మందిరాన్ని మార్చి కట్టిన ఔరంగజేబు మసీదు.

—ఫొటో: మహేంద్ర అగ్రవాల్.



నిరంతరం యాత్రికులతో కిటకిటలాడే వారణాసి స్నానఘట్టాలు.

—ఫొటో: వి. వి. అప్పారావు

తనువు చాలించాలని ప్రతి ప్రాణీ ఉబలాట పడటంలో వింతలేదు.

'పదునొకండు విధముల
ప్రణుతికెక్క
వెలయు బంద్రెండు గనుపుల
విల్వ పట్టు
గర్మ పాశ విత్ర
విఖ్యాతి మెరయు
కాశిలో మేను దొరగిన

63 వ పేజీ చూడండి

## కాశీలో నాలుగు ఘట్టాలు!

○ విష్ణుమూర్తి తన చక్రంతో ఒక కోనేటిని తవ్వాడు. తవ్వి ఆ కష్టం వల్ల వంటిని పట్టిన చెమటతో ఆ కోనేటిని నింపాడు. ఏటి వడ్డున కూచుని ఈశ్వరుడ్ని గురించి తపస్సు చేశాడు. శివుడు ప్రత్యక్షమై కోనేటిలోకి తొంగి చూస్తూ ఉండగా ఆయన కర్ణాభరణం ఒకటి అందులో జారిపడింది. కాశీలోని మణికర్ణికా ఘట్టమే కేశవుడు నిర్మించిన ఆ కోనేరు.

* * *

○ 'నేను గొప్ప అంటే నేను గొప్ప' అని బ్రహ్మదేవుడూ పరమేశ్వరుడూ ఒకసారి తగాదా పడ్డారు. ఈశ్వరుడు భైరవుణ్ని సృష్టించి బ్రహ్మదేవుడి ఐదో తలకాయ తెగ్గొటించాడు. అయితే తెగిపడ్డ ఆ తలకాయ భైరవుడి చేతిని అంటుకుని వూడి వచ్చింది కాదు. విష్ణుమూర్తి సలహా ప్రకారం ఆ కపాలాన్ని కాశీలో పాతిపెట్టాడు. అదే కపాల మోచన తీర్థం.

* * *

○ కాశీ నగరాన్ని ఒకప్పుడు దివోదాసుడు పరిపాలించాడు. అతన్ని రాజ్యం నుంచి తొలగించమని సూర్యుడ్ని నియమించాడు, పరమ శివుడు. దివోదాసుడ్ని పదభ్రష్టుడ్ని చేయటానికి సూర్యుడు లోలార్క, ఉదయార్క మొదలయిన రూపాలతో కాశీలో కాచుకుని ఉన్నాడు. ఈ లోలార్కుడ్ని కాశీలో ఈ నాటికీ చూడవచ్చు.

* * *

○ కాశీ క్షేత్రంలో సులక్షణ అనే కన్య ఉండేది. ఆమెకు కన్యగండం ఉందని, ఆ విచారంతో ఆమె తలిదండ్రులు కాలం చేశారు. తలిదండ్రులు పోయారన్న దుఃఖంతో సులక్షణ పరమేశ్వరుడ్ని గురించి తపస్సు చేసింది. అలా తపస్సు చేస్తూండగా ఒక మేక వచ్చి ఆమెతో చేరికగా వుంటూ వచ్చింది.

సులక్షణ తపస్సుకు మెచ్చి శివుడు ప్రత్యక్ష మయ్యాడు. వరం కోరుకోమంటే 'దేవా! —ముందీ మేకకి వరమియ్యండి. తరవాత నేను కోరుకుంటాను' అంది.

ఆమె ధర్మ బుద్ధికి మెచ్చి ఈశ్వరుడు వాళ్లిద్దరికీ వరాలు ప్రసాదించాడు.

మేక వరం పొందిన ఆ పవిత్రస్థలం 'బర్కరీ తీర్థం' అనే పేరుతో కాశీలో మనల్ని పలకరిస్తుంది.



# ఆ కిటికీ

గోవిందరాజు శ్రీనివాసమూర్తి

అప్పుడే డాక్టరు వచ్చి ఇంజెక్షను ఇచ్చి వెళ్లాడు.

"చక్రాల కుర్చీ"లో కూర్చుని ఉన్న ఆనందరావు కాళ్లమీదకు దుప్పటి లాక్కున్నాడు. సగం తాగి వదలి పెట్టిన కాఫీ మళ్లా తాగాలని ప్రయత్నించాడు. కాని అది అప్పటికే చల్లారిపోయింది.

"అమ్మా, కొంచెం కాఫీ ఇవ్వు." వంటింట్లోకి కేకేశాడు.

"అలాగే నాయినా" —వంటింట్లోంచి అమ్మ కంఠం.

వీల్‌ఛేర్ లాక్కుంటూ పుస్తకాల ర్యాక్ వద్దకు వెళ్లాడు. 'క్రైమ్ అండ్ పనిష్‌మెంటు' ఇవతలకు తీశాడు. అప్పటికది రెండు మార్లు చదివాడు. అం ునా, మళ్లా చదవాలనిపిస్తుందతడికి. అప్పటికప్పుడే నవలలో నిమగ్నమై పోయాడు. అమ్మ కాఫీ తెచ్చి ఇచ్చినప్పుడు గాని, కాఫీ అడిగిన మాట గుర్తుకు రాలేదతడికి.

కాఫీ తాగుతూ "డాక్టరు ఏమన్నాడమ్మా?" అనడిగాడు.

"త్వరలో నయం అవుతుందన్నాడు నాయినా. మరేమి కంగారు పడకండన్నాడు."

"నువ్వు నమ్మావా అమ్మా".

ఒక్క క్షణం అతడి ముఖంలో చిరునవ్వు ఉదయించి వెంటనే అంతర్థానమయింది.

అమ్మ లోనికివెడుతూ పమిట చెంగు నోటికడ్డం పెట్టుకోవడం అతను గమనించక పోలేదు.

*　　*　　*

ఇవాళ్టికిది ఆరో రోజు.

విశాఖ పట్నం పెద్ద ఆస్పిటల్‌లో గడిపిన ఆరు నెలలూ ఆరు యుగాలయినా, ఈ ఆరు రోజులు ఆరు క్షణాల్లా దొర్లి పోయాయి. స్వంత ఇంటి మహత్యం అటువంటిది. ఇక్కడకు మళ్లా తిరిగి వస్తానని అతడు ఏనాడూ గ్రాహించలేదు— అందుకే అతని ఆనందానికి అవధి లేదు.

నవల వళ్లోపెట్టుకొని కుర్చీ జరుపుకుంటూ వరండాలోకి వచ్చాడు. తోటమాలి మొక్కలకు నీరు పెడుతున్నాడు. గోడ పక్కని మందార పువ్వులు గర్వంగా ఊగిసలాడుతున్నాయి. దొడ్డంతా కమ్మటి మట్టి వాసన వెదజల్లుతూంది—.

ఆకాశంకేసి చూశాడు.

మబ్బులన్నీ చెల్లా చెదురుగా పరుగెడుతున్నాయి.

అలా చూస్తూ సాయంత్రాలు గడిపేయగలడు. మధ్యాహ్నం మాత్రం గదిలో బంధింపబడ్డ ఖైదీలా అనుపిస్తుందతడికి.

చిన్న నాడు స్కూల్లో ఫుట్‌బాల్‌ఆటలో మొదటి బహుమతి గెల్చుకున్న తన కాలికేసి చూసుకున్నాడు. అది ఈ నాడు సగం మాత్రమే మిగిలి పోయింది. మిగతా సగం కూడా పోవచ్చు. డాక్టర్ల మాటల మీద అతడికి ఎంత మాత్రం నమ్మకం లేదు. వాళ్ళు నమ్మించి గొంతు కోస్తారని అతడివిశ్వాసం.

విశాఖ పట్నంలో ఛీఫ్ సర్జను అనలా మరి, "నీకేం భయం లేదు. మామూలుగానే నడుస్తావ్" అని 'ఏదీ అతడి మాట నిజమయితే సగంకాలేమయింది? ఈ డాక్టరు కబుర్లూ అంతే'—

పిట్టలు గూటికి చేరుకుంటున్నాయ్— వాటి జీవితమే హాయి. వాటికి డాక్టర్ల బాధ లేదు. తనను మానవ జన్మ ఎత్తించిన భగవంతుడ్ని కోపగించుకున్నాడు ఒక్క క్షణం. నిట్టూర్చి మళ్లా నవలలో మునిగి పోయాడు.

రాత్రి ఎనిమిదయింది. గదిలో టేబిల్ మీద అన్నం వడ్డించి కేకేసింది అమ్మ.

అతడు భోంచేస్తున్నంత సేపూ అమ్మ కంట తడి పెట్టుపెట్టుకుంటూనే ఉంటుంది—అదీ సహించలేదతడు.

"ఒక కవి ఏమన్నాడో తెలుసా అమ్మా?—'ఒక కాలువిరిగితే రెండు కాళ్లూ విరగలేదని సంతోషించు' అని. నాకేం అమ్మా, ఇంకో కాలు ఉంది—పైగా నువ్వున్నావ్."

అమ్మ వలవల ఏడ్చింది. అతడి ముఖం మాత్రం ప్రశాంతంగా ఉంది. అమ్మ ఏడుపు అతడికి అలవాటే.

"అదే వద్దంది అమ్మా! భగవంతుడికి ఏ నాడో అపచారం చేశాను. వూరికే ఎతడు నామీద కక్ష పెట్టుకోడుగా."

అమ్మ లోపలకు వెళ్లి పోయింది.

ఆనందరావుకు తను ఎరుగున్నంత వరకూ తండ్రి గుర్తు లేదు. తన చిన్న నాడే ఆయన ఇహలోకం చాలించాడు. అప్పటినుండి అమ్మే తనకు సర్వస్వం అయింది. ఆమెకు ఈ ఆనందం కూడా లేకుండా ఈ లోపం తనకు ందుకు కలిగించాడో భగవంతుడు! ఏదో అపచారం చేసే ఉంటాడు.

రాత్రి బాగా పొద్దు పోయాక కాని నిద్ర పట్టదు ఆనందరావుకి. ఏ పదకొండో అయితే గాని ఆ కుర్చి వదిలి పక్క మీదకు చేరలేడు. పక్కమీద నడుం వాల్చి కిటికీలోంచి కనుపిస్తున్న నక్షత్రాలను లెక్క పెట్టి లెక్క కుదరక ఏ అర్ధరాత్రో కునుకు పడు

టుంది—ఒక సంవత్సరంగా ఈ అలవాటు మారలే దతడికి.

*  *  *

మర్నాడు పొద్దుట కాఫీ తాగి పేపరు తీసుకుని గదిలోనే కిటికీవేసి కుర్చీ జరుపుకున్నాడు ఆనందరావు. మరో రెండు నిముషాల్లో అతడి దృష్టి నాకర్షించింది పక్కింటి కిటికీ—చువ్వల వెనగ్గా బొట్టు పెట్టు కుంటున్న ఒక అందమయిన ముఖం!

మరో మాటు ఆశే చూశాడు. నల్లటి చువ్వల వెనగ్గా బొట్టు పెట్టుకొంటున్న అందమైన తెల్లటి ముఖం. క్షణంలో మాయమైంది. అవతల గదంతా చీకటైంది!

మెత్తగా నవ్వుకుని వార్తల్లో మునిగి పోయాడు ఆనందరావు.

ఆ రోజు సాయంత్రమే ఆ ముఖం మళ్లా క్షణ మాత్రం కనుపించి అదృశ్యమైంది. మర్నాడు పొద్దుటా అంతే.

మధ్యాహ్నం అమ్మని అడిగాడు—పక్కింట్లో ఎవ రని ?—

"ఎవరో నాయినా, రిటైర్డు తాసిల్దారుగారట. మూడు రోజులాయె అద్దెకొచ్చారు." అంది.

అంతకు ముందు మూడు నెల్లుగా ఆ ఇల్లు ఖాళీగా ఉందని అతడు ఎరగడు.

తర్వాత వారం రోజుల్లోనూ పది పన్నెండుసార్లు ఆ ముఖం కనిపించిందతడికి. కనుపించిన ఒక్క క్షణంలోనూ అతడి వళ్లు గగుర్పొడిచేది. ఆ గగు ర్పాటుకే మళ్లీ సాయంత్రం దాకా నిరీక్షించేవాడు. ఒక్కోమాటు నిరాశ పడేవాడు. ఒక్కోమాటు ఒకే నిముషంలో రెండు మూడు మాట్లు వళ్లు గగుర్పొ డిచేది.

పదిహేను రోజుల్లో నవలలు చదవటం పూర్తిగా మరిచి పోగలిగాడు—ఆ ముఖం—నక్షత్రాలు ఇవే అతడికి హాయిని ఇస్తున్నాయ్.

డాక్టరు ఇంజక్షనులకు చురుక్కుమన్న పోటు కూడ మరుక్షణమే పోతున్నది—ఆ కిటికీ హాయినిస్తు న్నదతడికి.

ఒక రోజు డాక్టరు అమ్మతో "లాభంలేదు. మళ్లీ ఎగ బెట్టింది. మద్రాసుకు తీసుకెళ్లండి" అనడం విన్నాడు.

మిగతా సగం పోయేందుకేగా—

మద్రాసునుంచి తిరిగి రానీకుండా చేయమని మన స్సులోనే భగవంతుడికి నమస్కారం చేసుకున్నాడు.

"మద్రాసు వెళ్లాలంటున్నారు. డాక్టరుగారు" అమ్మ అన్నమాట తనకు వినిపించినా మాట్లాడ లేకపోయాడు.

మూడు రోజుల తర్వాత మద్రాసుకు బయలు దేరాడు ఆనందరావు. అమ్మ కావలసిన సామానంతా సర్దింది. బయలుదేరేముందు ఆ కిటికీ వంక చూశాడు. కాని ఆ ముఖంమాత్రం కనుపించలేదు. అతడి హృదయం బరువెక్కింది. కాని వెళ్లటం తప్పలేదు.

*  *  *

ఆర్నెల్ల తర్వాత కాలిలో మరికొంత భాగాన్ని మద్రాసుకు అర్పితం చేసి తిరిగి స్వస్థలం చేరుకున్నాడు ఆనందరావు.

ఇంట్లో అడుగు బెట్టినవెంటనే ఆతృతగా ఆ కిటికేసి వెళ్ళాడు. అప్పటికప్పుడే ఆ ముఖం కనుపిస్తే బాగుండునని అతడి మనసు ఉబ లాట పడుతున్నది. అప్పుడు కాని అతడికి తెలిసిరాలేదు. — తాను అత్యంత ప్రీతిపదంగా హృదయంలో దాచుకున్న వస్తువుల్లో ఆ ముఖం ఒకటని—లేకపోతే తనకా ఆతృత ఎందుకు?

ఆ సాయంత్రంకూడ ఆమె కనుపించలేదు. మర్నాడూ అంతే— అలాగే మూడు రోజులు గడచి పోయినై. వళ్లంతా కళ్లు చేసుకుంటున్నాడు, కాని ఆమె కనుపించటంలేదు.

అమ్మ కాఫీతెచ్చి టేబిల్‌మీద పెడుతూంటే అడిగాడు. 'అమ్మా పక్కింటిలో ఓ అమ్మాయి కనుపిస్తూండేది?—ఆమె ఇప్పుడు ఇక్కడ లేదా?' అని— ఈ విషయం అడిగేందుకు అతడి కెంత సిగ్గేసిందని!

అమ్మ నవ్వింది. 'ఆ అమ్మాయి తాసీల్దారు గారి మూడో అమ్మాయి. రెండు నెల్లక్రితం పెళ్లయి అత్తారింటికి వెళ్లిందట!'

ఆపైన అమ్మ ఏంచెప్పిందో అతడికి వినపడ లేదు. కుర్చీలో అలాగే వెనక్కువాలి పోయాడు.

అరగంట తర్వాత నెమ్మదిగా పుస్తకాల రాక్ వద్దకు చేరాడు. ఏ పుస్తకమూ ఇవతలకు తీయ బుద్ధి పుట్టలేదు. పేపరు చదవబోయి విసుగుతో విసిరి టేబుల్‌మీద పడేశాడు. కిటికీలోని పూల కుండీలోని పువ్వు కోయబోయి కుండునే కింద పడేశాడు. ఎందుకో అతడి మనసు మనసులో లేదు. వరండాలోకి వచ్చినా అతడి మనసు ఈ లోకంలోకి రాలేదు.

తోటమాలి అప్పుడే మొక్కలకు నీరుపెడు తున్నాడు. గోడపక్కని మందార పూవులు కళా విహీనంగా వూగిసలాడుతున్నాయి. దొడ్డంతా ఆవిరి ప్రసరిస్తున్నది. ఆకాశంలోని మబ్బులన్నీ భయంతో పరుగెడుతున్నాయి.

అమ్మ దొడ్లోకి వచ్చింది. ఇన్ని మందార పువ్వులు కోసి వళ్లో పోసుకుని లోనకెడుతున్నది.

'అంటే అమ్మా, ఆ అమ్మాయి తిరిగి రాదా?'

అమ్మ నవ్వుకి అంతులేదు— ఆ నవ్వులో జాలి కూడ మిళితమైయుంది.

'అదేం ప్రశ్న నాయనా పెళ్లయింతర్వాత ఆమె భర్త ఇష్టం.'

'వూహూ,' అనగలిగాడు.

తనకు ప్రసాదించిన ఈ కొద్ది ఆనందాన్నికూడ లాక్కుపోయిన భగవంతుడికి రూఢిగ తనమీద కక్ష అని నిర్ణయించుకున్నాడు.

*  *  *

ఈసారి అతడు వేలూరు ఆస్పత్రికి వెళ్లి రావలసి వచ్చింది. మూడు నెలలకు తిరిగి స్వస్థలం చేరు కున్నాడు. ఇప్పుడుమాత్రం కాలు యథా ప్రకారం గానే ఉన్నది. వేలూరు ఆస్పత్రంటే అతడికి గురి ఏర్పడ్డది. మొదలే అక్కడకు వెళ్లి ఉంటే బాగుం డేదేమో!

వచ్చిన రోజు రాత్రి భోంచేసి పడక మీదకు చేరి నక్షత్రాలను లెక్కపెడుతున్న సమయంలో పక్కింటి కిటికిలోంచి నవ్వులు వినిపించాయి. అందులో ఓ స్త్రీ కంఠం కూడ ఉంది. పడకమీంచి కుర్చీలో అతికష్టంమీద కూర్చుని గబగబా కిటికీ కేసి వెళ్లాడు. అవతల కిటికీ తలుపులు మూసి ఉన్నై. క్షణకణానికి నవ్వులుమాత్రం వినపడు తున్నై. ఎవరైయుంటారు.? ఆ స్త్రీ కంఠం ఎవరిది?— తాను ఎరిగున్న అమ్మాయిదా?— లేక మరొకరిదా ?— మరి రెండో కంఠం ఎవరిది అతడి ప్రశ్నలకు సమాధానం దొరకలేదు. అప్పటి దాకా వినిపించిన నవ్వులు ఇహ వినపడనూ లేదు. అతడూ పక్కమీదకు మెల్లిగా చేరాడు.

పొద్దుట అమ్మ చెబితే కాని తెలియలేదు. ఆ నవ్వులు తనకు కిటికీలో కనుపించే అమ్మా యివీ—ఆమె భర్తవీ నని. ఆమె, ఆమె భర్తా ఇక్క డకు వచ్చి నెలరోజులయిందట. ఈ మాటలు వింటూంటే అతడి హృదయం కెరటంలా ఉరి కింది; విహంగంలా విహరించింది.

ఆ క్షణం నుంచీ ఆ కిటికీ వైపు నుంచి దృష్టి మరలించలేక పోతున్నాడు. ఆమె ఏ నిముషా నైనా కనుపించవచ్చు. వివాహం అయిం తర్వాత ఆమె ముఖంలోని మార్పును చూడాలని అతడి మనసు ఉవ్విళ్లూరుతున్నది.

మధ్యాన్నం మాత్రం లీలామాత్రంగా కనుపించి. అతడి హృదయంలో దీపం వెలిగించి మాయ మైంది. సాయంత్రమూ అంతే!

రాత్రి మాత్రం తాను నక్షత్రాల లెక్కలో సతమత మౌతూంటే పక్కింటి కిటికిలోంచి సంగీతంలా నవ్వులు వినిపించేవి. మధ్య మధ్య భయంకరమైన నిశ్శబ్దం. మళ్లీ అవే నవ్వులు— లోకం యావత్తూ నవ్వుతున్నట్టు అనిపించిం దతడికి.

రోజులు నిముషాల్లా దొర్లిపోతునై. కాలి బాధ అతడికి తెలియటంలేదు. ఇంజెక్షన్ల మరుకు అసలు తెలియటంలేదు. ఆమె నవ్వులో అతడికి జీవితం మూడు పూవులూ, ఆరు కాయ లైంది. దొడ్లోని మందారలన్నీ కైపెక్కి విలా సంగా వూగిసలాడుతున్నాయి. ఎక్కడనుంచి వచ్చిందో ఈ హాయి!—జీవితం అంటే తీయని కలగా పరిణమించిందతడికి.

అతడి ముఖంలోని ప్రశాంతతకు అమ్మ అబ్బురపడుతున్నది. అప్రయత్నంగా 'పిచ్చి నాయన' అనుకుంటుంది.

ఒకరోజు అర్ధరాత్రి, ఎంత వేసంకాలం అయినా అలవాటు ప్రకారం గదిలోనే పడు కుంటానని పట్టుబట్టాడు ఆనందరావు.

"ఉక్క పొయ్యదురా నాయనా ?"

'ఫాన్ ఉందిగా.'

అమ్మ ఇహ మాట్లాడలేదు. అతడి ఇష్టం ప్రకారమే గదిలో పడుకున్నాడు.

రాత్రి పదకొండు అయుంటుంది.

అతడు తన గదిలో కిటికీ పక్కన చీకట్లో కుర్చీమీద కూర్చుని ఉన్నాడు. పది నిముషాల్లో పక్కింటి కిటికీ బార్లా తెరువబడింది. వెంటనే అతడికి కనుపించిన దృశ్యం అతణ్ణి చకితుణ్ణి చేసింది. అదే—అదే అమ్మాయి, వేయి సూర్యుల కాంతితో వెలిగిపోతున్న ఆ అమ్మాయిని రెండవ వ్యక్తి బలంగా దగ్గరకు లాక్కుంటున్నాడు!

ఆనందరావు గజగజ వణికిపోయాడు. అతడి ముఖం సిగ్గుతో కుదించుకుపోయింది. ఇవతలకు

64 వ పేజీ చూడండి

"ఒరేయ్! బాబిగా! ఈసారి లేవక పోతే నేనే లేపి కూర్చో బెడతాను. ఏమను కుంటున్నావో, గంటనుంచీ అరవలేక చస్తున్నాను— మళ్ళా ముసుగు పెడుతున్నావూ? కొంటె వెధవా! ... ఏడు దాటుతోందిరా! నేనిక వంటాగింటా చూసుకోవద్దూ? లేచిరా! మొహం కడుక్కో. నీళ్ళుపోస్తాను - లేస్తున్నావా?''

ఓ అరగంట నుంచీ అలాగే అరుస్తోంది శకుంతల ఉండీ ఉండీ. ఐదారు నిముషాలకోసారి గది గుమ్మం దగ్గరికెళ్ళి కొడుకు పవ్వళించిన మంచంకేసి తొంగి చూసి వెనక్కి వస్తోంది. ఏడేళ్ల బాబిగాడికి పొద్దుటే లేచి మొహం కడుక్కోవటం — నీళ్ళోసుకు బట్టలు మార్చటం— తిండి తినగానే బడికి పోవటం— లాంటి కార్యక్రమం బొత్తిగా గిట్టనిది. వాళ్ళమ్మ ఎంత అరుచుకుంటోన్నా తనకి పట్టనట్టు, దుప్పటిగళ్ళు లెక్క పెడుతూనో— దారాలు లాగి వేళ్ళకి చుట్టుకుంటూనో— అమ్మ వచ్చేస్తోన్న పడి విప్పేస్తే దుప్పట్లో దూరి కళ్ళు బిగించేస్తూనో— ఏదో ఒకటి చేస్తూ గమ్మత్తుగా సాధ్యమైనంత ఎక్కువ కాలం మంచం మీద గడపటానికో ప్రయత్నిస్తూంటాడు. చివరి కెప్పటికో విసిగి పోయిన శకుంతల అట్లకాడపట్టుకు రుసరుస లాడుతూ గదిలోకి వచ్చేస్తోంటే— "లేచి పోయానే అమ్మా !" అంటూ నవ్వేస్తూ మంచం దూకి ఎదురు పరుగెడతాడు— పాపం బాబిగా డెందుకైనా పరధ్యాన్నంగా ఉన్నప్పుడు ఆ ఫలితం కాస్తా వీపు భరించటం కూడా కద్దు.

"ఏంరా ? లేవవురా ? నే వచ్చేదా ?" శకుంతల మళ్ళా కేక పెట్టింది. బాబిగాడు నెమ్మదిగా బుర్ర మీదికి దుప్పటి జరుపుకున్నాడు. ఎంతకీ సుపుత్రుడు లేచి వచ్చే జాడ లేకపోతే శకుంతల నిజంగానే అట్లకాడ పట్టుకు బయల్దేరింది విసురుగా.

మ్యావ్. . . . మ్యావ్. . .

"ఎక్కడబ్బా ! తెల్లారినప్పట్నుంచీ ఇలాగే పిల్లి పిల్లలేవో అరుస్తోన్నట్టు వినిపిస్తోంది. . ."

మ్యావ్. . . . మ్యావ్. . .

"బావుంది. కొట్టుగదిలో పిల్లిగాని ఈనిం దేవిటి ఖర్మ" శకుంతల దారి కాస్తా కొట్టుగదికేసి మళ్ళింది. తలుపులు తెరిచి చూస్తే లోపలేం ఉన్నట్టు లేదు.— ఎందుకైనా మంచిదని... "ఇష్.. ఇష్...." అంది తలుపుల మీద గట్టిగా కొడుతూ.

మ్యావ్. . . మ్యావ్. . . మ్యావ్. .

ఆ అరుపులేవో సన్నగా కిటికీ వెనక నుంచి వినిపిస్తోన్నట్టయింది.

"బాగానే ఉంది గోల. కంటికి కన్పించకుండా అరిచి చస్తోంటే ఎలా చచ్చేది ?" విసుక్కుంటూ ఓ అడుగు ముందుకు వేసి కిటికీ రెక్క తీసిందో లేదో ఛెంగున దూకనే దూకిందో నల్లని.... చక్కని, చిన్నారి పిల్లిపిల్ల— "మ్యావ్..." తెప్పుమని అరవబోయి తమాయించుకుంది శకుంతల— పిల్లులంటే ఆవిడ కేమంత ఇష్టం లేదు. పరిగదా పెద్ద పెద్ద పిల్లులంటే భయం కూడాను. గదిలోకి దూకుతూనే మ్యావ్— మ్యావ్.... అంటూ కంగారుగా కాస్త మేర తిరిగి పప్పుడబ్బాలు సర్దిన బల్లకిందికి దూరబోయి బియ్యం బస్తా వెనక్కి పరిగెత్తింది పిల్లిపిల్ల.

నల్లగా నిగనిగ లాడుతూ.... రబ్బరు బొమ్మలా గెంతుతోన్న పిల్లిపిల్లని చూస్తే శకుంతలకి కాస్త ముచ్చటేసింది.

"ఒరేయ్ ! రామూ ! నిన్నే రోయ్ ! పిల్లి పిల్ల వచ్చిందిరా ! పిల్లిపిల్ల, భలే ఉందిలే.... ఎంచక్కా నల్లగా.... బొద్దుగా ఎంత ముద్దొస్తోందనుకున్నావ్ లేచిరా ! లేచిరా ! నా మాట నమ్మక పోతే లేచివచ్చి నువ్వే చూడు...." శకుంతల అరుపులేనా పూర్తి కాకుండా హాజరై పోయాడు బాబిగాడు. అమ్మ మాట నమ్మటం అలా ఉండిచి వాడికే విన్పించింది పిల్లిపిల్ల అరుపు. దుప్పటి గిరవాటెట్టి మంచం వెనక్కితోసి ఒక్క గెంతులో గది బయట పడి బాణంలా దూసుకొచ్చాడు—

"పిల్లిపిల్లే ! నిజంగానే ! ఏదీ ? ఏదీ ?.... ఎక్కడా ?"

"అదిగో ! ఆ బియ్యం బస్తా వెనక్కి దూరింది. అదే ఉంటుందిలే, నువ్వు నడు."

మ్యావ్. . . మ్యావ్.

"నిజమేనేవ్ అమ్మా ! పిల్లిపిల్ల ! పిల్లిపిల్ల !" సంతోషం పట్టలేక గంతులేస్తూ బియ్యం బస్తా మీది కెక్కి నించున్నాడు బాబిగాడు.

మ్యావ్. . . .మ్యావ్. . .

"భలే ! భలే ! ఇక్కడే ఉంది. బస్తా వెనకాతలుంది." దభీమని కిందికి ఉరికి— "పిల్లీ ! దా ! మ్యావ్. . . మ్యావ్ ! బైటికిదా !" అంటూ పిల్లిపిల్లకి పిల్లి భాషలోనే స్వాగతం పల్కుతూ గోడవారగా మోకాళ్ల మీద ఒంగుని బస్తా వెనక్కి చేతులు పోనిచ్చాడు.

"ఒరేయ్ అల్లరి వెధవా ! ఆ మూలనేదైనా ఉండేను. అదే బైటి కొస్తుంది. నువ్వివతలికిరా !" శకుంతల కొడుకుని వారించే ప్రయత్నం చేసింది— మ్యావ్. . . మ్యావ్. . . . అంటూ ఆ పిల్లి పిల్ల బాబిగాడి చేతులకి అందకుండా తల బైటికి పెట్టి ఓ క్షణం కన్పించకుండా కన్పించి గోడపక్కగా జరిగి పీట కిందికి దూరింది.

"అమ్మా ! అమ్మా ! ఇదిగోనేవ్ ! పిల్లిపిల్ల.. ! పీటకింద ! పీట కింద !" ఉత్సాహం ఉరకలు వేస్తోంటే పీటకిందికి చూస్తూ బోర్లా పడుకున్నాడు.

"ఒరేయ్ ! అది ఎక్కడికీ పోదు గానీ నువ్వు బయటికి పద. ఇంకా ఎప్పుడ్రా మొహం కడుగుతావ్ ?" బాబిగాడేమీ విన్పించుకునే స్థితిలో లేడు.

సన్నగా నల్లగా పిల్లిపిల్ల తోక కాస్త కన్పించే సరికి దాన్ని గట్టిగా పట్టుకుని బర్రున బైటికి లాగాడు.— "ఆ దొరికిందేవ్ దొరికిందేవ్ ! పిల్లిపిల్ల, పిల్లిపిల్ల."

"ఒరేయ్ ! అది కరుస్తుందేమో వదిలెయ్‌రా ! వదిలెయ్‌రా !" బాబిగాడు పిల్లిపిల్లని తన పొట్ట కానించుకొంటూంటే శకుంతల ఒళ్ళు జలదరించింది— "భలే, బావుంది కదమ్మా ! ఆడుకుంటాను. ఆడుకుంటాను." అంటూ పిల్లిపిల్ల పొట్ట కింద నొక్కి పొట్టకి అదుముకొంటూ సగం జారిపోయిన లాగుతో అడ్డదిడ్డంగా వ గెత్తాడు వరండాలోకి.

"ఇదేం గోలరా ? మంచం మీంచి లేస్తేనే పిల్లి పిల్ల సంగతి నీకు చెప్పాను. దానితో ఆటలేమిటి నీకు ? దాన్నక్కడ పారేసి వస్తావా రావా ? మొహం ఇంకెప్పుడు కడుక్కుంటావ్‌రా ?" శకుంతల కంఠశోష గాలిలో తీసనైపోయింది.

"అమ్మా ! అమ్మా ! ఎంత ముద్దొస్తోందే పిల్లిపిల్ల ! కాస్సేపు ఆడుకుంటానే !" గారాం కుడుస్తూన్నట్టు చూశాడు బాబిగాడు.

"కాస్సేపేం ఖర్మ ? మొహం కడుక్కుని కాస్త అన్నం తిని వెళ్లి కావల్సినంత సేపు ఆడుకో" —వాడసలు కదిలివస్తే చాలనిపించింది శకుంతలకి.

"పిల్లి పారిపోతుందేమోనే !"

"ఎలా పారిపోతుందిరా ? దానికి కిటికీ లెక్కటం రాదులే, ఉండనీ అలా."

"నే నివ్వాళ అన్నం తినసే అమ్మా !"

"అఘోరించావ్‌లే కోతివెధవా ! ఇంకా వాగించావంటే వీపు చిట్లగొడతాను. దాన్నక్కడ పడేసి రావేం ?"

బిక్కమొహం వేసుకుని నిలబడ్డాడు బాబిగాడు. పిల్లిపిల్లని మరీ గట్టిగా పొట్టకి కర్చుకుని...

మ్యావ్.... మ్యావ్...

"దాన్ని మరీ అలా నొక్కెయ్యకు. చస్తుంది: అరుస్తోంది చూశావా ? వదిలెయ్. నేను చూస్తూంటాలే. నువ్వు మొహం కడుక్కురా. కాయితం ముక్కలో పళ్లపొడి వేసి ఉంచాను. తీసికెళ్లు.

పిల్లి పిల్లని వదలటం బొత్తిగా ఇష్టంలేదు బాబిగాడికి. చేసేది లేక కొంచెం చేతులు సడలించాడు. సందుకోసం కాచుకున్న దానిలా దానంతటదే కిందికి దూకి... మ్యావ్... మ్యావ్... అంటూ పొయ్యి వెనక్కి పరిగెత్తింది పిల్లిపిల్ల.

"అమ్మా ! అమ్మా ! అది పొయ్యిలో పడి పోతుందేమోనే !" ఏడుపే రాబోయింది బాబిగాడికి.

"పడలేదురా ! దానికి మాత్రం తెలీదూ కాల్తుందని."

పాపం దానికి నిజంగానే తెలీనట్టుంది నిప్పు నిజం. సరాసరి పొయ్యిలోకే దూర బోయింది పని మూతి కాలిందో ఏమో.... మ్యావ్....మ్యావ్ అంటూ కంగారుగా నీళ్లబిందెలకేసి పరిగెత్తింది.

"అమ్మా ! పిల్లిపిల్లకి నిప్పుకాలి ఏడుస్తోందే!"

"నీ మొహం ! కాలితే మాత్రం దానికో లెక్కా ఏమిటి ? అదే పోతుంది."

"ఇంకా ఎందుకే అలా అరుస్తోంది ?"

"అయ్యో నా ఖర్మ ! నువ్వు వెళ్లరా ! వెళ్లి మొహం కడుక్కుంటూ ఉండు. నీళ్ళ చల్లారి పోతున్నాయ్, ఇంకా ఎప్పుడవి గుమ్మరించను ?

బాబిగాడు ఓ అంగుళం మేరైనా కదలకుండా యథాప్రకారం నించునే ఉన్నాడు— "నీళ్ళు నిన్ననే పోసుకున్నాను కదే !"

బాగానే కోపం వచ్చింది శకుంతలకి— "నోరు పెట్టుకు అరుస్తోంటే నీకిలాగే ఉంటుందిలే— నించో, నించో అట్లకాడ తెచ్చి

చురుకు తగిలించానంటే నీ పనిగుడూ..చె ప్పా."

"అమ్మా ! అమ్మా ! పిల్లి పిల్ల పెరుగు తాగుతోందేవ్ ! పెరుగు.... పెరుగు." చప్పట్లు కొడ్తూ గంతులేశాడు బాబిగాడు.

"అయ్యో ! అయ్యో ! నీకు పోయేకాలం రానూ ! ఎక్కడ దాపరించావే నా ప్రాణానికి. పిల్లవాడికి పెడ్దాంకదాని మీగడ పెరుగు తీసి అట్టే పెట్టాను. మూతి పెట్టి నాకనే నాకావ్. ఉండు నీ పని చెప్తాను. కిటికీలోంచి గిరవాటెడతాను. ఇద్దరి తెగులూ కుదుర్తుంది. ఇంకాస్తయితే పాలగిన్నె తొయ్యనే తోసేదానివి "—నిజంగానే శకుంతల పిల్లిపిల్ల మెడమీద తోలు పట్టుకు సాగదీస్తూ కిటికీ వేపు నడవ బోయింది.

ఘొల్లున గోలపెట్టాడు బాబిగాడు— "అమ్మా ! అమ్మా ! దాన్ని పారెయ్యకే. పారెయ్యకే. నేను మొహం కడుక్కుంటానే. నీళ్లు పోసుకుంటానే. అమ్మా ! పిల్లి పిల్లని ఉంచవే.... నే నాడుకుంటానే."

"నిజంగా మొహం కడుక్కుంటావ్ కదూ ? అయితే తొందరగా వెళ్లు." చేతిలో పిల్లిపిల్లని అంత ఎత్తు నుంచే వదిలేసింది శకుంతల.

దబ్బున కిందపడి అయోమయంగా పొయ్యికేసే పరిగెత్తింది పిల్లిపిల్ల.

"అమ్మా ! అది మళ్లా పొయ్యిలో దూరిపోతోందే !"

"ఒరేయ్ ! ఇక నేను వాగలేను. ఇదిగో ! దాన్ని జాగ్రత్తగా దాస్తున్నాను. చూశావా ?" కూరగాయలన్నీ ఓ వారగా పోసి ఆ బుట్ట కాస్తా పిల్లిపిల్ల మీద బోర్లించింది శకుంతల.

"అమ్మా ! అది చచ్చిపోతుందేమోనే !"

"అది కాదు. నేను చస్తున్నాను ముందు.

# మంచి అమ్మ

నిక్షేపంలా దానికి గాలి వెళ్తోంటే ఎందుకు చస్తుంది ? తెగులా ? ఇంకా వెళ్లావేం ?

బాత్‌రూంకేసి ఒక్క పరుగు తీశాడు. బాబిగాడు

"హమ్మయ్య ! ఇప్పటికి కదిలాడు." అనుకొంటూ వంకాయలు ముందు వేసుకు కూర్చుంది శకుంతల. ముక్కలు తరిగి కత్తిపీట ఎత్తుతోంటే!

"అమ్మా ! టవలే, టవలే." అంటూ నీళ్లు కోడుతోన్న ఒంటితో రానే వచ్చేశాడు బాబిగాడు.

"అదేమిట్రా నువ్వే నీళ్లు పోసేసుకున్నావా ? మొహం కడుక్కుంటూ ఉండరా ! నేను వేన్నీళ్లు తెచ్చి సబ్బుతో రుద్ది పోస్తానని చెప్పలా ? రోజూ పోస్తోంటే ఎరగవూ ?— నీ కెందుకురా ఆ తొందర ? అసలు మొహం సరిగ్గా తోముకున్నావూ ?"

"సుబ్బరంగా కడుక్కున్నానే అమ్మా ! నేను నిజంగా నీళ్లు పోసుకున్నానే !"

"ఎలాగో అఘోరించు. నీతో వాగలేను. నాకసలే ఆలశ్యమై పోతోంది.... ఇంకా ఎందుకలా మోడులా నిలబడ్డావు ? ఒళ్లు తుడుచుకుని లాగు తొడుక్కోవేం ?"

లాగుతోనే ఒళ్లు తుడిచేసుకుని తర్వాత తొడిగేసుకుని బుద్ధిగా వచ్చి పీటవాల్చుకు కూర్చున్నాడు బాబిగాడు.

"మ్యావ్ ! మ్యావ్...." బుట్టలోంచి అరుస్తోంది పిల్లిపిల్ల. శకుంతల బాబిగాడికి పెరుగూ అన్నం కలిపి కలిపి దగ్గరికి తోసింది పళ్లెం.

"అమ్మా ! పిల్లిపిల్ల పెరుగూ అన్నం తింటుంది కదే ?"

"ఆఁ తింటుంది. కంచం దగ్గిర వెధవ ఎంగుళ్లు పోశావంటే డొక్క చీరేస్తాను."

మ్యావ్— మ్యావ్.... అరుస్తూ పిల్లిపిల్ల బుట్ట ఎత్తుకోటానికి నానా అవస్థ పడుతోంది. ఆ బుట్ట కాస్త వెనక్కి జరిగి దాని పీక మీద పడింది. పాపం అది గింజుకుంటోంటే బాబిగాడు మరి వూరుకోలేక పోయాడు. ఛెంగున పొయ్యి వెనక్కి దూకి పిల్లిపిల్ల మీది బుట్ట కాస్తా ఎత్తేసి పళ్లు నూరుతూ కసిగా వాకిట్లోకి గిరవాటెట్టాడు. ఆపదలో చిక్కిన ఓ అనామక జీవిని రక్షించినంత ధీమాతో నిటారుగా నిలబడ్డాడు.

"ఆదేం పనిరా కోతివెధవా ? పోనీ ఎత్తిన వాడివి వూరుకోక ఏవిటా గిరవాటెట్టటం ? ఇక చాలుగాని వెళ్లి కూర్చుని తిండి తిను."

పిల్లిపిల్ల మ్యావ్.... మ్యావ్.... అంటూ వచ్చి బాబిగాడి కాళ్లచుట్టూ తిరిగింది. బాబిగాడు పీట దగ్గిరికి నడుస్తోంటే అది కూడా చిన్నారి తోక ఉండలా చుట్టుకొంటూ వెనకే వచ్చి పీట కోడు కానుకుని పడుకుంది— ఆ దృశ్యం చూసుకొంటూంటే బాబిగాడి సంతోషానికి హద్దు లేకుండా పోయింది— తనంటే పిల్లిపిల్లకి చాలా ఇష్టం. తన వెనకే తిరుగుతూ పిల్లి భాషలో ఏవిటో చెప్తోంది కూడాను— పిల్లి పిల్లను తను అచ్చంగా ఉంచేసుకుంటే.... ? తళుక్కున మెరిసిన ఆ వూహా తాలూకు కాంతి బాబిగాడి మొహం నిండా ప్రకాశించింది— "అమ్మా ! అమ్మా ! ఈ పిల్లిపిల్ల అచ్చంగా నాదేనే ! దీన్ని నేను పెంచుకుంటానే !"

"భగవంతుడా ! ఇదెక్కడి గోలరా తండ్రీ ! నేలన పోయేదాన్ని నెత్తిన రాసుకున్నాను."— శకుంతల పశ్చాత్తాపంతో స్వగతం చెప్పుకుంది. బాబిగాడేం విన్పించుకోలేదు— వాడి ఆలోచనంతా గోపీగాడి పిల్లిబొమ్మ మీదికి పోయింది— వాడి బొమ్మ సంచీలో పెట్టి బళ్లోకి తీసుకొచ్చి ఎంతమందికో చూపించాడు— మేష్టారు కూడా పిల్లిబొమ్మ చూసి చాలా బావుందన్నారు.— మద్రాసు నుంచో కలకత్తా నుంచో వాళ్లన్నయ్య తెచ్చిపెట్టాడటదాన్ని— వాడు దాన్ని అస్తమానూ చూసుకొంటూ మురిసి పోవటమేను. సంచీలో దాచేసినా మళ్లా ఎవరైనా వస్తోంటే గొప్పగా బయటికి తీసి ఆడిస్తూ కూర్చుంటాడు. "ఒక్కసారి ముట్టుకోనివ్వరా గోపీ !" అంటే కొంచెం ఒప్పుకున్నాడు గానీ కీ ఇచ్చి అరిపిస్తామంటే వద్దనేశాడు. వాడి బొమ్మ....

"ఒరేయ్ ! ఏవిటా కొంగ జపం ? కంచంలో చెయ్యి పెట్టవేం ?" ఒక్క అరుపు అరిచింది శకుంతల. బాబిగాడు గబగబా రెండు ముద్దలు నోట్లో కుక్కేసుకున్నాడు— చటుక్కున గుర్తు వచ్చినట్టు, ఓ ముద్ద తీసి పిల్లిపిల్ల ముందు వేశాడు కంచం పక్కన— పిల్లిపిల్ల పెరుగూ ముద్ద ఆత్రంగా నాకబోయి మూతి వెనక్కి లాక్కుంది మ్యావ్.... మ్యావ్.... అంటూ నేస్తం కేసి జాలిగా చూసింది.

"ఏం ? నీకు నచ్చలేదూ ?" ప్రేమగా చూశాడు నేస్తం.

"అమ్మా ! పిల్లి పిల్లకి పెరుగూ అన్నం నచ్చలేదంటోందే ?"

"ఆహా ! నీకు చెప్పింది." కసురుకుంది శకుంతల.

పిల్లిపిల్ల శకుంతలకేసి చూసి మళ్లా అరిచింది "—మ్యావ్.... మ్యావ్...."



"అదిగో మ్యావ్ అంటోందే ! ఆకలేస్తోందని చెప్తోందే ?"

మహా విసుగొచ్చింది శకుంతలకి— "దాని గోలెందుకురా నీకూ ? గబగబా తిండి తిని లేవరా! ఎనిమిదవుతోంటే ఇంకా ఏం బడీ.... ఏం చదువూ...." అంటూ సాగదీసుకొంది.

బాబిగాడు బిక్క మొహం వేశాడు. పాపం పిల్లి పిల్లకి అంత ఆకలేస్తోంటే తనొక్కడే ఎలా తినేస్తాడేపిటి ? వూహూ ! తనకీ ఒద్దు.

"ముద్ద ఎత్తవేంరా ?"

"తిన బుద్ధి కావటం లేదే"

శకుంతల కొడు మొహంలోకి దీర్ఘంగా చూసింది— "ఆఁ" అంటే ఏడ్చేసేలా ఉన్నాడు— పిల్లిపిల్ల మోకాలు నిలపకుండా కంచం చుట్టూ తిరుగుతూ తెగ అరుస్తోంది— చెప్పద్దూ ? శకుంతలకి కాస్త జాలి వేసింది— "అయ్యో పాపం! పసి ముండ. తల్లి దగ్గిర్నుంచి ఎలా తప్పించుకుందో ! ఆకలేసి చస్తోంది లాగుంది" అనుకొంటూ ఓ పాత రేకుగిన్నె వెదికి కాసిన్ని పాలుపోసి పిల్లిపిల్ల ముందు పెట్టింది

"దాని ఆకలి పోతుందిలే. ఇక నువ్వు తిను."

పిల్లిపిల్ల పాలగిన్నెలో పెట్టిన మూతి ఎత్తకుండా చుప్.... చుప్.... మంటూ నాకేస్తోంటే బాబిగాడికి మహా ముచ్చటేసింది— గబ గబా రెండు పెరుగూ ముద్దలు మింగేసరికి పిల్లిపిల్ల తలెత్తి మళ్ళా అరిచింది— "మ్యావ్.... మ్యావ్..'

పాల గిన్నెలో ఒక్క పాలబొట్టు కూడా మిగల్లేదు.

" అమ్మా ! ఇంకాసిన్ని పాలు పొయ్యవే."

" ఇక చాల్లేరా ! ఉన్నవన్నీ దానికే పోసేస్తే ఎలా ? రాత్రికి పెరుగో ? "

" మ్యావ్ ..... మ్యావ్ ........" పిల్లి పిల్ల నేస్తంకేసి చూసింది దీనంగా.

" అమ్మా ! దానికి కడుపు నిండ లేదేమోనే ! "

" అసలు నిండనే కూడదురా ! అజీర్తి చేసి చస్తుంది."

నమ్మకం కలుగలేదు బాబిగాడికి. ఆకలి తీరే వరకూ కడుపునిండా తినద్దూ ? నిండితే జబ్బు చేస్తుందా ? అంతా వుత్తదే ! " పోనీ రాత్రికి నేను పెరుగు వేసుకోనే ! నిజంగా వేసుకోనే ! కాసిన్ని పాలు పిల్లి పిల్లకి పొయ్యవే. అమ్మా ! " దీనంగా అడుగుతోన్న కొడుకుకేసి చిత్రంగా చూసింది శకుంతల " ఇదేం చోద్యం రా? నీ ప్రేమలూ నువ్వూనూ." విసుక్కొంటూ వుగ్గిన్నెడు పాలు మళ్ళా రేకు గిన్నెలో ఒంచింది. — ఆ నాలుగు బొట్లూ నాకేసి మళ్ళా తలెత్తి అరిచింది పిల్లిపిల్ల " మ్యావ్......"

" మ్యావ్ లేదు. గీవ్ లేదు..... నోరు మూసుకుపో వెత్తి చితగ్గొడతాను." పిల్లిపిల్లని అలా తిట్టడం బాబిగాడికి చాలా కష్టం వేసింది. పాపం దాని ఆకలి కూడా సరిగ్గా తీరలేదు. — మరేం చేయలేక చటుక్కున గ్లాసుడు నీళ్ళూ చేతిమీద ఒంచేసుకుని లేచి పోయాడు. " అయ్యో ! అయో ! అదేం తిండిరా ? ఇవ్వాళ నీకేం వచ్చిందిరా ? " అంటూ నెత్తీ నోరూ బాదుకుంది శకుంతల. తనని కాదే అన్నట్టు పిల్లి పిల్లని ఎగరేసి ఎత్తుకుని గదిలోకి పరుగెత్తాడు

49 వ పేజీ చూడండి

# సమిష్టి కుటుంబాల వల్ల స్త్రీ స్వాతంత్ర్యం తగ్గిపోతున్నదా?

నాయని కృష్ణకుమారి





సమిష్టి కుటుంబాలవల్ల స్త్రీ స్వాతంత్ర్యం తగ్గిపోతున్నదా? ఇదీ ప్రశ్న! ఈ ప్రశ్నకు జవాబు చెప్పడానికి ప్రయత్నంచేముందు, "స్వాతంత్ర్యం, స్త్రీ; ఈ రెండింటి మేళవింపూ" వీటెని గురించి ఒక నిర్దుష్టాభిప్రాయానికి రావడం అవసరం. వాటిని గురించి ఒక అభిప్రాయమంటూ స్పష్టంగా కలిగితే, సమిష్టి కుటుంబంలోని స్త్రీకీ, స్వాతంత్ర్యానికీ ఉన్న సంబంధమేమిటో దానంతటదే తేలిపోవచ్చు.

స్త్రీలందరినీ ఒకే గుంపుకిందికి చేర్చి, ఈ గుంపు కంతటికీ ఏ సూత్రాన్నయినా, పట్టిద్దామనుకో కూడదు. స్థూలంగా తరగతుల వారీగా విభజించ దలచుకుంటే స్త్రీలందరినీ మూడు తరగతులుగా విభజించవచ్చు.— ఈ విభజన కేవలం ఆర్థిక స్తోమత వల్ల ఏర్పడిన విభజన. అందులో మొదటి తరగతికి చెందిన స్త్రీలు, మిక్కిలి సంపన్న కుటుంబంలో జన్మించి, మరో సంపన్న కుటుంబానికి కోడళ్ళుగా, అరణాలతో సహా కదిలే వాళ్ళు.

రెండవ తరగతి స్త్రీలు :

మామూలు తరహా ఇండ్లల్లో పుట్టి, పెద్ద తరహా కలలుకంటూ, చిన్న తరహా వాళ్ళను ఈసడించుకుంటూ, తమతో సమానంగా, ఆర్థిక మాంద్యమూ, జనబాహుళ్యమూ ఉన్న ఇళ్ళల్లో వచ్చి పడేవాళ్ళు.

మూడవ తరగతి స్త్రీలు,

భర్తతోపాటు రోజంతా ఒళ్ళు వంచి చాకిరీ చేసి ఏరోజుకూలీ ఆరోజు పొంగించుకుని తాగేవాళ్ళు.

ఆర్థికంగా ఏ లోటూ లేని కుటుంబంలో పుట్టిన స్త్రీకి స్వేచ్ఛాస్వాతంత్ర్యాల ప్రసక్తి రాకుండా పురుషుడు ఆమెను సమర్థించకోవచ్చు. కూలీ నాలీ చేసుకునే స్త్రీకి ఉన్న స్వేచ్ఛ చాలా మంది నవ నాగరకుల మనుకునే వాళ్ళకే లేదు. ఆవిడ ఒళ్ళు వంచి మొగుడితో పని చేస్తూ, ఇంట్లో పిల్లా పీచును సంతన చేసుకుంటుంది. మొగుడు తన కూలి డబ్బులు తాగేస్తే, అతగాణ్ణి శాపనార్థాలు పెడ్తూనే తన తంటాలు తను పడి కుటుంబంలో ఉన్న నలుగురి నోళ్ళల్లోకీ చేతులు వెళ్ళేట్లు చేస్తుంది. కండబలం కలిగిన మొగుడు ఒంటి మీద కర్రలు విరగగొడ్తే, నోటిబలం కలిగిన తాను దెబ్బలు తింటున్నా మెటికలు విరిచి పోస్తుంది.— ఇటువంటి స్త్రీ విషయంలో కూడా స్వాతంత్ర్య ప్రసక్తి అక్కర లేదు.

ఇక ఎటొచ్చీ ఈ విషయంలో సమస్యలూ, వాటిని విప్పుకోవడానికి ప్రయత్నించడాలూ ఒక్క మధ్య తరగతి స్త్రీలు మాత్రమే. వీళ్ళను మళ్ళీ రెండు రకాలుగా విభజించుకోవచ్చు. (1) చదువుకున్న స్త్రీలు. (2) చదువుకోని స్త్రీలు. చదువుకుని పట్టణాలలో ఉండి ఉద్యోగం చేసే వాళ్ళు ఒకరకం. చదువుకుని ఉద్యోగం చెయ్యని వాళ్ళూ. చదువుకోక ఉద్యోగం చెయ్యనివాళ్ళూ మరొకరకం. ఇది మరో రకంగా విభజిస్తే పట్టణాల్లో సమిష్టి కుటుంబాలలో ఉండేవాళ్ళూ వేరువేరు.

వీళ్ళందరికీ, 'స్వాతంత్ర్యం' అనే పదం యొక్క అర్థం ఒకే విధంగా పట్టదు.

తాను మెచ్చి, తనకు నచ్చిన విషయం, ఇతరులకు ఏ కీడూ చేయక పోతే, ఎవరి అడ్డూ, అపు దలా లేకుండా చేయగలగడమే స్వాతంత్ర్యం— స్వతంత్రతం ఉన్న మనిషి మాట పదిమందీ వింటారు. వాణ్ణి గౌరవిస్తారు. వాడు చెప్పిన పని చేస్తారు. ఈ మూడు లక్షణాలూ అత్యంత శక్తివంతంగా ఎవరిలో ఉంటే వాడే స్వతంత్రుడు.— అయితే స్త్రీ కోరే స్వాతంత్ర్యం ఇటువంటిదేనా? ఆవిడ చెప్పిన మాటవిని, పనిచేసి, ఆవిణ్ణి గౌరవించ గలగడానికి ప్రాతిపదికగా మున్ముందు ఆవిణ్ణి గుర్తించవద్దా! ఒక వ్యక్తి అనీ, ఆవిడకీ అభిప్రాయాలూ అభిమానాలూ ఉంటాయనీ, గుర్తించడం సంఘంలో మొదటి నుండీ ఉందా? అనాది నుండీ, సాహిత్యం ద్వారా మనకు లభ్యమవు తున్న సాంఘిక చరిత్ర చూస్తూ ఉంటే "స్త్రీ— స్వాతంత్ర్యం" అనే రెండు పదాలూ, పరస్పర విరుద్ధాలయిన పదాలుగా గోచరించేవి. "న స్త్రీ స్వాతంత్ర్య మర్హతి" అన్నదే అందుకు పెద్ద సాక్ష్యం. పురాణ కథల్లో విశ్వరూపమెత్తి వివిధ పరిస్థితులలో మనకు కనిపించే స్త్రీపాత్ర వ్యక్తిత్వమూ స్వాతంత్ర్యమూ ఉండి భాసించే పాత్రగా కంటే, యజమాని చరాస్తులలో ఒకటిగా పరిగణింప బడడమే ఎక్కువ. పురుషుడు ఆనాటి స్త్రీని అమ్ముకున్నాడు. జూదంలో పణంగా పెట్టాడు. పలురకాల మనుష్యుల దగ్గర తాకట్టు వస్తువుగా మార్చి మార్చి ఉంచ గలిగాడు. చివరకు తన పేరు ప్రతిష్ఠలకే భంగం కలుగుతుందని ఇంట్లో నుండి వెళ్ళ గొట్టాడు— ఈ కథలన్నీ—" ఎవరికి సంబంధించిన వస్తువుల్ని వాళ్ళేమయినా చేసుకుంటారు, ఇందులో విడ్డూర మేముంది?" అని నిలదీసి అడిగే పరిస్థితిలో ఉంటాయి. ఆ నాటి సాంఘిక వ్యవస్థా, న్యాయం, ముఖ్యంగా పెద్దలైన పురుషులూ, స్త్రీ యొక్క భవితవ్యాన్ని అంతవరకే పరిమితం చేశారు. సంప్రదాయమని పేరు చెప్పి ఆవిణ్ణి అంతులేని ఆచారాల మధ్యా, నమ్మకాల మధ్యా బందీని చేశారు. కుమ్మరి చేతిలో

# ప్రత్యేక వ్యాసావళిలో రెండవ వ్యాసం!

మెత్తని మృత్తిక రకరకాల ఆకారాలలో మలచ బడ్డట్టు భార్య చిత్తవృత్తి భర్త మనస్సుకు అనుగుణంగా, అతని వ్యక్తిత్వానికి ఛాయగా, అతని అడుగులో అడుగుగా రూపు కట్టవలసిందే. ఇందుకు విభిన్నమైన ధర్మం స్త్రీ ధర్మం కాదు. దీన్ని అనుసరించిన వాళ్లే పతివ్రతలై కీర్తి ప్రపంచంలో ధ్రువతారలై భాసించారు. వాళ్లే సర్వ స్త్రీ ప్రపంచానికీ ఆదర్శం.

ఈ పద్ధతి కనుగుణంగానే స్త్రీ మొదటి నుండీ అటువంటి భావాలనే తనలో ప్రోది చేసుకున్నది. తాను వివాహమాడి, యజమానీ, భర్త అయిన పురుషుణ్ణి సేవిస్తుంది. అతని ఇల్లు తన ఇల్లుగా, అతని బంధువులు తన బంధువులుగా, అతని ఇష్టానిష్టాలే తన ఇష్టానిష్టాలుగా మలుచుకుంటుంది. జీవితాంతం అతడు తనను కనిపెట్టి ఉంటున్నందుకూ, జీవితావసరాలయిన తిండీ, బట్టా ఇచ్చి క్షేమాన్ని కలిగిస్తున్నందుకూ ఇదే తాను చూపగలిగే కృతజ్ఞతగా మనసారా భావిస్తుంది. ఇటువంటి విశిష్టాదర్శం నరనరాల్లో జీర్ణించుకున్న స్త్రీ విషయంలో స్వాతంత్ర్య మనే పదానికి అర్థమేమిటి ?

పురుషుడు స్త్రీ నుండే జన్మిస్తున్నాడు. అతడు ఆమె రక్తంలో రక్తం, ఎముకలో ఎముక. ఆమె లేనిదే అతడు లేడు. పురుషుడు లేని స్త్రీ జీవనం అరణ్య సదృశ్యమే అయితే, స్త్రీ లేని పురుష జీవనం మరుభూమి. ఒకరు రెండవ వారి అర్ధాంశ. ఒకరి కొకరు కార్యరూపంలో తోడ్పాటును అందించు కోక పోతే ఈ ఇద్దరిలో ఏ ఒక్కరి జీవనమూ సరళంగా సాగదు. మరి వీళ్ళిద్దరి మధ్యా ఇంత అంతరం ఎందుకుంది ? ఇందులో ఒకరు శాసించే వారూ, మరొకరు ఆ శాసనమును శిరసా వహించేవారూ, ఎందుకు కావలసి వచ్చింది ?—ఇవి ప్రశ్నలు !

ఈ ఇద్దరూ ఏకరీతి జీవులు కారు. పురుషుడు అహంకారి. అధికార వాంఛ కలవాడు. శారీరకంగా స్త్రీ కంటే అధికుడు. ధన సంపాదన అతనికి మొదటి నుండీ సమాజం నూరి పోసిన పరమలక్ష్యం. అతడు చేసే జీవన యాత్రలో అతని సంపాదన కొందరి జీవితాలను నిలుపుతుంది. ముఖ్యంగా భార్య జీవితం.— పురుషుడి కున్న ఉద్రిక్త సాధారణంగా స్త్రీకి ఉండదు. స్వభావతః ఆవిడ మానవతి. దెబ్బ కొట్టడంలో బలహీనురాలయినా, కొట్టిన దెబ్బల్ని ఓర్చు కోవడంలో మహా సమర్థురాలు. ఈ సమర్థతే పురుష దృష్టిలో చేతగాని తనంగా లెక్క కట్టబడ్డది. ఈ రకంగా ఆర్థిక స్వాతంత్ర్యం లేక పోవడం, తన పోషకుడూ రక్షకుడూ అయిన పురుషుడి పట్ల విధేయతా కృతజ్ఞతా చూపడం తన ధర్మంగా భావించడం, ఎటువంటి పరిస్థితిలో నైనా రాజీపడి ఆ పరిస్థితుల్లోనే జీవయాత్ర సాగించడానికి సిద్ధం కావడం— ఈ లక్షణాలు నరనరాల్లో జీర్ణించుకు పోయిన స్త్రీ తత్త్వం పురుషతత్త్వంతో సమానం ఎలా అవుతుంది? ఇటువంటి విభిన్న తత్త్వం కల స్త్రీయొక్క వ్యక్తిత్వాన్ని అణచివేసి, తనను అనుసరించమనీ, నేను వినా, నీవు లేవనీ, పురుషుడు, ఆదేశించ గలిగాడు. దాని నావిడ శిరసా వహించింది. ఇటువంటి స్త్రీ దగ్గర స్వాతంత్ర్య ప్రసక్తి కూడా తేవడం ఎలా ?—

ఇదంతా ఆదికాలపు స్త్రీ చరిత్రే అయినా, ఈ నాడూ స్త్రీ పరిస్థితి ఏ మంత మెరుగుగా లేదు. ఇప్పటికీ చాలా మంది ఆడ పిల్లల్ని ఈడు రాగానే పెండ్లి చేసి, అత్తింట్లో వినయ విధేయతలు కలిగి పేరు సంపాదించుకొనే నిమిత్తమే పెంచుతున్నారు. ఆడ పిల్ల గుండెల మీద కుంపటి.. ఆవిడ ఎంత చదువుకుని ఉద్యోగం చేస్తే మాత్రం ఎవరైనా చదువు చూచి పెళ్లి చేసుకుంటారా ?— చదువుకు లేని పోని ఖర్చు లెందుకు ? అనే ధోరణి మనం ఎంత మందిలో చూడడం లేదు ? తల్లి దండ్రులలో ఈ ధోరణి పోనంత కాలం ఆడ పిల్లలకు స్వాతంత్ర్యం కానీ స్వయం వ్యక్తిత్వం కానీ ఎలా వస్తుంది ? లోకంలో విపరీతంగా విడని చిక్కులా అల్లుకు పోయిన ఈ ధోరణి చూచే బాపూజీ ఇలా అన్నారు "తల్లి దండ్రులు తమ కొడుకులతో పాటు కూతుళ్ళనీ స్వయం పోషక శక్తి కలిగేటట్లుగా తీర్చిదిద్ద ప్రయత్నించాలి గృహ నిర్వహణ స్త్రీ తత్వానికి చక్కగా సరిపడ తుంది. నిజమే. అది ఆవిడ బాధ్యతే అని మన మ కున్నా, ఆవిడ తన కాలాన్నంతటినీ దానికై వెచ్చించ నవసరం లేదు. వంట ఇంటికే కట్టుబడిపోయే ఆమె వ్యక్తిత్వం నా అభిప్రాయంలో గత మూఢ దశయొక్క శిధిల శేషాంశ. ఈ పురాణ వ్యాధి నుండి స్త్రీ జాతి కంతటికీ విముక్తి ప్రసాదించ డానికి ఇక ఆలస్యం కారాదు. గృహ నిర్వహణ మొక్కటే ఆవిడ ఏకైక జీవిత లక్ష్యం కారాదు." ఇటువంటి భావం స్త్రీలో కలగడానికైనా ఆవిడకు చదువు కావాలి ? అన్ని తరహాల స్వాతంత్ర్యాలకూ పునాదివంటిది భావస్వాతంత్ర్యం !

ఒక వేళ ఆర్థిక స్తోమత స్త్రీకి కలిగినా, భావ స్వాతంత్ర్యం లేనివాడు, ఆవిడ మళ్ళీ తనకంటే బలవంతుడైన పురుషుడి చెప్పుచేతుల్లో ఉండక తప్పదు. ఈ అంశాన్ని స్పష్టం చేసే రచనలు ఎన్నో ఈ నాటి సాహిత్యంలో మనం చూస్తూనే ఉన్నాం. భార్యలు ఉద్యోగం చేసే ఆఫీసు చుట్టూ, చార చక్షువులతో, కాపలాలు కాసే భర్తలూ, భర్త ఏదో ఆవేశంలో వద్దన్నాడు కదా అని, చేస్తున్న ఉద్యోగానికి గీతపెట్టే పతివ్రతలూ, సంపాదన లేని భర్తకు గుణపాఠం నేర్పాలని ఎలాగో

## నా జీవిత విశేషాలు

చదువుకున్నాను. ఉద్యోగం చేస్తున్నాను. నా పెళ్లి చేయడానికి మా అమ్మా నాన్నా ఏ మాత్రము ఇబ్బంది పడలేదు. నాకు మేనరికం లేకపోయినా కాన్నీ కట్నంలేకుండానే పెండ్లి అయింది. కులంలో వాళ్లు దొరకరనే భయంవల్ల ఏ వర్ణాంతర వివాహానికైనా పాలుపడాల్సిన అవసరం నాకు రాలేదు. కులంలో వాణ్ణే చేసుకున్నాను. మాకు ముగ్గురు పిల్లలు, లక్షణంగా వాళ్లు చదువుకుంటుంటే మేం ఉద్యోగాలు నిర్వహిస్తున్నాము. పగలు పదిగంటలకు ఇంటికివేసిన తాళం సాయంత్రం అయిదుఅయింతర్వాత తీస్తాము. మా వంటమనిషి గృహనిర్వహణలో నాకు సాయంచేస్తుంది. అప్పుడప్పుడూ మా ఆయన కూడా చేస్తాననడం కద్దు. మా యిద్దరి మధ్య పొరపొచ్చాలూ లేవు. ఏ విషయంలోనైనా అభిప్రాయభేదాలు వస్తే ఇద్దరం గంటలతరబడి హాహాహూహూలతో పోట్లాడుకోగలం. అయినా మేమిద్దరం ఒకటే! మేమిద్దరం మంచి స్నేహితులం.

ఈ విశేషాలనుండి నేర్చుకోతగ్గ నీతి!

ఏ స్త్రీ అయినా చదువుకుని ఉద్యోగం చేస్తూ పిల్లలతో సహా, ఇల్లు సంతోషమయంగా నడుపుకోవచ్చును.

—నాయని కృష్ణకుమారి.

వ దం తు ల ను వి న కం డి
వ దం తు ల ను ప్ర చా రం చే య కం డి

పుష్పలత సౌందర్య రహస్యం "లక్స్
నాచర్మసౌందర్యమునకు
దివ్యమైనది!"



ప్రాగసైన సినీమాతార పుష్పలత ఇలా చెప్తున్నది:
లక్స్ ఎంతో శుద్ధమైనది, ఎంతో సౌమ్యమైనది...దాని మీగడవంటి నురగ
నా చర్మసౌందర్యమునకు అద్భుతమైన గుణకారి. దాని పరిమళం
ఆకర్షణీయం. నా సౌందర్య సాధనలలో ఎప్పుడూ లక్స్‌కు ప్రథమ
స్థానాన్నిస్తున్నాను. మీరు కూడా ఎందుకు అట్లు చేయగూడదు?




లక్స్ టాయిలెట్ సబ్బు ● సినీమాతారలకు సౌందర్యము నిచ్చే సబ్బు

తెలుపులోను, నాలుగు వానవెల్లి రంగులలోను వున్నది
హిందుస్తాన్ లీవర్ ఉత్పత్తి

LTS. 179-140 TE

ఒకలాగు సాహసించి ఉద్యోగంలో చేరి, మళ్ళీ ఆయన దాక్షిణ్య భిక్షకోసం "మీరు వద్దంటే మానేస్తా"నని కాళ్ళ బేరానికి వచ్చే వనితలూ ఈ నాటి కథా ప్రపంచంలో కోకొల్లలుగా కని పిస్తున్నారు. నిత్య జీవితంలో ఈ సంఘటనలు ఇంత విరివిగా జరుగుతున్నాయో లేవో గాని, కథల్లోని ఈ పాత్రలు మాత్రం, వోడిపోతున్న పురుష జాతి కాంప్లెక్సును స్పష్టంగా తెలియ జేయగలుగుతున్నవి.

ఈ విధంగా స్త్రీ తాను స్వాతంత్ర్యం కల దాన్ని అని మనస్ఫూర్తిగా చెప్పుకోగల స్థితికి కొన్ని అంశాలు తనలో ఇముడ్చుకో గలిగితేనే కాని రాలేదు.

(1) అనాది నుండీ వచ్చే సంప్రదాయ బద్ధమైన ఆచారాల్నీ, నమ్మకాల్నీ పరిశీలించి, ఆత్మ విమర్శన చేసుకుని తనకేవి హితమైనవో, నిర్ణయించుకో గలిగిన భావ వికాసమూ, స్వాతంత్ర్యమూ ఆమెకు లభించ గలగాలి !

(2) తనకు కావలసిన తిండీ, బట్టా, తానే సంపాదించుకో గలిగి, వాటి కోసం ఏ పురుషుడి మీదా ఆధారపడవలసిన అగత్యం లేని స్థితిలో ఉండ గలగాలి.

(3) అభిప్రాయ భేదమే కలిగి, అది కుటుంబానికి మంచిదే అయితే, దాన్ని నిర్భయంగా విడమర్చి ఏ పురుషుడికి చెప్పడానికీ, జంకని స్థితిలో ఉండ గలగాలి.

(4) తాను కేవలం గృహదాసి కాక, అన్ని కోణాల నుండీ జీవిత రంగంలోకి ఉరికే అనేక బాధ్యతల్ని భర్తతో సమానంగా పంచుకునే మంచి స్థితిలో ఉండగలగాలి.

ఇటువంటి స్వయం వ్యక్తిత్వమూ, ఆత్మ విశ్వాసమూ కల స్త్రీ తన కుటుంబాన్ని చక్కగా సమర్థించుకుంటుంది.

మధ్య తరగతికి చెందిన చదువులేని స్త్రీలకూ, పల్లెల్లో ఉండే స్త్రీలకూ, ఆర్థిక స్తోమతా, భావ వైశాల్యమూ, అఖిల కార్య నిర్వహణా దక్షతా ఉండక పోవచ్చును మరి !— పై లక్షణాలు వాళ్ళకు వద్దా యేమి ?

ఇటువంటి వారు తాము స్వాతంత్ర్యం అనుభవించడం లేదనుకుంటారా? తను అడగగానే భర్త పుట్టింటికి పంపితే, తాను మెచ్చిన వస్తువు అడ్డంకులు లేకుండా తనకు వెంటనే లభ్యమయితే, "అంతకంటే స్త్రీకి కావలసిన స్వేచ్ఛ ఏముంది" అని అభిప్రాయపడే స్త్రీజనాన్ని నేను చాలా మందిని ఎరుగుదును.

ఇదే స్వేచ్ఛా, స్వాతంత్ర్యమూ అయితే, ఈ వస్తువు సమిష్టి కుటుంబాలలో చాలా తక్కువగా ఉంటుంది.

ఈ సమిష్టి కుటుంబాల సమస్య ఈ నాటికీ పల్లెల్లో ముమ్మరంగా ఉంది. అత్త, ఆడ బిడ్డలూ, బావలూ, మరుదులూ అందరూ, ఒక కుండలో వండిన అన్నం తిని, ఒక ఇంటి కప్పుకింద పడుకుని కలిసి మెలిసి జీవనం సాగించడమే వీటి పరమాశయం. ఈసడింపులూ, వ్యక్తి గత కాంక్షలు మర్చిపోయి, కుటుంబంలో ఉన్న అందరి శ్రేయస్సూ అర్థించే అంత దొడ్డ బుద్ధి అందరికీ ఉండదు. తమ సుఖానికీ, తమ సంతాన పురోగతికీ తాప త్రాడే స్వార్థంలో చుట్టూ ఉన్న మనుష్యుల్ని ఆత్మీయులుగా ఎంచలేక పైకి ప్రేమ ప్రదర్శనా, లోపల ఈసడింపూ ఇటువంటి కుటుంబాలలో ఎక్కువగా చూస్తూ ఉంటాము. ఈ మనస్తత్వం స్త్రీ పురుష విభేదం లేకుండా అందరికీ సమానంగా చెందిందే ! అయితే, సమిష్టి కుటుంబాలలోని స్త్రీల పరిస్థితి పురుషుల పరిస్థితి కంటే వేరు. పురుషుడు సాధారణంగా ఆ కుటుంబానికి చెందిన వాడే అవుతాడు. తన తల్లీ తండ్రీ, అన్నదమ్ములూ అప్పచెల్లెళ్ళూ అనే రక్త స్పర్శ, అలనిలో, వారి యెడల అంతగా విముఖతను పెంచదు. కాని స్త్రీ మొదట అత్తగారింట పరాయిదిగా కాలుపెడుతుంది. తర్వాత, తన ప్రవర్తన వల్ల, పరిసరాల ప్రాబల్యం వల్ల, ఆ ఇంటికి యజమానురాలయ్యే అవకాశాన్ని పొందవచ్చు. వేరే చోటి నుండి వచ్చిన ఈ స్త్రీకి, ఇందరు పరాయి వాళ్ళ మధ్య అనుకున్న దల్లా నెరవేరే స్వేచ్ఛా అంత సులువుగా వస్తుందా ? రాత్రిళ్ళు తప్ప భర్త మొహం చూడని స్త్రీలూ, అణావస్తువు కొనాలన్నా పెద్దల ఆజ్ఞా ప్రసాదాల కోసం వేచి ఉండవలసిన వాళ్ళూ, వంటిల్లు తప్ప బయటి ప్రపంచం తెలియని వాళ్ళూ ఇటువంటి సమిష్టి కుటుంబాలలో కోకొల్లలుగా ఉంటారు— భర్తా, తానూ, తన పిల్లలే— ఒక ఇంట్లో మెసలే నాడు ఈ ఇబ్బంది ఉండవు కదా! ఈ పద్ధతిలో ఆలోచిస్తే, వ్యష్టి కుటుంబంలోని వ్యక్తిగా స్త్రీకి కొంత స్వేచ్ఛ ఎక్కువే— కొన్ని ఉమ్మడి కుటుంబాలలో యజమాని భార్యకు మోయలేనన్ని బాధ్యతలుంటాయి. ఆ బాధ్యతా నిర్వహణకు ఆవిడకు కొంత అధికార ప్రదర్శన కూడా ఉంటుంది. పాలేళ్ళ మీద, తోటి కోడళ్ళ మీదా, కోడళ్ళ మీదా, ఇలా అధికారం చలాయించ గలిగినంత మాత్రాన "ఆ కుటుంబంలో ఆవిడే సర్వ స్వతంత్రురాలు. ఇది స్వాతంత్ర్యం కాదా ?" అని ఎవరైనా అనుకుంటే మాత్రం తప్పేముంది? ఆ కోవకు చెందిన స్త్రీలకు ఆ స్వేచ్ఛ పుక్కిలింతలు!

చదువుకుని పట్టణ వాసాల్లో ఉద్యోగం చేస్తూ, ఆర్థిక స్తోమత కల స్త్రీ, సర్వ సాధారణంగా సమిష్టి కుటుంబాలలో ఉండదు. కారణం పట్టణ వాసాలూ, సమిష్టి కుటుంబాలు పరస్పర విరుద్ధ పదాలు గనక. ఒక వేళ అత్తా ఆడ బిడ్డల మధ్య, బావ మరుదులూ, తోటి కోడళ్ళ మధ్య అటువంటి స్త్రీయే మెలగ వలసివస్తే, ఆ మెలకువ లోని జయాపజయాలు వ్యక్తిగతమైనవని మాత్రమే ఆ స్త్రీ దురుసైనదీ, సర్దుకుని పోయే స్వభావం లేనిదీ అయితే, ఒక్క పొయ్యి, పదికొన్నిగా మారుతుంది. అలాకాక, సర్దుకునే స్వభావమే కలదైతే, గృహ నిర్వాహణ బాధ్యతలకు అత్తగారు సారథ్యం వహించి సంతానాన్ని కన్న తల్లిలా పెంచే భారం కూడా తలమీద వేసుకుంటుంది— ఏ పరిస్థితిలో నైనా ఇటువంటి స్త్రీ, స్వాతంత్ర్య హరణకు సమిష్టి కుటుంబాలు కుట్రలు పన్ని నెగ్గలేవు.

**అయినా ఇంతవరకూ వచ్చాక, మనలో మనమాట, —— సత్యమైన స్త్రీ స్వాతంత్ర్య స్వరూపానికీ, సమిష్టి కుటుంబాలకూ సంబంధ మేముంది? సముద్ర జలానికీ, అడవి ఉసిరికీ ఉన్నంత! అంతే !** ★

# వనితా వాణి

## ఉత్తరాదిలో ఆంధ్రులు

'ఉత్తరాదిలో ఆంధ్రులు' వ్యాసం చదివినాక రచయిత్రిగారు వ్యాసాన్ని అసహజ మయిన వర్ణనలతో నింపి, ప్రవాసాంధ్రుల మీద లేపోని అపోహలకు ఆస్కారము కలిగించారు.

మేము మూడు సంవత్సరాలు ఉత్తర ప్రదేశ్ రాష్ట్రములో ఉన్నాము. మా పిల్లలకు హింది అలవాటయినా, తెలుగు భాషా ఉచ్చారణలో మార్పు ఏమీ కలుగ లేదు. ఆంధ్ర రాష్ట్రానికి ఎంత దూరమున్నా, మాతృ భాష ఎలా మర్చిపోగలరు ? ఉత్తరాది వెళ్ళి సంవత్సరము కూడా కానివారు "మా అమ్మాయికి తెలుగు రాదండీ హిందీయే వచ్చును" అన్న వాక్యం చాలా అసహజంగా ఉన్నది.

అక్షయపాత్ర రావేశ్వరి (బెంగుళూరు)

* * *

వ్యాసం చదివాక నేనూ ఉత్తరాదిలో రెండు సంవత్సరములున్న దానినే కాన ఆంధ్రులపై నా అభిప్రాయము నెలబుచ్చ ప్రయత్నిస్తున్నా. రచయిత్రిగారన్నట్లు మాతృ భాషాభిమానం సర్వసాధారణంగా అందరికీ ఉంటుంది. క్రొత్తగా వచ్చిన వారు పిల్లలకి తమ కంటే హిందీ ముందు వచ్చేసిందనే గర్వంతో పిల్లలని హిందీలోనే మాట్లాడిస్తారు. అంతేకాని అసలే ఉన్నది వందో లేక రెండు వందల కుటుంబముల ఆంధ్రులైతే వారితోనే మన తెలుగులో రెండు ముక్కలు మనసు విప్పి మాట్లాడుకోవాలని ఉండడం సహజమే కదూ. పాతగా అక్కడే స్థిర నివాసం ఉన్నవారి పిల్లలకంటారా ! ! చదవడం రాకపోయినా ప్రకృతి సిద్ధంగా మాతృ భాష సామాన్యంగా వచ్చే ఉంటుంది. అలాగే ఉత్తరాదిలో కూడా తమ ఆంధ్రులు అని ఆప్యాయతగా పలుకరించే ప్రవాసాంధ్రులు మిక్కుటంగా ఉన్నారని రచయిత్రిగారు గమనించచక పోవడం శోచనీయం.

సమిష్టి సంఘాలంటారా ? అక్కడే వాలా గేండ్లు ఉండి కార్యనిర్వాహదక్షతగల వారు ఏ పట్నానికి వారుగా చిన్నచిన్న 'ఆంధ్ర విజ్ఞాన సమితు'లు ఆగ్రాలో లాగ ఏర్పరచుకొంటే అవి అభివృద్ధి తప్పక సమిష్టి సంఘం ఏర్పడుతుంది.

అన్నపూర్ణ (నెల్లూరు)

## వనితాలోకం

"మనసులో మాట" వ్యాసం చిన్నదయినను, చాలా ముఖ్యమయిన విషయమే వ్రాసేరు. కొందరు ఎంతో అప్యాయముగా మాట్లాడినట్లు నటించి, మనసులోని మాటలను పైకిలాగి, సానుభూతి చూపి, ఆ మాటలనే మరొక చోటికి అందించి, వారికి, వీరికి కలిగే కలహాలను, తమాషాగా చూస్తూ జీవితముతోనే ఆటలాడుకుంటూ ఉంటారు. అప్పుడప్పుడు మన నిత్య జీవితములో తటస్థపడే ఇటువంటి వారితో మనసులో మాట చెప్పడముకంటే డైరీలు వ్రాసుకోవడం మంచి పద్ధతే. ఇటువంటి వ్యాసం అందించిన టి. లక్ష్మీ ప్రసన్న గారు అభినందనీయులు.

తులసీ వేణుగోపాల్ (హైదరాబాద్) ★

# "శ్రీరాముడు నాకు ఆదర్శప్రభువు: శంకరుడు నా అభిమాన దైవము" అను ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ బ్రహ్మానంద రెడ్డితో ప్రత్యేకమైన ఇంటర్వ్యూ

పి. వి. ఆర్. శర్మ



సతీసమేతుడైన ముఖ్యమంత్రి

'బ్రహ్మానందం' ఆప్తులకు, ఆర్తులకు మిత్రము. పేరులోనే ఉన్నది పెన్నిధి! 'సత్యం, జ్ఞానమనంతం బ్రహ్మ' అనే ఉపనిషద్ వాక్యంలోనే లీనమై ఉన్నది బ్రహ్మానందం. చిరునవ్వు తొణికిసలాడు మొహం. కష్టసుఖాలు సానుభూతితో ఆలించే స్వభావము. కాని వాడు కలియ వచ్చినా కస్సు, బుస్సుమని కొట్ట వచ్చే స్వభావముగాదు. మిన్ను విరిగి మీదపడుతున్నా చలించని నిశ్చలమైన గంభీరతత్వము!

## పలనాటి బిడ్డ

పలనాటి వీరగడ్డన తూబాడు గ్రామాన కాసు వారింట పుట్టిన బ్రహ్మానందరెడ్డి 55 వ ఏట రాష్ట్ర రథ సారధ్యము, నేతృత్వము వహిస్తాడని ఎవరు వూహించారు! చిరుమామిళ్ల వాస్తవ్యులైన తన మేనమామ కుమార్తె రాఘవమ్మను చేబట్టి సిరిసంపదలు పొందాడు. ఈ దంపతులలో చిత్రం—రాఘవమ్మ తూబాడులో పుట్టింది. బ్రహ్మానందరెడ్డి చిరుమామిళ్లలో పుట్టారు. చిన్ననాడే జనకుని పోగొట్టుకున్నా, అన్న వెంకటరెడ్డి ఎడ భక్తి శ్రద్ధలు కలిగి, పెద్ద చదువు చదివి, న్యాయ శాస్త్ర పట్టమును సంపాదించాడు.

1936 లో జిల్లాలో వారు అధ్యక్షపదవిని, 1946 లో శాసనసభా సభ్యత్వాన్ని, 1956 లో మంత్రిత్వాన్ని స్వయం ప్రతిభవల్ల సంపాదించి ఏడేళ్ళు మంత్రిగా ఉండి, రాష్ట్ర ఆర్థికపరిస్థితిని చక్కబరచి 1964 ఫిబ్రవరి 29 న రాష్ట్ర ముఖ్యమంత్రి పీఠాన్ని అధిష్ఠించిన ప్రజ్ఞాశాలి. దైవానుగ్రహం, పెద్దల ఆశీర్వచనంతో పైకి వచ్చానని నమ్మినవాడు.

## పెద్దలయెడభక్తి

పెద్దల ఎడ, దైవమునందు భక్తి, దేశసేవ యందు ఆసక్తి, పేదల కష్టముల దీర్పుటలో అనురక్తి కలవాడు. "భారత రాజకీయములలో స్వాతంత్ర్య రథసారథులైన గాంధి, నెహ్రూలు నాకు ఆరాధ్య పురుషులు. ఆంధ్రకేసరి ప్రకాశం గారి ధీరత్వము అంటే నాకు పెద్ద గురి. దేశోద్ధారక శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి దాతృత్వము, ప్రశాంత మనస్తత్వము, నేతృత్వము—కథలు, గాథలుగా విని వారి నొక ఆదర్శపురుషునిగా పూజిస్తున్నాను" అని శ్రీ బ్రహ్మానందరెడ్డి చెబుతారు. మితభాషిత్వము, సత్యాన్వేషణము

**ఇటీవల శ్రీ బ్రహ్మానందరెడ్డిగారు మద్రాసుకి వచ్చినప్పుడు ఇక్కడి వారు ఆయనకి ఘనమయిన స్వాగతం ఇచ్చారు. ఆంధ్రరాష్ట్రం ఏర్పడిన తర్వాత ఏ ఆంధ్ర ముఖ్యమంత్రికీ ఇంత గొప్ప స్వాగతం లభించలేదని చెప్పవచ్చు. శ్రీ కాసు బ్రహ్మానంద రెడ్డిగారితో ఈ ప్రత్యేకమయిన ఇంటర్వ్యూ ఈ సందర్భంలో మరింత ఉచితంగా ఉంటుందని అనుకుంటున్నాము.**

నందు గురుత్వము, బుజాపాలనమునందు లక్ష్యము కాసువారికి అలంకారములైన గుణములు. ఆయన స్వయంగా శ్రద్ధ వహించి పెంచిన ఆరామములో కూర్చొని మాట్లాడుతూవుంటే వెన్నెల్లో కూర్చున్నట్లు,పన్నీరు చల్లినట్లు, ఆప్తునితో ఆంతర్యము వెళ్లబోసుకున్నట్లు ఉంటుంది. పరుల ఎడ సహనము, ఎట్టి పరిస్థితులందు గాని నిగ్రహము ఆయనకు ఉగ్గుపాలతో పెట్టిన గుణములు.

"శ్రీరాముడు నాకు ఆదర్శప్రభువు శంకరుడు నా అభిమాన దైవము ఈశ్వర లింగాన్ని దర్శించి నప్పుడు, అభిషేకం చేసి అర్చించినప్పుడు నిజంగా నా కదేదో తన్మయత్వం కలుగుతుంది ఏదో ఒక విధమయిన దివ్యావేశము జనిస్తుంది. తలుచు కుంటేనే ఒళ్లు పులకరిస్తుంది." ఈ మాటలు అన్నది ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి ఆంధ్రపత్రిక ప్రతినిధి వారిని దర్శించి మూడు మాసాలుగా ముఖ్యమంత్రిగా వారి లనుభవాన్ని గూర్చి, వారి ఆదర్శ ప్రభువు, అభిమాన దైవాన్ని గూర్చి అడుగగా చెప్పిన మాట లివి

"మీకు రాముడు ఆదర్శమా ? శ్రీ కృష్ణుడు ఆదర్శమా ?" అంటే 'అవశ్యము రాముడే నా ఆదర్శ ప్రభువు' అంటారు. రామాయణ, భారత, భాగవతాది కావ్యాలలో ఆయనకు నచ్చినది రామాయణము రాముని సత్య వాక్పరిపాలనము, మధుర వాక్కు, మధుర భాషణము, మధుర వర్తనము ఆయనను సమ్మోహ పరచినవి. రామరాజ్యమే ఆయన కలలుగను ఆదర్శ రాజ్యము !

## దేవతామూర్తుల దర్శనము

ముఖ్యమంత్రి నివాస మందిరంలో అడుగు పెట్టడంతోటే ఎదురుగుండా గోడకు కనిపించే శారదా దేవి నిర్మల చిత్రము, బీరువాలోని రంగురంగుల కొండపల్లి బొమ్మలు ఆ దంపతుల కళా ప్రియత్వమునకు చక్కని నిదర్శనము. ఆ వెంట వారి సోదరుడు కే. వే. వెంకటరెడ్డి, గాంధి, నెహ్రూ మున్నగు పెద్దల చిత్రాలు, వారికి పెద్దల ఎడ గల భక్తికి నిదర్శనాలు మందిరమున అధికార పీఠమునకు ఎదురుగా కనిపించు శ్రీ తిరుపతి వెంకటేశ్వరుని, శ్రీశైల భ్రమరాంబా మల్లికార్జునుల చిత్రాలు వారి హృదయ కుహరమును నెలకొని ఉన్న దేవతా మూర్తులకు ప్రతీకలు.

శ్రీశైల భ్రమరాంబా మల్లికార్జున మహాక్షేత్ర ఉద్ధరణకు, శ్రీ బెల్లంకొండస్వాములవారి ఆధ్వర్యాన అప్పటి దేవాలయ కమిషనరు శ్రీ పైడి లక్ష్మయ్య ప్రోద్బలమున లోక కల్యాణార్థమై జరిపిన మహా రుద్రయాగ నిర్వహణకు శ్రీ బ్రహ్మానందరెడ్డి చేసిన సేవ ఆ ఉద్యమముతో సంబంధం ఉన్నవారికి తెలుసు. ఆయన ఆ మధురస్మృతులకు ఉత్తేజితులౌతారు. శ్రీశైలక్షేత్ర జీర్ణోద్ధరణ మహోద్యమములో దేశోద్ధారక నాగేశ్వరరావుపంతులుగారు నలభైఏండ్ల క్రితము వేసిన అంకురం మొలకలెత్తి భక్తుల నుండి ఆంధ్రపత్రిక లక్ష ఇరవై ఒక్కవేల రూపాయలు వసూలుచేసిన తీరు తెన్నులూ, ఆ మొత్తమును అప్పటి ముఖ్యమంత్రికి సమర్పించిన సంఘటన, అందులో ప్రజలు వెల్లడించిన భక్తిశ్రద్ధలు తమను చకితులను చేశాయని శ్రీ బ్రహ్మానందరెడ్డి చెబుతూ ఉంటారు

శ్రీశైల క్షేత్రోద్ధరణలో ఆయన ఆసక్తి కనపరచడమే కాక శ్రీ భ్రమరాంబా దేవాలయముపై ప్రతిష్ఠించిన స్వర్ణకలశానికి వెయ్యి నూట పదహారు రూపాయలు చంద్రుని కొక నూలుపోగు అన్న చందాన యిచ్చారు సీతాదేవి శ్రీ భ్రమరాంబా సన్నిధిన ప్రతిష్ఠించిన సహస్ర రామలింగేశ్వర ఆలయాన్ని స్వయంగా విరాళమిచ్చి ఉద్ధరించారు శ్రీశైల క్షేత్రోద్ధరణకు సలహా లివ్వడానికి ఒక ప్రవీణుల సంఘాన్ని నియమింపజేశారు. జగత్తుకు వెలుగునిచ్చిన, జగద్గురు శ్రీ ఆదిశంకరులు శృంగేరిలో స్థాపించిన శంకర పీఠముయొక్క శాఖను శివాజీ గోపురానికి ఉత్తరాన స్థాపించడానికి కృషి చేస్తున్నారు



పలనాటిబిడ్డ బ్రహ్మానంద రెడ్డి

## దేవాలయాల ఉద్ధరణ

"దేవాలయాలే మన సంస్కృతికి చిహ్నాలు. కళలకు ఆటపట్టులు. జ్ఞానజ్యోతిక నిలయాలు. అట్టి దేవాలయాలలో అర్చనాదులు శాస్త్రయుక్తంగా, సంప్రదాయానుసారంగా జరగాలి ధర్మకర్తలు, దేవాదాయ శాఖోద్యోగులు, దైవ ద్రవ్య వినియోగంలో తమ విద్యుక్తధర్మాన్ని సక్రమంగా నిర్వర్తించాలి."

"ఏమాత్రం వెప్పడగనదైనా శిథిలావస్థలో ఉండే దేవాలయాలను ఉద్ధరించాలి ఈ ఉద్ధరణ కార్యక్రమము పూర్వుల నిర్మాణాన్ని నిర్మూలించేదిగా గాక, ప్రాచీనత్వాన్ని ఆర్ష సంపదను అస్తానపదంగా కాపాడేదిగా ఉండాలి భద్రాచలము, శ్రీశైల క్షేత్రాల వలెనే ఒక సమగ్రమైన పథకాన్ని దేవాదాయశాఖ ఏర్పరచి దేవాలయాలను ఉద్ధరించాలి. కొద్దిపాటి మరమ్మతులకు మూల భవనాన్నే పడగొట్టేదిగా ఉండరాదు" దేవాలయోద్ధరణ గూర్చి ముఖ్యమంత్రి అభిప్రాయం అది

## వేదపోషణ

ఆర్య విజ్ఞాన బీజాలను అంతరించకుండా సంరక్షించాలనేది వారి ఆకాంక్ష. ఆర్ష విద్యలకు, వేద పోషణకు ప్రభుత్వం ఏవిధంగా తోడ్పడదలచినదీ అన్న ప్రశ్నకు "మరి ఈ విషయంలో వేద పండితులైనవారు ఫలాన విధంగా మీరు వేదాన్ని పోషించే పద్ధతిని అవలంబించాలి అని ఒక పథకాన్ని మాకు సమర్పిస్తే, దాన్ని శ్రద్ధగా పరిశీలించచేసి చెయ్యగలిగింది చేస్తాము వేదశాస్త్ర విద్యార్థులకు ఉపకార వేతనాలు, సాంగోపాంగముగా వేద శాస్త్రాలను చెప్పి విద్యలో స్వార్ణంగా ఉత్తీర్ణులను చేసే ఉపాధ్యాయులకు బహుమానములు ఇవ్వాలని కొన్ని సూచనలు చేస్తున్నారు. వేదశాస్త్ర పండితులు వ్రాతపూర్వకంగా వివరాలతో మాకు ఒక విజ్ఞప్తి పంపితే శ్రద్ధతో పరిశీలించగలము' అని ముఖ్యమంత్రి అన్నారు.

# "దేవాలయాలే మనసంస్కృతికి చిహ్నాలు : కళలకు ఆటపట్టులు"

సంగీత సాహిత్యాది విషయాల గూర్చి ముఖ్య మంత్రి ఇలా చెప్పారు:

## సంగీత సాహిత్యాలు

"ఇక సంగీత సాహిత్యపోషణ విషయము. ఐహికమే మన జన్మకు పరమార్థముగాదు. ఐహికాముష్మికాలను రెంటినీ సాధించాలి అందుకే సంగీత, సాహిత్యాది చతుఃషష్టి కళలు తోడ్పడాలి. సంగీతశాస్త్ర పోషణకు సంగీత నాటక అకాడమీ, సాహిత్య పోషణకు సాహిత్య అకాడమీ, లలితకళా పోషణకు లలితకళా అకాడమీలు ఏర్పాటు చేశాము. అంతటితో మా పని అయిపోయినదని మేము అనుకోవడంలేదు. వీటి కృషిపై పండితులైనవారు, ప్రవీణులైనవారు నిర్మాణాత్మకమైన విమర్శనలను చూపించాలి ఆంధ్ర సాహిత్యాభివృద్ధికి, సంగీత వికాసానికి, కళాభివృద్ధికి తగు సూచనలు చెయ్యాలి. ఈ సంస్థలు కూడా క్షుణ్ణమైన పాండిత్యం గలవారికి ప్రోత్సాహమిస్తూ తమ కర్తవ్యాన్ని చక్కగా నెరవేర్చాలి ఈ అకాడమీలకు రవీంద్ర భారతి ఆవరణలో భవన నిర్మాణానికి ఈమధ్యనే శంకుస్థాపన జరిగినది."

ఇంతేగాక, ప్రజల నిమిత్తం ప్రబోధాత్మకమైన సందేశయుతమైన చలనచిత్రాలు తీయడానికి, రాజధాని నగరములో ప్రభుత్వం కొన్ని సౌకర్యాలు ప్రకటించినది అందుకు సంబంధించినవారు ఈ అవకాశాలను సక్రమంగా వినియోగించుకోవాలి."

## ఆయుర్వేదము

వేదాలలో పంచమ వేదముగా పరిగణింపబడుతూ గ్రామీణులకు, నగరవాసులకు నమ్మకంగా, సరసముగా అందుబాటులో పనిచేసే ఆయుర్వేద వైద్యానికి ప్రోత్సాహం ఇచ్చేందుకు ప్రభుత్వము ఏమి చెయ్య తలపెట్టినది అన్నప్రశ్నకు ముఖ్యమంత్రి చెప్పిన సమాధానమిది "కారణాలు ఏమనండి ఇప్పటి పరిస్థితులు చూస్తే ఆయుర్వేదానికి పెద్ద భవిష్యత్తు నాకు గోచరించడం లేదు. ఈ విషయమై ఇంతవరకు తగు పరిశోధనాభివృద్ధి కనిపించలేదు."

మరి పాశ్చాత్య వైద్యముతో పోల్చినప్పుడు మీరు ఆయుర్వేదానికి కేటాయించిన మొత్తం మాత్రం ఎంత అని అడుగగా ముఖ్యమంత్రి 'ఇదంతా ఒక విషవలయ పరిభ్రమణంలా' ఉన్నదన్నారు, పరిశోధనలో మంచి ఫలితాలు కనిపిస్తేనే గాని డబ్బు హెచ్చుగా కేటాయించడానికి లేదు. డబ్బు హెచ్చుగా కేటాయిస్తేనేగాని పరిశోధన ఫలించదనవచ్చు' అన్నారు.

మరి ఈ పరిశోధనలో ఆంగ్లభాషా జ్ఞానం లేకపోతే ఎంతటి ఉద్దండ పండితులైనా పరిశోధనకు పనికిరాడనే వైద్యశాఖ ఉద్యోగుల దాస్య మనస్తత్వాన్ని దృష్టికి తేగా ముఖ్యమంత్రి—"వాస్తవమే. స్కూల్‌ఫైనల్ ప్యాసైతేనే తెనుగు పండితునకు ఉద్యోగం ఇవ్వరాదన్నట్లే ఉన్నది ఇది. తెనుగు పండితుడికి స్కూల్‌ఫైనల్‌తో నిమిత్తమేమి గనుక ?" ఈ సందర్భంలో గూడా ఆయుర్వేదంలో మంచి పరిశోధనకు, పండితులైనవారు కంకణందాల్చి ముందుకువస్తే ప్రభుత్వం సానుభూతిలో వరి పథకాలను పరిశీలించగలరు" అన్నారు మరి గ్రామాల్లో సరసంగాను, అందుబాటులోను లభించే వైద్యము ఆయుర్వేదమే గదా అనగా—"గ్రామాల్లో గూడా ఒక్క సూది మందు ఇస్తే రెండు రూపాయలు ఇస్తాములనే స్థితికి ప్రజలు వచ్చారు కాల ప్రభావాన్ని ప్రజల అనుభవాన్ని, రోగాలు తగ్గే స్వభావాన్ని బట్టి వైద్యపోషణ ఆధారపడి ఉన్నది. కొన్ని ప్రత్యేక వ్యాధులను కుదర్చడంలో ఆయుర్వేద చికిత్సా పద్ధతులపై పరిశోధన చెయ్యవచ్చు. మన దేశ విద్య లన్నిటికి మనం ప్రోత్సాహం ఇచ్చి పునః ఒక దీప్తి తీసుకురావడం ఎంతో అవసరమే" అన్నారు.

(మిగతా పైవారం)

**29-5-1964 శుక్రవారము మొదలు**
**4-6-1964 గురువారము వరకు**

### మేషం :

(అశ్వని, భరణి, కృత్తిక 1 పా.)

గత వారంలో వృత్తి వ్యాపారాల్లో ఏర్పడిన చికాకులు క్రమంగా తగ్గుముఖం పడతాయి. వ్యాపారంలో ఆదాయం పెరగగల సూచనలు ఉన్నాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. భారీ ఎత్తున చేసే వ్యాపారాలు తలపెట్టడం వలన కొంత ఇబ్బందికి గురికావలసి వస్తుంది. ఉద్యోగంలో అనుకూలంగా మార్పులు రావచ్చును కోర్టు వ్యవహారాల్లో ఏర్పడిన ప్రతిష్టంభన తొలగగల సూచనలు లేవు. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. కొంతమంది మిత్రులకు సహాయం చేయడంవలన కొంచెం శ్రమ కలుగవచ్చును. రాజకీయాల్లో ఇంతవరకు వ్యతిరేకంగా ఉన్నవారు కూడా మీకు అనుకూలంగా వ్యవహరిస్తారు.

స్త్రీలకు—వార ప్రారంభంలోనే కొంచెం బలహీనత చేయవచ్చును. సాంఘిక కార్యక్రమాలు మీ అభిప్రాయానుసారం నెరవేరతాయి.

### వృషభం :

(కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగ 1, 2పా.)

గతవారం కంటె యీ వారం మొత్తంమీద బాగా ఉంటుంది. వార ప్రారంభంలోనే కొంత ఆందోళన కలిగినా వారాంతానికి అన్ని వ్యవహారాల్లోను అనుకూలమైన మార్పులు వస్తాయి. వ్యాపారంలో జరుగవలసిన పనులు చురుకుగా జరిగి లాభించగల సూచనలు ఉన్నాయి. వృత్తికి సంబంధించిన కొత్త విషయాలను తెల్సుకొంటారు. ఉద్యోగంలో ఏవిధమైన మార్పులు రావు గాని పై అధికారుల ఆదరణ లభిస్తుంది. ఉష్ణాధిక్యతవలన అనారోగ్యం చేయవచ్చును. వృత్తిరీత్యా చేయవలసిన ప్రయాణాల్లో ప్రయోజనం ఉంటుంది. సాహిత్య వైజ్ఞానిక రంగాల్లో మీ కృషికి పరిగణన లభిస్తుంది. సంతోషకరమైన వార్తలు వింటారు.

స్త్రీలకు—ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. కుటుంబ కార్యక్రమాలు నిరాటంకంగా జరుగుతాయి. అధిక వ్యయం చేస్తారు.

### మిథునం :

(మృగశిర 3, 4 పా, ఆర్ద్ర, పునర్వసు 1, 2, 3 పా.)

ప్రయత్నించిన పనులన్నీ నెరవేరుతున్నా వాటి నిమిత్తం చాలా శ్రమ పొందవలసి వస్తుంది. వారం మధ్యలో వృత్తి వ్యాపారాల్లో ఆందోళనా, నష్టం కలిగించే పరిస్థితి ఏర్పడవచ్చును వ్యాపారంలో వారాంతానికి అనుకూల పరిస్థితి ఏర్పడుతుంది. వృత్తి ఉద్యోగాల్లో ఆదాయం పెరగగల సూచనలు ఉన్నాయి. ఇంతవరకు మీకు అనుకూలంగా ఉన్న బంధువులు కొంతమంది మీకు వ్యతిరేకులుగా మారడంవలన కుటుంబ వ్యవహారాల్లో జాగ్రత్త చాలా అవసరం. విలువైన వస్తువులు పోయే ప్రమాదం ఉన్నది. ఆరోగ్యం అంత బాగా

| | కు<br>బు గు | ర | శు రా |
|---|---|---|---|
| • | వారఫలం | | |
| | మ హే ష్ | | |
| చం కే | | | |

ఉండదు. స్థిరాస్తి వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. సత్పురుషుల సహవాసం లభిస్తుంది.

### కర్కాటకం :

(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష.)

అన్నివిధాలా అనుకూలమైన కాలం. వృత్తి వ్యాపారాల్లో మీ ప్రయత్నం ఆట్టే లేకుండానే కొన్ని మార్పులు వచ్చి మీకు లాభించగల సూచనలు ఉన్నాయి. వ్యాపారంలో నూతన వ్యవహారాల్లోనూ లాభం వస్తుంది. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు కూడా అనుకూలంగా ఉంటాయి. వృత్తి ఉద్యోగాలలో మీరు ఇంతవరకు ఆలోచిస్తున్న మార్పులు చేయడానికి అనువైన సమయం. ఆర్థికంగా బాగా ఉన్నా వ్యవహారాల అవసరాలు పెరగడంవలన ఆర్థికంగా ఒత్తిడి రావచ్చును. వారాంతంలో అనారోగ్య సూచనలు ఉన్నాయి. శుభకార్యాల విషయంలో బంధుమూలంగా అనుకూలత ఏర్పడుతుంది. మిత్రులకు సమయానికి తోడ్పడగలుగుతారు.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. సంతానానికి సౌఖ్యం లభిస్తుంది. విలాస వస్తువులు కొంటారు.

### సింహం :

(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)

గడచిన కొద్ది వారాల కంటే ఈ వారం అన్ని విధాలా అనుకూలంగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో ప్రోత్సాహం లభిస్తుంది. అధికారులవలన జరుగవలసిన పనులు సులభంగా నెరవేరతాయి. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాల్లో భేదాభిప్రాయాలు రావడం వలన కొన్ని కార్యక్రమాలు నిలిచిపోవచ్చును. వ్యాపారంలో ఆకస్మిక ధనలాభం కలుగగల సూచనలు ఉన్నాయి. వృత్తి ఉద్యోగాల్లో మీ అభిప్రాయాలు సరియైనవని రుజువు కావడం వలన భవిష్యత్తుమీద విశ్వాసం సాటివారిలో మేటితనం లభిస్తాయి. ఆరోగ్యం బాగానే ఉంటుంది. గాని వారం ఆఖరున స్వల్ప అనారోగ్యం చేయగల సూచనలు ఉన్నాయి. రాజకీయాల్లో మీ వాగ్దానాలను పూర్తిచేయ గల్గుతారు.

స్త్రీలకు—ఆరోగ్యం అంత బాగా ఉండదు. కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరగడం వలన తీరిక లభించదు.

**ఈ వారము ధరలు**

ధాన్యం ధరలో మాంద్యం ఏర్పడి, కొంచెం తగ్గే సూచన లున్నాయి. అపరాల ధరలు నిలకడగా ఉంటాయి. బెల్లం ధర వారం ఆఖరున తగ్గవచ్చును. మిర్చి ధర పెరుగుతుంది. మానె, నువ్వుల ధరలు కొంచెం తగ్గుతాయి.

### కన్య :

(ఉత్తర 2, 3, 4 పా, హస్త, చిత్త 1, 2 పా)

వృత్తి వ్యాపారాల్లో విశేషమైన అనుకూలత లేకపోయినా గడచిన కొద్ది వారాలలో కంటె ప్రశాంతమైన వాతావరణం ఏర్పడుతుంది. వ్యాపారంలో వెంటనే ప్రయోజనం లేకపోయినా ముమ్ముందు లాభించగల వ్యవహారాలను సాధించడానికి అవకాశం ఉన్నది. వృత్తి ఉద్యోగాలలో సాటివారితో కొన్ని భేదాభిప్రాయాలు వస్తాయి గాని వాటివల్ల ఏ కార్యక్రమమూ ఆగిపోదు. మీకు రావలసిన డబ్బు సమయానికి అందక కొంత ఒత్తిడి రావచ్చును గాని, సమయానికి కొంతమంది మిత్రులు సహాయపడతారు. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. గాని కుటుంబంలో పెద్దలకు అనారోగ్యం చేయవచ్చును. రాజకీయాల్లో ప్రతిపక్షాల హడావుడి పెరుగుతుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. బంధువులకు సహాయం చేయగలుగుతారు. సాంఘిక కార్యక్రమాల్లో ప్రాముఖ్యత లభిస్తుంది.

### తుల :

(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ, 1, 2, 3 పాదాలు.)

ఇంతవరకు మీకు అనుకూలంగా ఉన్న వ్యక్తులే వారం మధ్యలో వ్యతిరేకం కావడం వలన వృత్తి వ్యాపారాల్లో తాత్కాలికంగా అనిశ్చిత పరిస్థితి ఏర్పడవచ్చును. వృత్తి వ్యాపారాల్లో మీ ప్రయత్నాలు శ్రమమీద కాని నెరవేరవు. వ్యాపారంలో ఎక్కువ అనుకూలతను ఆశించడానికి సమయం కాదు. వృత్తిలో వారం మధ్యలో కొన్ని అనుకూలమైన మార్పులు రావచ్చును. ఉద్యోగరీత్యా చేయవలసిన ప్రయాణాలు వాయిదా వేయడం మంచిది. అప్పుడప్పుడు స్వల్ప అనారోగ్యం చేయవచ్చును. బంధువుల వ్యవహారాల్లో మీరు విజయాన్ని సాధిస్తారు. శుభకార్యాల విషయంలో ప్రోత్సాహం ఉంటుంది.

స్త్రీలకు—ఆకస్మికంగా అనారోగ్యం చేయగల సూచనలు ఉన్నాయి. బంధుమిత్రుల సమావేశాల్లో పాల్గొంటారు. కుటుంబంలో భేదాభిప్రాయాలు రావచ్చును.

### వృశ్చికం :

(విశాఖ 4-వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ)

ఈ వారం బాగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో ఏర్పడిన అనిశ్చిత పరిస్థితి తొలగిపోయి అభివృద్ధికి మార్గం ఏర్పడుతుంది. నూతనంగా చేసే వ్యాపారాలు బాగా లాభిస్తాయి. వ్యాపార

## వారఫలాలు

విస్తరణ కొరకు చేసే ప్రయత్నాల్లో ప్రోత్సాహం ఉంటుంది. వృత్తి ఉద్యోగాలలో మీ మాటకు తిరుగు ఉండదు కాని మీ అభివృద్ధిని సహించ లేని కొంతమంది వ్యక్తులు దుష్ప్రచారం చేసే ప్రమాదం ఉంది స్థిరాస్తి వ్యవహారాల్లో ఏర్పడిన చిక్కులు తగ్గిపోతాయి. ఆరోగ్యం బాగానే ఉంటుంది గాని వ్యవహారాల ఒత్తిడివలన శ్రమ కలుగుతుంది. కుటుంబ వ్యవహారాల్లో మార్పులు రావు. సంతానానికి అనారోగ్యం చేయగల సూచనలు ఉన్నాయి. ప్రేమ వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది..

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. కుటుంబ కార్యక్రమాలు శ్రమలేకుండా నెరవేరతాయి. విలువైన వస్తువులు కొంటారు.

### ధనుస్సు:

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా)

ఈ వారం గత వారం కంటే బాగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో ఇంతవరకు మిమ్మల్ని వ్యతిరేకించినవారు కూడా యిప్పుడు మీ ఎడల సుముఖత్వాన్ని చూపిస్తారు. వ్యాపారంలో అనుకూలత ఏర్పడి ఆదాయం పెరగగల సూచనలు ఉన్నాయి కాని, సాహసముతో కూడిన వ్యవహారాలు, భారీ ఎత్తున మార్పులు చేయడానికి ఇది సమయం కాదు. వృత్తి ఉద్యోగాల్లో పెద్ద మార్పులు రావు. మీ కార్యక్రమాలు ఇదివరకటి కంటే ప్రశాంతంగా నెరవేరతాయి. కోర్టు వ్యవహారాల్లో స్వల్పంగా అభివృద్ధిని సాధిస్తారు. ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. రాజకీయాల్లో మీరు వూహించని సంఘటనలు జరగడం వలన అనిశ్చిత పరిస్థితి ఏర్పడుతుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉన్నా నిర్లక్ష్యం చేయకూడదు. కుటుంబ వ్యవహారాల్లో అనుకూలత ఉంటుంది. సాంఘిక కార్యక్రమాలు వాయిదా వేయడం మంచిది.

### మకరం:

(ఉషా 2 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా.)

వృత్తి వ్యాపారాల్లో ఎన్నో అవకాశాలు మీకు కన్పిస్తూ ఉంటాయి. కాని వాటిని గురించి ప్రయత్నం చేయడంవలన వ్యయప్రయాసలను పొందడం తప్ప ప్రయోజనం ఉండదు వారాంతంలో వ్యాపారంలో మీరు చేసే ఆలోచనలవల్ల లాభం కలుగగల సూచనలు ఉన్నాయి మీరు స్వంతంగా చేసే వ్యాపారాల కంటె భాగస్థులతో కలిసి చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. వృత్తిరీత్యా ప్రయాణం చేయవలసి వస్తుంది ఉద్యోగంలో చిన్న చిన్న మార్పులు రావచ్చును. మిత్రులకు సహాయం చేయడంవలన మీరు ఆర్థికంగా ఒత్తిడికి గురి అవుతారు. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది గాని మానసికంగా విశ్రాంతి లభించదు. విద్యారంగంలో ఖ్యాతి లభిస్తుంది

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉన్నా కొంచెం బలహీనత ఉంటుంది బంధువుల కార్యాల్ని నెరవేర్చగలుగుతారు. సంతానానికి సౌఖ్యం సంతోషం లభిస్తాయి.

**కుంభం :**

(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం,
పూ. భాద్ర 1,2,3 పా.)

గడచిన కొద్ది వారాల కంటె ఈ వారం బాగా ఉంటుంది. వ్యాపారంలో మీరు తలపెట్టిన పనులు చురుకుగా సాగి లాభం వస్తుంది. వ్యాపార విస్తరణకై చేసే ప్రయత్నాల్లో ప్రోత్సాహం లభిస్తుంది. తక్కువ స్థాయి వారితో జరిపే వ్యవహారాల్లో ఆదాయం పెరగవచ్చును. వృత్తి ఉద్యోగాల్లో కొంచెం శ్రమపడినా తగిన ప్రయోజనాన్ని పొందుతారు మీ అభిప్రాయాలను అందరూ గౌరవిస్తారు. భవిష్యత్తులో మీ అభివృద్ధికి అవసరమైన మార్పులు జరగడానికి అవకాశం ఉన్నది మీరు ఇదివరకు నిర్లక్ష్యం చేసిన స్థిరాస్థి వ్యవహారాలను గురించి తిరిగి ఆలోచించవలసి వస్తుంది. వారం మధ్యలో అనవసరమైన వ్యయం చేస్తారు. ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. శుభకార్యాల విషయంలో అభివృద్ధిని సాధిస్తారు. కుటుంబ వ్యవహారాల్లో మార్పులు రావు.

**మీనం :**

(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి.)
శ్రవణం, ధనిష్ఠ 1,2 పాదాలు.

వార ప్రారంభంలో సామాన్యంగా ఉన్నా, వారాంతానికి బాగా ఉన్నదనే పరిస్థితి ఏర్పడుతుంది వృత్తి వ్యాపారాల్లో క్రమంగా అనుకూలత ఏర్పడుతుంది. రావలసిన డబ్బు సమయానికి అందడం వలన తొట్రుపాటు లేకుండా అన్ని వ్యవహారాలూ నెరవేరతాయి. వృత్తిలో పోటీ పెరుగుతుంది గాని మీ కార్యక్రమాలకు ఆటంకం ఉండదు. ఉద్యోగంలో మీరు కొన్ని అపోహలకు గురి కావచ్చును కాని క్రమంగా నిజం బయటపడడంవలన మీరు యితోధికమైన మంచి పేరును సంపాదిస్తారు. ఆరోగ్యం బాగా ఉంటుంది కాని, అప్పుడప్పుడు బలహీనత చేస్తుంది. సాంఘిక కార్యక్రమాల్లో, విజయాన్ని సాధిస్తారు.

స్త్రీలకు—వార ప్రారంభంలో, కుటుంబ వ్యవహారాల్లో కొన్ని చికాకులు వస్తాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు. ప్రయాణాలోచనలు చేస్తారు ★

# జన్మదినఫలం

## మే-29

ఈ సంవత్సరం మీజీవితంలో ముఖ్యమైన సంవత్సరాల్లో ఒకటిగా పరిగణింపబడవచ్చును. ఈ సంవత్సరంలో జరిగే సంఘటనల ప్రభావం రాబోయే సంవత్సరాల మీదకూడా ఉంటుంది వృత్తివ్యాపారాల్లో ప్రోత్సాహం లభిస్తుంది. వ్యాపారంలో నూతన వ్యవహారాలు ప్రారంభిస్తారు. వ్యాపారంలో ఆదాయం పెరగడమేకాకుండా, విజయం సాధించామనే సంతృప్తికూడా ఉంటుంది. వృత్తిలో అనుకూల వాతావరణం ఏర్పడుతుంది. వృత్తిలో మార్పులకై ప్రయత్నం చేయడానికి మంచి సమయం. ఉద్యోగస్థులకు ఉన్నతస్థానం లభించగల అవకాశం ఉన్నది. ఆరోగ్యం బాగానే ఉంటుందిగాని జ్వరాదులవలన బాధ కలుగవచ్చును. కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. రాజకీయాల్లో కొంత ప్రతిఘటన ఉన్నా మీ కార్యక్రమాలకు, అభివృద్ధికి ఆటంకం ఉండదు. విద్యార్థులకు శ్రమమీద క్లాసు రావచ్చును.

## మే-30

ఈ సంవత్సరం ప్రారంభంలో సామాన్యంగా ఉన్నా రానురాను అన్నివిధాలా అనుకూలంగా ఉంటుంది. సంవత్సర ప్రారంభంలో వృత్తివ్యాపారాల్లో స్వల్ప వ్యతిరేకత, ధననష్టం, అనవసరవ్యయం మొదలైనవి కలిగే సూచనలు ఉన్నాయి. సంవత్సరం రెండవ భాగంలో పూర్తిగా అనుకూల వాతావరణం ఏర్పడి వ్యాపారంలో ధనలాభం, గౌరవం కలుగుతాయి. భాగస్థులతోకలిసి చేసే వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి వృత్తిలో పోటీ తగ్గడానికి సూచనలున్నాయి. ఉద్యోగంలో మున్ముందు యోగించుటకు కావలసిన మార్పులు జరుగుతాయి. ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది కాని వ్యవహారాల ఒత్తిడి వలన శ్రమపెరుగుతుంది. కుటుంబ వ్యవహారాల్లో స్వల్ప భేదాభిప్రాయాలు రావచ్చును. ప్రేమ వ్యవహారాల్లో ప్రోత్సాహం లభిస్తుంది. విద్యార్థులు సాధారణంగా కృతార్థులు కాగలరు. జనవరి, ఫిబ్రవరి నెలల్లో ధనలాభం గౌరవం.

## మే-31

ఈ సంవత్సరం అన్ని వ్యవహారాల్లోను అనుకూలంగా ఉన్నా ఏదో ఒక విధంగా మానసికాందోళన కలిగే పరిస్థితి ఏర్పడుతుంది. వృత్తివ్యాపారాలు సాధారణంగా ఉంటాయి వ్యాపారంలో స్వల్పంగా ఆదాయం పెరగవచ్చును. అధికారులవలన జరుగవలసిన పనులు ఎక్కువ శ్రమలేకుండా నెరవేరుతాయి. సమయానికి డబ్బు అందక అప్పుడప్పుడు యిబ్బంది కలుగుతూ ఉంటుంది. వృత్తి ఉద్యోగాల్లో మీ అంతస్థు పెరగవచ్చును. స్థిరాస్థి వ్యవహారాల్లో కొన్ని చిక్కులు ఏర్పడి తద్వారా ధనవ్యయం జరుగగల సూచనలు ఉన్నాయి. ఆరోగ్యం బాగానే ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు కొంచెం శ్రమమీద నెరవేరతాయి. బంధు వ్యవహారాల్లో మీరు జోక్యం చేసుకొనవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. తీర్థయాత్రలు చేస్తారు. విద్యార్థులు చాలా శ్రమమీద కృతార్థులు కాగలరు. వస్త్రవ్యాపారులకు, నటీనటులకు మంచిసమయం.

## జూన్-1

ప్రయత్నించిన ప్రతిపని నెరవేరుతున్నట్లే కన్పిస్తుంది. ప్రపంచం మిమ్ములను కార్యసాధకులుగా గౌరవిస్తుంది. కాని మీలో మీకు అంతగా విశ్వాసం, సంతృప్తి కన్పించవు. వృత్తివ్యాపారాల్లో మీ కార్యక్రమాలకు అంతగా ప్రోత్సాహం లభించదు వ్యాపారంలో మీ అభిప్రాయాలు అమలు జరపడానికి అనుకోని ఆటంకాలు రావటంవలన మీరు పొందవలసిన ప్రయోజనాన్ని పొందలేని పరిస్థితి ఏర్పడుతుంది. వృత్తి ఉద్యోగాల్లో ఉన్న దానితో సంతృప్తిపడడమే ప్రస్తుతానికి మంచిది. మీ ప్రయత్నాలవల్ల అనుకూలతకన్నా ప్రతికూలతయే కలగడానికి అవకాశం ఉన్నది. ఆరోగ్యం బాగా ఉన్నా కాలడం, జారిపడడం వంటి ప్రమాదాలు కూడా వచ్చును. కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. రాజకీయాల్లో క్రమంగా ప్రోత్సాహం లభిస్తుంది. విద్యార్థులకు సెప్టెంబరు పరీక్షలు అనుకూలంగా ఉంటాయి.

## జూన్-2

ఈ సంవత్సరంలో అప్పుడప్పుడు నిరాశ, చికాకులు కలిగినా, మొత్తంమీద బాగా ఉంటుందని చెప్పవచ్చును. మీరు యిదివరకు వృత్తివ్యాపారాల్లో చేసిన ప్రయత్నాలకు యిప్పుడు ఫలితాన్ని పొందగలరు. వ్యాపార విస్తరణ కొరకు చేసే ప్రయత్నాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. వ్యాపారంలో యితరుల సలహాలను పాటించడంకంటె మీ అభిప్రాయాలను అమలుపరచడమే మంచిది. సంవత్సర ప్రారంభంలో, వృత్తిలో ఆదాయం పెరుగుతుంది. కాని సంవత్సరం చివరను కొన్నిచికాకులు కలగవచ్చును. ఉద్యోగస్థులకు ఉన్నత స్థానము లభించగల అవకాశాలు ఉన్నాయి. కోర్టు వ్యవహారాల్లో వ్యయప్రయాసల మీద అనుకూలత లభిస్తుంది ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. కుటుంబ కార్యక్రమాలకు అప్పుడప్పుడు ఆటంకాలు వస్తూ ఉంటాయి. విద్యార్థులు మంచి మార్కులతో కృతార్థులు కాగలరు.

## జూన్-3

ఈ సంవత్సరం అన్నివిధాలా బాగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో మీ ఆలోచనలకు యీ సంవత్సరంలో ఒక రూపు ఏర్పరుస్తారు. వ్యాపారంలో ఆకస్మిక ధనలాభం కలుగుతుంది. నూతన వ్యాపారాలు ప్రారంభించడానికి అనుకూలమైన సమయం. మీ మిత్రులతో కొంతసొమ్ము మోసం చేయడానికి ప్రయత్నం చేస్తారు. కాబట్టి అన్ని వ్యవహారాల్లోను చాలా నిదానంగా వ్యవహరించడం అవసరం. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి ఉద్యోగస్థులకు, తమ అభిప్రాయాలకు తగిన అవకాశాలు లభించడంవలన తమ శక్తి సామర్థ్యాలను రుజువు చేసికొనగలుగుతారు. ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు యిదివరకటికంటె ప్రోత్సాహకరంగా ఉంటాయి. శుభకార్యాల విషయంలో అభివృద్ధి ఉంటుంది. సాంఘిక వ్యవహారాల్లో హోదా పెరుగుతుంది. విద్యార్థులకు క్లాసు వచ్చుటకు అవకాశం ఉన్నది.

## జూన్-4

ఈ సంవత్సరం అంత బాగా ఉంటుందని చెప్పడానికి అవకాశం లేదు. వృత్తివ్యాపారాలు సామాన్యంగా ఉంటాయి. వ్యాపారంలో యిదివరకు మీరు జరిపిన వ్యవహారాల్లో నష్టం రావచ్చును. వ్యాపార విస్తరణ కొరకు చేసే ప్రయత్నాలు, భాగస్వాములతో కలసిచేసే వ్యాపారాలు వాయిదా వేయడం మంచిది. వృత్తిలో కొత్తవారితో పరిచయం కలుగుతుంది. ఉద్యోగంలో స్థాన చలనమునకు అవకాశం ఉన్నది. స్థిరాస్థి వ్యవహారాలు యిదివరకటికంటె అనుకూలంగా ఉంటాయి. డబ్బుకు సంబంధించిన వాగ్దానాలు చేయుటంవలన ఇబ్బందిపడవలసివస్తుంది. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాల్లో స్వల్ప భేదాభిప్రాయాలు వచ్చినా, అన్ని పనులూ సక్రమంగా నెరవేరతాయి. బంధువులవల్ల నిష్ఠూరం,వ్యయం తప్ప ప్రయోజనం ఏమీ ఉండదు. ప్రేమ వ్యవహారాల్లో ప్రోత్సాహం ఉంటుంది. విద్యార్థులు శ్రమమీద కృతార్థులు కావచ్చును. ★

"నన్ను గురించి కథ వ్రాయరూ ?"

"అవును నరహరీ. నిన్ను గురించి, నన్ను గురించి వ్రాస్తేనే కథ అంతేకాదు, ఏ వస్తువును గురించి వ్రాసినా అది కథే. భగవంతుని దృష్టిలో ఏ వస్తువూ పనికిరాదనో, నీచమైనదనో అనుకోక పోతే ప్రతి మానవుని, వస్తువు చరిత్ర కథే."

"అయితే నా గురించి కథ రాయండి" నరహరి మళ్ళా అడిగాడు.

నాకు ఆశ్చర్యమేయలేదు. నేనొక రచయితనని నేను కథలు రాస్తున్నానని బహిరంగంగా అందరితో చెప్పుకోక పోయినా నరహరికెలా తెలిసిందంటే, అతను మా బ్రాంచి పోస్టాఫీసులో డెలివరీ ఏజంటు. నాకొచ్చే వుత్తరాలు, మనియార్డర్లు, మా బడికి సంబంధించి మేనేజిమెంటువారు పంపే ఆఫీసుత్తరాలన్నీ అతగాడే తెచ్చివ్వడంతో నా సంగతి కొంతకి కొంత తెలుసుకున్నాడు. నేను కథరాసి చిత్తూరు పోస్టాఫీసులో బుక్ పోస్టు చేసినా, అది ప్రచురిస్తే ప్రచురిస్తామని సంపాదకుల నుండి వచ్చే వుత్తరం కాని, ప్రచురించాక పంపే పుస్తకం కాని, ప్రతిఫలంగా లభించే ధన సహాయం కాని నరహరి మూలంగానే రావాలి. నరహరి అందుకనే 'నన్ను గురించి' కథ రాయమన్నాడు. కాకపోతే మరో విషయం. ప్రచురణ కాకపోయేవట్ని కథ తాలూకు పార్సెలును తిరిగి భూ భ్రమణంలా నాకు చేరాలంటే మా నరహరే మోసి తెస్తాడు. నరహరి అంటే నాకు ఎంతో ఇష్టం. అతడొస్తే చాలా విషయాలు చెబుతాడు.

"ఏం సార్ బదులు చెప్పడం లేదు. నాకు బీట్‌కు టయిమవుతున్నది. ఆలోచించంచే రాయండి. చాలా బాగా రాయాలి."

"నరహరీ! కథ రాయొచ్చు నిన్ను గురించి నువ్వేమి అనుకోవనుకో. అందరలా వుంటారా ? రాసేవాళ్ళ పైకి దండెత్తిరారూ ?"

"అదంతా నాకు తెలియదు సార్ మీరు నా కథ రాయవలసిందే."

"ఇప్పుడని చెప్పలేను కాని తప్పక ఒకప్పుడు రాస్తాను. నరహరీ!" అని హామీ ఇచ్చాను.

మాట నిలుపుకోవాలని నాకు తెలును. నిజంగా చెబుతున్నాను. రెండు సంఘటనలు జరక్కపోతే నేను ఈ కథ వ్రాసివుండనని నొక్కి చెప్పగలను !!

పోస్టాఫీసు సిబ్బందిని రెండు రకాలుగా విభజించడంతో బ్రాంచి పోస్టాఫీసు సిబ్బంది 'ఎక్స్ట్రా' డిపార్టుమెంటు నామకరణంతో వ్యవహరింపబడుతుంది. తక్కిన సిబ్బందికున్న సౌకర్యాలు ఈ సిబ్బందికి లేవు. జీతం చాలా తక్కువ. పొలం పుట్రా లేని నరహరివంటివానికి ముప్పై రూపాయలు ఎక్కడికి ? నరహరికి భార్య, ఇద్దరు పిల్లలున్నారు. ఇవికాక బంధువర్గం అడపా తడపా తికాణావేస్తే ఇక చాలు 'హరిలో రంగా హరి' కావలసిందే. ఉన్నది గ్రామమయినా, మారిన మాలోకంతోపాటు గ్రామాల్లో కూడా జీవనవ్యయం పెరిగిన కారణాన్ని పురస్కరించుకుని లెక్కలేస్తే నరహరికి వచ్చే జీతం చాలా తక్కువ. పని ఏ మాత్రం తక్కువ లేదు. రంచన్‌గా తెల్లవారి పదిగంటలకు రోడ్డుకు వెడతాడు నరహరి. పదిముప్పావుకు బస్సులో తపాలా సంచి వస్తుంది. దాన్ని నెత్తిన వేసుకుని (నేను ప్రత్యక్షంగా చూశాను) పోస్టాఫీసుకు తెచ్చి, సంచి విప్పి ముద్రలు వేసి, మనియార్డర్లు వేరుగా, రిజిష్టర్లు వేరుగా వుంచుకుంటాడు. మనియార్డర్లు, రిజిష్టరు కవర్లు ముందు బట్వాడా చేస్తాడు. తక్కిన వుత్తరాలు వేరుగా వుంచుకుని, గబగబా ఇంటికి వెళ్ళి అన్నం తిని గ్రామాలకు రావడంతో పని మొదలు. అప్పటి టైము పంద్రెండు గంటలు.

ఎండలో చెప్పులయినా లేక, చినిగిన ప్యాంటు, మాసికలేసిన చొక్కాతో వచ్చే నరహరిని అల్లంత దూరంలో చూసి బంధువు వచ్చినట్లు జనం మూగితే ఎవరి వుత్తరంవారికి బట్వాడా చేసినావద్దకు వస్తాడు. సంతోషాన్ని, కుతూహలాన్ని, ఒక్కొక్కప్పుడు దుఃఖాన్ని సహితం మోసికొనితెచ్చే నరహరి అంటే అందరికి ప్రీతి. పత్రికలు పోస్టులో వచ్చేవయితే నరహరిని చుట్టుకుంటారు. ఎప్పుడెప్పుడు నరహరిని చూస్తామా అన్నంత ఆతురతతో రచ్చవద్ద కాచుకుని వుంటారు

"టైమ్ చూసి చెప్పండి సార్. ఇక రెండు గ్రామాలున్నాయి. ఒక మనియార్డరు, రెండు రిజిష్టరు కవర్లున్నాయి. మూడుకల్లా పోస్టాఫీసుకు వెళ్ళాలి" అంటూ అతి తొందరగా లేస్తాడు నరహరి.

"పదిహేను నిమిషాలున్నాయి రెండుకి."

"అరెరే, గంట రెండు కాబోతున్నది. వస్తాను సార్!" అంటూ ఆత్రంగా,పరిగెత్తే నడకలోవెడతాడు.

ఒకరోజు అవసరంలో, సంతకాలు తీసికునే బీటు పుస్తకాన్ని మరచి వెళ్ళిపోయి, మళ్ళా వచ్చి తీసికొని వెళ్ళాడు.

"తొందరలో వెళ్ళిపోతాను." అని నా ప్రత్యుత్తరాన్ని ఆశించకుండా వెళ్ళిపోయాడు.

మూడు గంటలకల్లా అన్ని గ్రామాలు చూచుకుని పోస్టాఫీసుకు వెళ్ళి, మళ్ళా వెళ్ళవలసిన జాబులకు ముద్రలు కొట్టడం, మనియార్డర్లు ఇచ్చినవి, ఇవ్వనివి బ్రాంచి పోస్టుమాస్టరుకు లెక్కఒప్పజెప్పడం. కట్టకట్టుకుని మళ్ళా రోడ్డుకి చేరుకుంటాడు. సుమారు నాలుగు గంటలకు బస్సు వస్తుంది. కట్ట బస్సులో వేసి చేతులు దులుపుకుని ఈ రోజు బరువు వెళ్ళిందని బస్సు కనుమరుగయ్యే పర్యంతం చూసి, తిరుగు ముఖం పట్టడంతో పని ఆఖరు కాదు.

నరహరే నాతో చెప్పేవాడు.

"ఏంసార్ చెయ్యడం. కార్డు అడుగుతారు. ఆరు పైసలు రేపిస్తామంటారు. గ్రామం కదా అందరూ తెలిసినవాళ్ళు లేదనడానికి మనసొప్పదు. సరేనని ఇస్తామనుకోండి. ఇచ్చిన వాళ్ళు ఇచ్చారు. లేనివాళ్ళు లేదు" అంటూ ముఖంపై కుడిచేతిని వుంచుకుని నవ్వుతున్న నరహరిని చూస్తే నాకు కోపం వచ్చేది.

"ఆ డబ్బునెలా అడ్జస్టు చేస్తావ్" అని అడిగాను కోపంగానే.

"నాచేతిలో నుండి వేసి కడతాను" అంటాడు నరహరి.

ఇటువంటివి పెట్టుకోవద్దన్నా వినని నరహరిపై ద్విగుణీకృతమైన కోపం వచ్చిన మాట నిజమే. అదే చెప్పాను.

"అది వీలుకాదు లెండిసార్." అన్నాడు.

"అనుభవించు నీ ఖర్మ" అన్నాను.

నేను నరహరి నిజాయతీని శంకించిన మాట నిజమేను. అతడు మాట నిలుపుకునే వాడేనా అని అతని మాటలబట్టి బేరీజు వేసుకునే వాణ్ణి.

ఆ రోజు నరహరి నాకు మధ్యాహ్నం కారణం పునస్కరించుకుని నిద్రపోతున్న లేపాడు.

"ఏం నరహరీ వుత్తరాలేమైనా వచ్చాయ కళ్ళు నులుముకుంటూనే అడిగేను.

"మనియార్డరు వచ్చింది సార్."

కలయో వైష్ణవమాయయో కాదు కొంత ఆశ్చర్యపడ్డాననే చెప్పాలి. జీతపు మనియ వచ్చింది రెండు రోజుల క్రితమే. మనియ ఎవరు పంపారబ్బా ?

"ఎంత ?" అదే ఆలోచిస్తూ అడి

"నలభై"

ముందు డబ్బు తీసుకుని తర్వాత ఎవరు ప చూసుకో వచ్చునని పేనా తీసుకున్నాను స పెట్టడానికి.

"సార్ ! సార్ ! పేనా తీయకండి !"

"ఏం ?" అన్నాను.

"ఈ శుభవార్తను భంగం చేస్తున్నానే.

"చెప్పు బాబూ చంపక !" అన్నాను సిరి రా లొద్దడం సమంజసంగా లేదనుకుని.

"మనియార్డరు ఫారం వచ్చింది. డబ్బు రా

"ఇదేం నరహరి, ఫారం రావడమేమిటి ? రాకపోవడమేమిటి? ఇది మీ బ్రాంచి పోస్టుమా నువ్వు చేస్తున్న తతంగమా ?"

"సార్! లేదు. సబ్ పోస్టాఫీసు నుండి రాలేదు. రేపు రావచ్చు."

రిజిష్టరుత్తరం యివ్వాలని వెళ్ళిపోయాడు.

ఎంత ఆశగా మరురోజు మధ్యాహ్నం నర రాకకోసం కళ్ళల్లో వత్తులు వేసుకుకుని ఎ చూసినా నరహరి రాలేదు. ఈ రోజు కూడా రాలేదా ? ఆ మాట అనుకోలేను. ఒకరోజు ఆల కావచ్చు ఈ రోజు కూడా రాలేదంటే నాకు నమ్మ కుదరలేదు. ఫోర్జరీ చేసి సంతకంతో పంపేరేమో సంశయించడానికి ఆస్కారం లేదు. డబ్బు వుండదేమో. ఒకటి రెండు రోజులు చూడ్డ తక్షణ కర్తవ్యమనుకున్నాను.

సాయంత్రమయింది. బడి వదిలి నేను వాహ్యా వెళ్ళాను. పడమటి కొండల్లో సూర్యుడప్పుడే అ మిన్నూ పర్వతాళికి వీడ్కోలిస్తూ ఆఖరు కిరణాల శిఖరాగ్రాల పైకి ప్రసరింపజేస్తున్నాడు తన అర కిరణ జాలంతో. ప్రకృతి ఆహ్లాదకరంగా వుం సాయంకాలపు పిల్లవాయువులు చల్లగా వీస్తున్నాం ధాత్రీలలామపైకి. ఎండసోకి వాడిన పైర్లు లానికి సేదదేరి ముచ్చటగా వూగుతున్నాయి. పిల్లల అరుపులతో హోరెత్తిన నాకు మధురమై వాతావరణం మత్తెక్కించసాగింది. బండపై కూర్చున్నాను.

చీకటి పడింది పూర్తిగా. నేను లేచి ఇంటికివ అన్నం తిని పడుకుని,వచ్చిన గ్రామస్థులతో ఆషామాషీ కబుర్లతో వుంటున్నాను. వీధిలో లాంతరు క పించింది.

"సార్ ! సార్ !"

అది నరహరి గొంతే ! రాత్రి పదిగంటలకు నరహ వచ్చాడంటే నాకు ఆశ్చర్యమేసింది. లాంతరు చేతో వున్నది. తోడుగా మరింకో వ్యక్తి వున్నాడు.

'మవ్వా నరహరి' లేచి కూర్చుని "ఇంత

34 వ పేజీ చూడండి



# కుందేలూ-ఏనుగా

...లారోజుల మునుపు వక్కైమా అనే కుందేలు వుండేది. ఈ ...క్కైమా పట్టి బద్ధకపు కుందేలు! ...ంజవు వక్కైమా స్నేహితుడు. ...ంజవు చాలా కష్టపడి పనిచేసే ...ుగ. ఇద్దరూ కలసి ఒక పొలం ...సేవారు.

ఇలా ఉండగా వాంజవుకి ఒక ...జన అనిపించింది: "నేనే పనంతా ...య్యడమూ, వక్కైమా దర్జాగా ...చోడమూనా?" అని అనిపించ ...నే వక్కైమాని పిలిచి, "ఎవరిపొలం, ...ట వారే సాగుబడి చేసుకుంటే ...చిది" అంది. "పండింది మాత్రం ...రం తిందాం."

"అలాగే" అంది వక్కైమా. ఎవరి ...మిని వారు తీసుకుని విత్తనాలు నాటుకున్నారు. వాంజవు కష్టపడి చేసింది కాని వక్కైమా సరదాగా అడవిలో పళ్లూ, దుంపలూ తింటూ కాలం గడిపేసింది. రోజంతా నిద్ర పోయి, సాయంత్రం మాత్రం అలిసి పోయినట్లు నటిస్తూ ఇంటికి వచ్చేది.

వాంజవు దుంపలు, జొన్న పండించింది. పొద్దు గుంకేసరికి బాగా అలిసినప్పటికీ ఓపికతో వంట వండి వడ్డించేది. కుందేలు హాయిగా చలిమంటముందు విశ్రాంతి తీసు కునేది.

కోతలు కోసేకాలం సమీ పించింది. ఒక రోజు సాయం కాలం వాంజవు ఒక బుట్టనిండా బంగాళదుంపలు, మొక్కజొన్న నింపి తీసుకువచ్చింది. వాటన్నిటినీ చక్కగా వండి వక్కైమాకి పెట్టింది. వక్కైమా పదార్థాలనీ, వంటనీ చాలా మెచ్చుకుంది. "ఇంత మంచి భోజనం చెయ్య్యలేదంది.

మర్నాడు వక్కైమా ఒక బుట్ట నిండా దుంపలు, జొన్న నింపి తీసుకు వచ్చింది. "నీ తోటలోని పొలంలో వాటంత మంచివి కావులే! అయినా తినిచూద్దాం" అంది.

వాంజవుకి అవి తన తోట, పొలంలో వేసినవే అనే అనుమానం కలిగింది. కాని మాట్లాడకుండా ఊరు కుంది. అంతేకాక వంటకూడా చేసింది.

పొద్దున్నే వెళ్లి తోట, పొలం తనిఖీ చెయ్యగా వాంజవుకి తన వాటాలో దొంగలు పడ్డారని తెలి

# బాలసాహితి: దేశదేశాల జానపద కథలు ప్రారంభం

సింది. సాయంత్రం వకైమాతో చెప్పింది.

"అరే! నా వాటాలోనూ ఎవరో దొంగలు పడ్డారు తెలుసా!" అంది కుందేలు ఆశ్చర్యం నటిస్తూ. "ఏం చేద్దాం?"

"ఆలోచిస్తే అదే తోస్తుంది, చూద్దాం" అంది ఏనుగ.

ఆ పైరోజు వాంజవు నది దగ్గరికి వెళ్లి కావలసినంత బంకమట్టిని తెచ్చింది. దానితో ఒక మనిషి బొమ్మ చేసి తోటలో పొలం వైపు పెట్టింది. ఇదంతా పూర్తి అయ్యేప్పటికి చీకటి పడింది. ఆ నాడూ వాంజవు వంట చేసింది. ఇద్దరూ పడుకున్నారు.

కొంత సేపు తర్వాత చంద్రుడు ఉదయించాడు. కుందేలు నెమ్మదిగా లేచి చడీచప్పుడూ లేకుండా ఏనుగ వాటాలోకి వెళ్లింది. బంకమట్టి బొమ్మ కనిపించేసరికి హడలిపోయింది.

అయితేనేం, ధైర్యం తెచ్చుకుని, "వాంజవు నువ్వేనా? ఈ రాత్రివేళ ఇక్కడేం చేస్తున్నావు?" అని అడిగింది.

మట్టిబొమ్మ సమాధానం ఇవ్వక పోవడంతో వకైమాకి కోపం వచ్చింది. "నువ్వు వాంజవువి కాదు! ఎవరో దొంగవి! నిజం చెప్పేయ్, లేదా వాంజవుతో చెప్పేస్తాను." బంకమట్టి విగ్రహం మౌనంగా ఉండిపోయింది.

వకైమా దగ్గరగా వెళ్లి, "ఎవరు నువ్వు? ఏమిటి సంగతి." అని అడిగింది మళ్లీ మౌనం.

"ఇదుగో ఈ మాటు చెప్పక పోయావంటే కొట్టేస్తా జాగ్రత్త!" అంది కుందేలు కోపంగా.

అనటమేమిటి ఒక్క దెబ్బ వేసింది! అంతే చెయ్యి బంకలో ఇరుక్కుపోయింది! కోపంతో ఒక గుద్దు గుద్దింది. ఆ చెయ్యీ అలాగే ఇరుక్కుంది.

"వదుల్తావా, తన్ననా?" అని కేకలు వేసింది! కోపం పట్టలేక తన్ని, ఒకటి తర్వాత ఒకటి రెండు కాళ్లూ బంకలో ఇరికించుకుంది.

"అయితే నిన్ను కొరుకుతా చూడు.." అని వైరికోపంతో తలతో ఢీకొంది; కొరికింది. ఏముంది, పళ్లుకూడా మట్టిలో దిగబడి పోయాయి! వకైమా ఇప్పుడు పూర్తిగా చిక్కుకుంది! ఎటూ కదల లేని స్థితిలో ఉంది!

రాత్రి ముగిసి తెల్లవారింది! పిట్టల పాటలు విని నిద్రలేచిన వాంజవు తోటలోకి వచ్చి వకైమాని చూసేసింది.

"ఓరీ దుర్మార్గుడా! ఈ దొంగతనమంతా నీదే నన్నమాట జాగ్రత్త, నిన్ను శిక్షిస్తా నిప్పుడు! అని ఘీంకరించింది! తొండంతో కుందేలుని బంకలోనుంచి లాగేసింది.

"నన్నేం చేస్తా విప్పుడు?" అ అడిగింది కుందేలు చనువుగా.

వాంజవు ఆలోచించి, "నా దుంపలు, జొన్న తిన్నావు కాబట్టి నిన్నే తినేస్తా!" అంది.

"నేను బ్రతికుండగా ఎలా తింటావోయి? ముందు చావనీ!" అంది కుందేలు.

"అయితే ఏం చెయ్యమంటావు?" అని ప్రశ్నించింది వాంజవు. ఏనుగకి స్నేహితుడిని తినటం ఇష్టం లేదు.

"ఏముందీ పైకి ఒకసారి విసురు! కిందపడి చచ్చిపోతాను..." అంది వకైమా. "తర్వాత భోంచెయ్యి..."

వాంజవు వకైమాని చెట్లకొమ్మల మీదకి విసిరింది కాని వకైమా కింద పడి చావలేదు సరిగదా! అడవిలోకి పరిగెత్తుకుంటూ వెళ్లిపోయింది! ఇక లాభం లేదనుకున్న వాంజవు ఇంటికి తిరిగి వెళ్లిపోయింది.

ఆ రోజునుంచి నేటివరకూ వాళ్లిద్దరూ ఒకరితో ఒకరు మాట్లాడుకోనే లేదు! ★

---

కమ్మగా వుండే కథలూ, గమ్మత్తుగావుండే కథలూ బాల బాలికలకు యిష్టం! ఒక్కొక్క దేశం, ఒక్కొక్క భాషా, వున్నా; పిల్లల యిష్టం - కథల అవసరం - ఇవి మాత్రం సామాన్యంగా అన్నిచోట్లా ఒకే విధంగా వుంటాయి! సుమారు ముప్పయి దేశాలకు చెందిన పసందైన జానపద కథలను క్రమంగా యీ శీర్షిక క్రింద వేద్దామనుకున్నాము.

'కుందేలూ - ఏనుగా' బ్రిటిష్ తూర్పు ఆఫ్రికా జానపద కథ.

# నరహరి నిజాయితీ

31 వ పేజీ తరువాయి

రాత్రిలో ఏం ఇలా వచ్చావు" అని అడిగాడు.

చేతిలో పుస్తకం వుంది. జేబులోని మనియార్డరు ఫారం, దానిని చుట్టిన నాలుగు పదిరూపాయల నోట్లు క్రింద ఎంచిపెట్టి, ఫారంలో సంతకం చెయ్యమని పేనాకూడా ఇచ్చాడు.

" ఇంత రాత్రిలో "

" డబ్బు ఈరోజే వచ్చింది. ఇక్కడికి రావడానికి బయలుదేరుతున్నాను. మా పోష్టలు ఇన్స్పెక్టరు వచ్చారు. అక్కడ ఆయనకు అవి ఇవి అందించే లోగానే బస్సుకు టైం కావడంతో అందివ్వడానికి వెళ్ళాను. మనియార్డర్లు నాలుగు వచ్చాయి. అన్నిటికి డబ్బు వచ్చాయి. కట్ట అందించిన తర్వాత పెయిడ్ చేసి, ఇంటికి వెళ్లి అన్నం తిని, మీ మనియార్డరు ఇచ్చివెడదామని వస్తున్నాను."

" రేపు పగలే తెచ్చివ్వరాదా ? " అన్నాను.

" ఈ రోజు బాకీ కద. ఈ రోజే తీర్చేయాలి " అని అన్నాడు.

డబ్బు పుచ్చుకున్నాను.

అరగంట వరకు ఏవేవో మాట్లాడాడు నరహరి. అన్నం పెట్టించాను. తిన్న తరువాత ఇద్దరు వెళ్లిపోయారు. అటుపిమ్మట నరహరి బుజు ప్రవర్తనను శంకించ లేదు. నరహరిని నమ్మాను పూర్తిగా. ఇంత చక్కగా డ్యూటీ చేసే నరహరి అంటే సదభిప్రాయం ఏర్పడ్డది నాకు. అందరితోనూ అదే చెప్పాను. తక్కిన గ్రామాల టీచర్లు కొందరు నమ్మలేక పోయారు.

తర్వాత మా గ్రామానికొస్తే నా దగ్గిరకు వచ్చి ఖచ్చితంగా మాట్లాడి వెళ్లాల్సిందని 'హుకుం' జారీ చేశాను. నరహరి నావద్దకు వచ్చి మాట్లాడేకగాని వెళ్ళడు. ఆత్మీయత అంత దృఢంగా పెనవేసుకుంది నాకు అతనికి.

రోజులు దొర్లిపోతున్నాయి. మామూలుగా నా సహచర్యంలో అతని కబ్బిన సుగుణ మేమంటే పఠనాశక్తి. నా వద్ద ఉన్న పుస్తకాల్లో సరళ భాష కల్గిన తెలుగు పుస్తకాలు ఇచ్చే వాణ్ణి. ఇంగ్లీషు వీలయినపుడల్లా, వాక్య నిర్మాణం వరకు నేర్పించాను. స్వంతంగా వాక్యాలు రాయగలడన్నంతనేర్పించాను

ఒక రోజు బడి వదలి చిత్తూరుకు సైకిల్లో వెడుతున్నాను ఏదో పని మీద. మా ప్రక్క గ్రామం టీచరు వెంకట్రమణ నాతో కలిశాడు.

"నాకో మనియార్డరు వచ్చిందండీ ఈ పూటే. తొమ్మిది రూపాయలు. సప్లిమెంటరీ బిల్లులెండి. 7 రూపాయలిచ్చి రెండు రూపాయలు మళ్లా ఇస్తాను అని నరహరి అన్నాడు. మనియార్డరు రేపే ఇద్దువు సంతకం పెట్టమన్నాను. లేదు పెట్టమన్నాడు. మీరూ నరహరిని గురించి చెప్పారు కాబట్టి సంతకం పెట్టాను. 7 రూపాయ లిచ్చి. 'తొమ్మిది రూపాయలు ఒకే పర్యాయం మళ్లా ఇవ్వమని' వాపసు చేశాను. ఏమనుకున్నాడో ఏమో డబ్బు తీసికొని వెళ్లిపోయాడు. ఇంటికి వెళ్లి ఎవరో మా గ్రామాని కొస్తుంటే 9 రూపాయలిచ్చి పంపాడు. నేను తర్వాత నొచ్చుకున్నాను నరహరి ఆర్థిక ఇబ్బందుల్లో ఉన్నాడని, అతని వాలకమే చెబుతున్నది. లోతుకు వెళ్ళిన కళ్ళూ దుమ్ము కొట్టుకున్న షర్టు అదోరకంగా కనిపించాడు."

వెంకటరమణ చెప్పుకు పోసాగాడు.

నరహరిని నేను చూసి మూడు నాలుగు రోజులయింది. ఈ నాలుగు రోజులు తీరిక లేదు. ఇన్స్పెక్షన్ కార్డు వచ్చింది. ఏకోపాధ్యాయుణ్ణి కావడంతో పిల్లలకు పాఠం చెప్పడం మొదలుకుని, ఆఫీసుకు పంపవలసిన వ్రాతల వరకు నేనే చూసుకోవాలి. నమ్మలేము కాని వో చక్కని ఉదంతం. ఒక రోజు మధ్యాహ్నం పిల్లలు బడికి దగ్గర్లో లేరు. రెండు గంట లయిపోయింది. గంట కొట్టవలసి ఉంది. చూసి నేనే సుత్తి తీసుకుని గంట కొట్టాను. అన్నిటికి సిద్ధ మయి ఉండవలసి ఉంది ! ! ఇక ఇన్స్పెక్షన్ అంటే చెప్పాలా ? రికార్డులు, టీచింగ్ నోట్సులు, చార్టులు, స్టేట్‌మెంట్సు చూసుకుంటూ పిల్లలను ఇన్స్పెక్షనుకు తయారు చేయించాల్సి వచ్చింది. ఇన్ని తొందర్లో నరహరిని మరచిపోయాను. అతను బడివద్దకు రాలేదు. ఇన్స్పెక్షన్ సంతృప్తికరంగా జరిగింది. పిల్లలు చురుగ్గా చెప్పిన జవాబులు మా డెప్యూటీ ఇన్స్పెక్టర్ని తృప్తి పరచినవి.

ఆ తర్వాత రెండు రోజులకు కాని నరహరి కన్పించలేదు.

ఆ రోజున నరహరి వచ్చాడు. ఆకారం పూర్తిగా మారిపోయి ఉంది. అదోలా ఉన్నాడు. చిక్కిపోయాడు.

"రెండు మూడు రోజులు ఎక్కడ నరహరి" అంటూ మొదలెట్టి వెంకట్రమణ చెప్పిందంతా చెప్పాను.

"చూడండి. సార్ మనియార్డరు వచ్చిన సమయంలో నా కూతురు చిన్నపిల్ల లేదూ కుసుమ ఆమెకు 'అమ్మవారు' పోసింది. ఈ చిక్కుల్లో డబ్బు లేక అవస్థపడ్తున్నాను. ఎక్కడడిగినా లేదనే మాట. వెంకట్రమణ టీచరుకు మనియార్డరు వచ్చింది. అందులో రెండు రూపాయలు ఆయనతో చెప్పి తీసుకుని వచ్చాను. మళ్ళా సర్ద గలనని. ఆయనకు రూపాయలిచ్చాను. ఆయన తీసుకోలేదు. ఇది వీలుపడదని ఇంటికొచ్చి మళ్ళా అప్పుడే నా మనస్సంగీకరించక పోవడంతో నేను ఎన్ని కష్టాలు పడినా సరే ఆయన డబ్బు పంపించాను" అని చెప్పాడు.

"కుసుమ కెలా ఉంది ?"

"ఎక్కడ కుసుమసార్. ఆ డబ్బు ఆ మధ్యాహ్నమే ఇచ్చి కట్ట బస్సుకందిచ్చి వచ్చేలోగా .."

నేను స్తంభించి పోయి ఆతురతతో—

"కుసుమకు ఏమయింది నరహరి" అని అడిగాను—

"కుసుమ చచ్చి పోయింది"

నరహరి కళ్లల్లో నుండి జలజలా నీరు కారుతున్నాయి. మాటాడ లేక తల క్రిందికి దించుకున్నాడు..

"వస్తాను సార్, ఉత్తరాలు దండిగా ఉన్నాయి"

నరహరి జోరుగా వెళ్లిపోయాడు తపాల సంచి తీసుకుని.



## పొదుపులోనే భద్రత వుంది
## మీదీ, మీ దేశానిదీ కూడా!




## 33

అనంతరము అవధనందనుడు నన్ను పట్టుకొనుటకై తన చిట్టిచేతులను ముందుకు చాచెను. నేను కొంత దవ్వు పైకెగిరి వెనుదిరిగి చూచితిని, బాలరాముని చేయి నాకు చేరువలో కనబడెను. నేను మరింత పైకి శూన్యములోనికెగిరి తిరిగి చూచితిని. చిత్రము! రాముని చేయి నాకు రెండంగుళముల సమీపములోనుండెను. ఆ పైన నేను క్రమముగా పైకెగురుచూ రోదసి, బ్రహ్మలోకము, సప్తావరణము దాటిపోయి వెనుదిరిగి చూచితినిగదా! అప్పటికినీ రామునిచేయి నాకు రెండంగుళముల దూరములో నుండెను. ఆయద్భుత సంఘటనకు నేను విస్మితుడనై భయముతో నా రెండు కళ్ళు మూసుకొంటిని. ఖగేశ్వరా! కన్నులు తెరచి చూచునప్పటికి నేను పునః యథాప్రకారము అయోధ్యలో నుంటిని. అప్పుడు రఘుకిశోరుడు నన్నుజూచి చిన్న చిన్నగ నవ్వెను. ఆ నవ్వుకు నేనతని నోటిలో దూరి గర్భములోనికి వెళ్లిపోతిని.

గరుత్మంతా! అక్కడ రాముని హృదయ కుహరములో జూచిన దృశ్యము అతి విచిత్రగా నుండెను. అనేక బ్రహ్మాండములు. చిత్రవిచిత్ర లోకములు, కోట్లకొలది బ్రహ్మలు, మహేశ్వరులు, నక్షత్ర మండలములు, సూర్యులు, చంద్రులు, లోకపాలురు, నదీనదములు, సాగరములు, పర్వతములు, నానాలోకవాసులు చరాచర ప్రపంచమంతయు దృగ్గోచరమయ్యెను. పూర్వమెన్నడు చూడని వినని వూహించనేరని అనేక చిత్రములను గాంచితిని. నేనా విధముగా ఒకొక బ్రహ్మాండములో శతవత్సరముల చొప్పున అనేక బ్రహ్మాండలోకములలో నివసించుచూ తిరుగుచుంటిని.

ఒకొక లోకమునకు ఒకొక బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు దిక్పాలురు ఉండిరి. అవ్విధముగా నానాలోకములందు నానావిధములతో దేవతలు, దనుజులు, మనుజులు, కిన్నరులు, గంధర్వులు, జంతువులు, పక్షులు, నదీపర్వత సాగరములు మొదలగునవి ఉండెను. ఒక బ్రహ్మాండమునకు మరియొక బ్రహ్మాండమునకు పోలికయేలేదు. భిన్నభిన్నమైన అయోధ్యానగరములను, సరయూనదులను, కౌసల్యలను, భరతలక్ష్మణ శత్రుఘ్నులను చూచితిని. కానీ, రాముడు మాత్రము అన్ని బ్రహ్మాండములందు ఒకే రాముడుగా గోచరమయ్యెను. అందుకు భిన్నమైన వేరొండు రూపులో రాముడు కనబడలేదు. ఎక్కడ జూచినను ఒకే రాముడు కంటపడెను. ఇవ్విధముగా నూరు కల్పముల పర్యంతము నేనాలోకములందు సంచరించితిని. ఈ విచిత్ర లోక దర్శనచే నాకు మతి చలించెను. నామనస్సు పరిపరి విధముల పరుగెత్తసాగెను. యోచనాగ్రస్తుడనై చిత్తశాంతి పోగొట్టుకొంటిని. వ్యసన వ్యాకులితుడై యుంటిని. నామనో బాధను గుర్తించినవాడై రఘునందనుడు మెల్లిగ మందహాసముచేసెను. ఆ నవ్వుతో నేను రాముని గర్భమునుండి తిరిగి వెలుపలికివచ్చి పడితిని.

ద్విజోత్తమా! ఇది అంతయు రెండు ఘడియలలో జరిగిపోయెను. దశరథనందనుడు మాత్రము యథాపూర్వము క్రీడించుచూ బాల వినోదము ప్రదర్శించుచుండెను. రాముని ఉదర గోళములో దర్శించిన విశ్వకటాహములు నాకు కన్నులకు కట్టినట్లుండెను. నేనంతట ఆశ్చర్య భ్రమకులోనై స్వాస్థ్యము గోలుపోయి "ఓ ఆర్తజనత్రాతా! త్రాహి త్రాహి!" అని అరచి సొమ్మసిల్లి నేలబడితిని.

అప్పుడా దేవదేవునికి నాదీన స్థితిపై జాలి కలిగెను. అతడు నాపై ప్రయోగించియుండిన మాయను ఉపసంహరించుకుని ప్రేమతో తన అభయహస్తము నా మస్తకముపై నుంచెను. సర్వతో నాచిత్తమునకు శాంతికలిగి ప్రసన్నత ప్రాప్తించెను. లోచనములు భాష్పపూరితమయ్యెను. హృదయము పులకరించెను. తన్మయుడనై స్వామిననేక ప్రకారములు స్తుతించసాగితిని. రమారమణుడంత ప్రగాఢ ప్రేమతో నన్నవలోకించి మృదుమధురోక్తుల—

భుశుండీ! నీపై నాకు సంపూర్ణ కటాక్షము కలిగెను. నీకేమి ఎంను కావలెనో కోరుకొనుము. అణిమాద్యష్టసిద్ధులు, నిధులు, సుఖదాయకమైన మోక్షము, జ్ఞానము, విజ్ఞానము, వివేకము, మునిదుర్లభముగు మోక్షము—వీనిలో నీకేది అభిలషణీయమో సంశయించక కోరుకొనుము." అని ప్రవచించెను.

### భక్తియొక్క ప్రాముఖ్యత

అవధేశుని అపార వాత్సల్య ప్రేమకు నేనానందవిభోరుడనై కేలుగీలించి నమ్రవచనములిట్లు నివేదించుకొంటిని.—

"ఓ భక్తకల్పద్రుమా! మీరు నాపై కరుణించి సుఖదాయకములగు సకలవిధ సంపద్వైభవములు ప్రసాదించెదనని వచించితిరి. కానీ మీభక్తి మాత్రము ప్రసాదించెదనని ప్రసంగించకపోవడము వింతగా యున్నది. ఉప్పులేని కూరలవలె భక్తిరహితమైన యీ మోక్షసుఖములవలన ప్రయోజనమేమున్నది? దేవా! సర్వజ్ఞులు సర్వాంతర్యాములగు మీకు విదితముగానిదేమున్నది! ప్రభూ! ఎద్దానికైనా యోగులు మునులు అనవరతము ఆరాటపడుచుందురో, దేనిని వేదములుసైతం నిరంతరము ప్రశంసించుచుండునో, అట్టి సర్వోత్కృష్టమైన భక్తినిమాత్రము ప్రసాదించమని ప్రార్థించుకొనుచున్నాను. తదన్యమైన సుఖసంపదలుతో నాకు పనిలేదు"

కౌసల్యా తనయుడంతట అట్లేన నవ్వి—నీ యభీష్ట మీడేరుగాక — యని దీవించి, పిమ్మట సుఖవచనంబుల నన్నిట్లు ప్రబోధించెను. "వాయసోత్తమా! సకలసుఖప్రదమగు అపూర్వ వరమును అభిలషించితివి. జపతపయోగాదులచే తమ శరీరములను దహింపజేసుకునినను మునిజనులు దేనిని పొందజాలకుందురో అట్టి భక్తిని ప్రసాదించమని కోరిన నీబుద్ధి కుశలత ప్రశంసనీయమైనది. కాక భుశుండీ! నేటినుండి భక్తిజ్ఞాన వైరాగ్య విధానములకు సంబంధించిన సర్వ రహస్యములు నీకు అవగతమగును. నాయనుగ్రహ ప్రాప్తికై నీకిక యెటువంటి సాధన చేయ నవసరములేదు. మాయా మోహములు నిన్నికమీదట స్పర్శించ జాలవు. నేటినుండి నీవు నన్ను ఆదిమధ్య అంతములులేని పరబ్రహ్మముగా భావింతువుగాక.

ప్రాజ్ఞుడా! నాత్యంత ప్రియదాయకమైన భక్తివరమును నీకు ప్రసాదించితిని. ఇటమొదలు నీవు సర్వధర్మములు పరిత్యజించి నన్నే భక్తితో భజించుచుండుము. ఈ సృష్టిలో నేను సర్వాధికముగ నా భక్తులను ప్రేమించుచుండెదనని విశ్వసింపుము. భక్తిరహితుడైన ఆ పరమేష్టికంటె భక్తిరతుడైన పంచముడు నాకు ప్రాణ సమానుడు. భుశుండీ! నీవు త్రికరణశుద్ధిగా నా స్వరూపమును ఆరాధించుచుండుము. నీవు దీర్ఘాయుష్మంతుండవై చిరకాలముందువుగాక.

విష్ణువాహనా! భగవంతుడు ప్రగాఢ ప్రేమానురాగముతో నన్నాశీర్వదించి అనుగ్రహించెను. ఆ మోహనమూర్తి మంగళరూపమును, ఆ జగన్నాథుని వాక్సుధారస మాధుర్యమును ఇప్పటికీ నేను మరువలేకున్నాను. అనంతరము నేను బహుకాలము సాకేతపురిలో స్వామిసాన్నిధ్యమందుండి పిమ్మట నిజాశ్రమమునకు మరలి వచ్చితిని.

ఖగేంద్రా! నాటినుండి నేను మాయామోహములకు అతీతుడనుగానుంటిని. భగవత్కృప వినా అతని ప్రభావము తెలుసుకొనుట దుర్లభము. అతని ప్రభావము అవగతముకాకున్నయెడల స్వామిపై విశ్వాసము జనించదు. విశ్వాసము కలిగినప్పుడే ప్రేమయేర్పడును. భక్తికి ప్రేమ ఆధారము. ఒక్క భక్తివలననే శ్రీరాముని హృదయము శీఘ్రముగా ద్రవించును. గరుడజీ! కాబట్టి నీవు నిరాధారమైన శంకలకు, వితండవాదములకు స్వస్తిచెప్పి సుఖప్రదాతయగు ఆ సీతాపతిని సేవించి ధన్యుడవగుము.

ఆ శ్రీపతి నామరూపగుణ మహిమలు వర్ణింప శేషునకు — సరస్వతికి — శివునకు సైతం సాధ్యముకాదు. గరుడా! నీవు గగనపథములో విహరించుచుందువుగదా! ఆకాశమెంత అనంతమైనదో చెప్పగలవా! అటులనే శ్రీరాముని మహిమాప్రభావములు వూహించుట కసాధ్యములు. ఆ కోసలేశుడు కోటి మన్మథులకు సమానమైన రూపసౌందర్యములు కలవాడు, కోటి దుర్గలతో సమానముగా శత్రువులను నాశనముచేయుగల శక్తిసంపన్నుడు. నూరుకోట్ల ఆకాశములంత విశాలవ్యాపకుడు, నూరుకోట్ల సూర్యకాంతికి తుల్యమగు తేజఃపుంజముగలవాడు. నూరుకోట్ల చంద్రుల బోలు బహుచల్లని ప్రభువు, నూరుకోట్ల యములవలె దుస్తరుడు— దుర్గముడు దురంతుడు. నూరుకోట్ల ధూమకేతువులబోలిన దురాధర్షుడు, అతని హృదయము నూరుకోట్ల పాతాళములంతటి అగాధమైనది. నూరుకోట్ల పుణ్యక్షేత్రములను బోలిన పరమ పవిత్రుడు, కోటి హిమవన్నగ సమాన ధీరుడు— నిశ్చలుడు, నూరుకోట్ల కామధేనువులవలె కోరికలీడేర్చువాడు. నూరుకోట్ల సరస్వతులను సమమైన వాక్చాతుర్యము గలవాడు, నూరుకోట్ల బ్రహ్మవలె సృష్టించ గలడు. నూరుకోట్ల విష్ణువులవలె పాలించగలడు. నూరుకోట్ల రుద్రులవలె సంహరించగల సమర్థుడు. అతడు అవధిలేనివాడు, నిరుపమానుడు, జగదీశుడు. ఆ దయాధాముని మునీశ్వరులు తమ బుద్ధికితోచినంత వర్ణించిరి. నేను మహాత్ములయొద్ద వినగలిగినంతవరకు నీకు వర్ణించగలిగితిని. గరుత్మంతా! కరుణాసముద్రుడగు ఆ కాకుత్స్థకులదీపకుని నిరహంకార బుద్ధితో సేవించి ధన్యజీవుడవగుము.'' అని కాకభుశుండి పక్షీంద్రునికి బోధించెను.

వినతాసుతుడు శ్రీరాముని తత్త్వరహస్యము సంపూర్ణముగా ఆలకించి అపార ఆనందానుభూతి నొందెను. రామకథాశ్రవణమువలన కలిగిన ఆనందాధిక్యతచే అతని కన్నులు చెమ్మగిల్లెను. రుద్ధకంఠుడై భుశుండిని పలువిధముల ప్రస్తుతించి, పిమ్మట ఇట్లు పలికెను.

''ఓ పూజ్యుడా! సంశయ వ్యాకులితమై యుండిన నాబుద్ధికిపుడు సాంత్వన లభించి సంతోషము సంప్రాప్తించెను. మీ కృపవలన రఘుప్రవరుని అవతార రహస్యములు నాకవగతమయ్యెను ధర్మజ్ఞా! గురు సహాయ్యములేనిదే బ్రహ్మమహేశాదులంతటివారైనను భవ సాగర తరణోపాయమునుగాన లేరనుట విదితమేకదా! ఆ రఘునాథ్యహుడే నీ రూపమున నాకు గురుబోధచేసి నా సంశయములు నివారించెను.

మహాత్మా! ఇంకొక విషయము మీ వలన తెలుసుకొనవలెనని నామనస్సు వాంఛించుచున్నది. మీరు సర్వజ్ఞులు, ధర్మాభిరతులు, సీతాపతి పదసేవారతులై యుండియు ఈ కాకి శరీరము ధరించుటకు కారణ మేమి? మీకీ పవిత్ర రామచరితమానసమెట్లు సంప్రాప్తమయ్యెను! ప్రళయాంతమునకూడా మీకు నాశములేదని పరమశివుడు పలికియుండెను. అదెట్లు సంభవమగును. అజ్ఞానవశమున శంకాతురుడనై అడుగుచుంటిని, ఈ దాసుని దోసము పైరించి యథాపూర్వము దయామతివై సమాధానమీయ అర్థించుచున్నాను.'' అని పక్షీంద్రుడు ప్రార్థించెను.

అందులకు భుశుండి పరమ ప్రసన్న వైఖరి ప్రదర్శించి ప్రియోక్తుల ఇట్లు ప్రసగించెను.

''ద్విజరాజా! సందర్భోచితమైన ప్రశ్న వేసినందుకు నిన్ను అభినందించుచున్నాను. ప్రశ్న గత విషయము నా పూర్వజన్మకు సంబంధించియున్నది. దానిని నీకు సవిస్తరముగా తెలియజేయుచున్నాను. యథామతి ఆకర్ణింతువుగాక—

## భుశుండి పూర్వగాథ

''ఓ పన్నగారీ! ఈ కాకి శరీరము ద్వారా రామభక్తి సాధింపబడెను. అందుచేత ఈ తనువుపై నాకు మక్కువ. ఏ వస్తువు మన హితమునకు సాధకమవుచున్నదో అదియెంత హీనమైనదయినప్పటికీ దానిని మనము ప్రేమించుట సహజము. పట్టుపురుగు క్షుద్రప్రాణి, అయిననూ పట్టునిచ్చుచున్నందున దానిని ప్రేమతో పోషింతుము. నేనీ కాకి శరీరము ధరించినపుడే నాలో రామభక్తి ప్రభవించెను. భక్తి సాధకమగు శరీరమే సుందరము శుభప్రదమైనది. కాబట్టి నేను ఈ కాకి దేహము విసర్జింపలేకున్నాను.

గరుడా! పూర్వము నేను అనేక జన్మలు ధరించితిని. అనేక యోనులందు ఉద్భవించితిని, అనేక జపతప యోగదానములాది సత్కర్మలొనర్చితిని. కానీ ఇప్పటి సుఖము— సార్థకత యేజన్మలోనూ నాకు లభించియుండలేదు అని నిశ్చయముగా చెప్పగలను.''

## కలియుగ ప్రభావము

''ఓ విహంగేశా! నాపూర్వజన్మకు సంబంధించిన ఒక సంఘటన పేర్కొనదలచితిని శ్రద్ధాళువై ఆకర్ణించుము—

పూర్వము ఒకానొక కల్పమందు కలియుగమేర్పడెను. ఆకాలమున ప్రజలు అధర్మ మార్గమున నీతి బాహ్యులై ప్రవర్తించిరి. అప్పుడు నేను అయోధ్యా నగరిలో శూద్రకులమున బుట్టియుంటిని. శూద్రవంశజుడగు నేను నిరంతరము శివుని భక్తితో సేవించుచూ ఇతర దేవతలను ఇష్టము వచ్చినట్లు దూషించుచుంటిని. రామనగరులో పుట్టిన ప్రతిజీవికి యేనాటికైనా రామభక్తి సిద్ధించును — అను సత్యము నాకప్పుడు బోధపడక గర్వితమతినై ప్రవర్తించితిని. కలియుగ ప్రభావము నేనట్లు మూర్ఖించుటకు కారణమయ్యెను. మిత్రమా! ఆ కలియుగమెంత దుష్టమైనదో దాని స్వభావము నీ కొకింత తెలియజేసెదను వినవలసినది.''

కలి దోషములు సర్వ ధర్మములను శోషింపజేయును. సద్గ్రంథములు మూలబడును. సామాజికులు దాంభికులు కల్పించిన క్రొత్త పుంతలు త్రొక్కి చరింతురు. వర్ణాశ్రమ ధర్మము అంతరించును. బ్రాహ్మణులు వేదములను అమ్ముకుని, రాజులు ప్రజలను పీడించి బ్రతుకుచుందురు. దాంభికుడు, మిథ్యావాది, బిగ్గరగా మాట్లాడువాడు మహా పండితుడుగా పరిగణించ బడి పూజింపబడును. దురాచారులు, వేదమార్గమును త్యజించినవారు, పొడవుగా జటలుధరించి గోర్లు పెంచినవారు మాత్రం జ్ఞానులుగా, విరాగులుగా గుర్తింపబడి గౌరవింప బడుదురు. పురుషులు స్త్రీలోరులై మగువల కనుసన్నలలో చరింతురు.

శూద్రులు యజ్ఞోపవీతములు ధరించి బ్రాహ్మణులకు బోధలుచేయుచూ దానములు గ్రహింప గలరు. స్త్రీపురుషులు కామక్రోధలోభాది దుర్గుణములచే పతితులగుదురు. ముత్తైదువలు మంగళ భూషణములు విడనాడుదురు, విధవలు శృంగారవతులై చరింతురు, కలికాలమున బోధకులగు గురువులకు నోర్లుండవు. వినదగిన శిష్యకోటికి చెవులుండవు. ''—వేదము చదువువాడే విప్రుడు, ఇదిగో! మేము వేదాధ్యయనం చేయుచున్నాము, మీకంటే మేము తక్కువవారము కాము—'' అని తర్కించి శూద్రులు బ్రాహ్మణులను ఎదిరింతురు. ప్రజలు జ్ఞానశూన్యు లయిననూ బ్రహ్మజ్ఞానమును గురించి మాత్రము మహోపన్యాసములు చేయుదురు. స్త్రీలంపటులు, ధూర్తులగు వేషధారులు అహంబ్రహ్మాస్మియని పలుకుచూ అద్వైత బోధనలు చేయుటకు సమాయత్తమగుదురు. నిమ్నజాతులకు చెందినవారు తమ భార్యలు గతించినపుడు, లేక ధనము పోగొట్టుకున్నప్పుడు శిరోముండనము చేయించుకుని కాషాయాంబరములు ధరించి సన్యాసులగుచుండదురు. ద్విజులు నిరక్షకుక్షులై నీచస్త్రీ సంభోగపరాయణులై దురాచారములతో పతితులగుచుండెదరు. హీనజాతులకు చెందినవారు జపతపములు చేయుచూ ఉన్నతాసనముల నధిష్ఠించి పురాణ పఠనములాది సత్కార్యలొనరింతురు.

ఓ గరుడా! కలియుగమందు వర్ణ సంకరమధికమై సామాజికులు పాపకర్మలతో ఆధి వ్యాధులతో దుఃఖ జీవనము గడిపెదరు. సన్యాసులు దివ్య భవనములలో నివసించుచూ ధనోపార్జన చేయ ప్రయత్నించుదురు. పురుషులు భార్యలకు లోబడి తల్లిదండ్రులను నిరాదరించెదరు. సకాలవర్షములుండవు. విత్తనములు మొలకెత్తుట అరుదుగానుండును. స్త్రీ జీవనము దుఃఖభరితమైపోవును. మానవులు అల్పాయుష్కులై కలహప్రియులుగా నుండెదరు ఇట్లు కలికాలము సకల దుఃఖములకు ఆకరమై యుండును.

ద్విజరాజా! ఆ యుగమందు ఒక్క సుగుణము మాత్రము సర్వత్రా గోచరించును. భగవన్నామస్మరణ చేయు భక్తునికి అనాయాసముగా ముక్తి లభింపగలదు. కలికాలమందు యోగయజ్ఞ జపతపాదులు కష్టసాధ్యములు, కాబట్టి రామ స్మరణ మాత్రచే జనులు మోక్షాధికారులు కాగలరు.

భక్తుడా! కృతయుగమందు ధ్యానము చేతను, ద్వాపరమున భగవంతుని పాదపూజవలనను, కలియుగమందు దేవుని గుణ కీర్తన చేయుటవలనను మానవజాతికి ముక్తి లభించగలదు.

''కృతే యద్ధ్యాయతో విష్ణుం, త్రేతాయాం

# రామచరిత మానస్

యజతో మఖైః, ద్వాపరే పరిచర్యా
యాం, కలేతత్ హరికీర్తనాత్''

(భాగవతము)

అదియునుగాక యుగ స్వభావము కూడ మారు చుండును. సత్యయుగము శుద్ధ సత్యగుణ ప్రధాన మైనది. త్రేతాయుగము సత్వరజోగుణ ప్రధాన మైనదిగా నుండును. కాగా సత్యరజోగుణ తామస ముల మిశ్రమము ద్వాపరము. కానీ కలియుగము మాత్రము తామస ప్రధానమై యుండును. అయితే హరిభక్తుడు మాత్రం ఈయుగ ప్రభావ ములకు అతీతుడుగానుండును. యుగధర్మములు అతనిని చలింపజేయజాలవు.

నాగాతంకా! దుర్భరమగు అట్టి కలికాలమందు ఒకప్పుడు అయోధ్యలో ఘోర క్షామమేర్పడెను. అందుచే నేను సాకేత నగరము వదలిపెట్టి ఉజ్జ యిని చేరుకొంటిని. క్రమంగా ఆ నగరములో కొంత ధనమార్జించుకుని సదా శివారాధన చేసు కొనుచూ కాలము గడపుచుంటిని.

## శి వ శా ప ము

ఆ పట్టణములో శివభక్తుడగు బ్రాహ్మణోత్త ముడొకడుండెను. పరమతత్త్వజ్ఞుడగు ఆ భూసుర ప్రవరుడు శైవుడైనను విష్ణువును దూషించక నీతి మార్గమున ప్రవర్తించుచుండెను. నేను చిన్నగా ఆ శంభుదాసుని యొద్దచేరి అతనిని సేవించ సాగితిని. ఆ విప్రోత్తముడు నన్ను తన పుత్రునివలె భావించి నాకు అత్యంత ప్రీతితో నీతిబోధన చేసి పరమ పవిత్రమగు శివమంత్రము నుపదేశించెను. కానీ నేను మాత్రము నా పూర్వ వైఖరి వదిలిపెట్టక దంభముతో సర్వవిధముల హరిని దూషించుచూ హరిభక్తులను ద్వేషించుచూ తిరుగుచుంటిని.

ఒకదినము గురువు నన్ను సాదరముతో చేర బిలిచి —'వత్సా ! శివభక్తికి తార్కాణము శ్రీరా మునియెడ ప్రేమ జనించుటయే. పరమేష్టి— పరమేశ్వరులే నిత్యము శ్రీపతిని ధ్యానించుచుండెదరు. మరి నీవా శ్రీరాముని ద్వేషించి ఏమి సుఖము మూట గట్టుకొన దలంచితివి!—'' అని మృదువుగా మందలించి హితబోధ చేసెను.

గరుత్మంతా! గురువు ఆ విధముగా హరుని హరి సేవకునిగా వర్ణించుట జూచి అప్పుడు కోప ముతో నావళ్ళమండి పోయెను. కానీ నేను మాత్రము నా ఆంతర్యమును బహిర్గతము చేయక లోలోన గురువును ద్వేషించుచు పాలుబోసి పెంచిన విష సర్పమువలె ద్రోహ బుద్ధితో మెలంగుచుంటిని. గురువు యథాపూర్వము ప్రేమాదర భావముతో నాకు అపుడపుడు నీతిబోధ చేయుచుండెను.

ఒకదినము శివాలయమందు కూర్చొని నేను నేను హరనామము జపించుచుంటిని. ఆ సమయ మున గురువు ఆ గుడిలోనికి వచ్చెను. నేను వారి రాకను గుర్తించియు నమస్కారము చేయక గర్వముతో కూర్చొనియుంటిని. గురువు నా నా ప్రవర్తనకు ఇసుమంతయు కినుక వహించక నా యెడల వాత్సల్య ప్రేమను ప్రదర్శించెను. కానీ అప్పటి నాయీ గురు ద్రోహమును ఆ పరమశివుడు సహించలేక పోయెను. అప్పుడా మందిరమునుండి అదృశ్యవాణి నన్నిట్లు హెచ్చరించెను!

''ఓరీ స్వాభిమానీ! హత భాగ్యుడా! నీ గురువు జితక్రోధి, శిష్యవత్సలుడు, దయార్ద్ర హృదయుడు. అందుచే అమర్యాదకరమైన నీ ప్రవర్తన ఆయన సహించెను. కానీ నేను మాత్రము నిన్ను క్షమించ జాలను. అట్లయిన మున్ముందు వేద మార్గము భ్రష్టమై పోగలదు. కాబట్టి, నిన్ను శపించు చున్నాను. గురుద్రోహి పదివేల జన్మలవరకు నీచ యోనులందు జన్మించుచు దుఃఖ జీవనము గడుప వలసియుండును. నీవు గ రువును నిర్లక్ష్యము చేసి అజగరమువలె అహంకరించి కూర్చొనియుంటివి. అందుచేత నీవు సర్పమై నీచగతిని పొందుదువు గాక.''

గరుడా! ఆఘోర శాపము విన్నంతనే నేను భయార్తినై గడగడ కంపించిపోతిని. నాకు తటస్థి చిన విపత్కర స్థితికి గురువు హృదయము చెలించి పోయెను. అప్పుడమ్మహనీయుడు చేతులు ముందుకు చాచి — పూర్వాముఖుడై కడు దీన స్వరమున పరమశివుని నిట్లు ప్రార్థించెను,— ఆ భక్తా గ్రేసరుని యప్పటి ప్రార్థన రుద్రాష్టకమని లోకములో ప్రసిద్ధి నొందెను.—

1. నమామీశ మీశాన నిర్వాణ రూపం
విభుం వ్యాపకం బ్రహ్మ వేద స్వరూపం
అజం నిర్గుణం నిర్వికల్పం నిరీహం
చిదాకాశ మాకాశ వాసం భజేహం.

2. నిరాకార మోంకార మూలం తురీయం
గిరాజ్ఞాన గోతీత మీశం గిరీశం
కరాలం మహాకాల కాలం కృపాలం
గుణాగార సంసార పారం నతోహం.

3. తుషారాద్రి సంకాశ గౌరం గభీరం
మనోభూతకోటి ప్రభాశ్రీ శరీరం
స్ఫురన్ మౌళి కల్లోలినీ చారుగంగా
ల సద్భాల బాలేందు కంఠేభుజంగా.

4. చలత్కుండలం శుభ్రనేత్రం విశాలం
ప్రసన్నాననం నీలకంఠం దయాలం
మృగాధీశ చర్మాంబరం ముండమాలం
ప్రియం శంకరం సర్వనాథం భజామి.

5. ప్రచండం ప్రకృష్టం ప్రగల్భం పరేశం
అఖండం అజం భానుకోటి ప్రకాశం
త్రయఃశూల నిర్మూలనం శూలపాణిం
భజేహరి భవానీ పతిం భావ గమ్యం.

6. కలాతీత కల్యాణ కల్పాంతకారీ
సదాసజ్జనానంద దాతా పురారీ
చిదానంద సందోహ మోహా పరారీ
ప్రసీద ప్రసీద ప్రభో మన్మథారీ.

7. నయావద్ ఉమానాథ పాదారవిందం
భజంతీహ లోకేపరేవా నరాణాం
నతావత్సుఖం శాంతి సంతాపనాశం
ప్రసీద ప్రభో సర్వభూతాది వాసం.

8. నజానామి యోగం జపం నైన పూజాం
నతోహం సదాసర్వదా శంభు తుభ్యం
జరాజన్మ దుఃఖౌ తాతప్యమానం
ప్రభో పాహి ఆపన్న మామీశ శంభో.

అని ఆ బ్రాహ్మణోత్తముడు పరమ భక్తితో ప్రార్థించగా పరమ శివుడు ప్రసన్నుడయ్యెను. అనంతరము ఆమందిరాంతర్భాగమునుండీ—ఓ భూసు రోత్తమా! నీకేమి వరము కావలయునో కోరుకొనుము. అని అదృశ్యవాణి ప్రతిధ్వనించెను. గురువంతట శిరమున కేలుగీలించి— ''ఓ దీన రక్షకుడవగు పర మేశ్వరా! సకల జీవులు నీమాయకు వశ్యులై పథము దప్పి భ్రమించుచుందురు. నా శిష్యుడు మూర్ఖుడు అతనిపై నీ కృపాదృష్టి ప్రసరింపజేసి, త్వరలో వాడు శాపమునుండి ముక్తుడగునట్లు అనుగ్ర హించమని కోరుచున్నాను—'' అని మొరపెట్టు కొనెను.



''ఏమిటోయ్! మీ ఆవిడంటే అంత భయం? ఒక ముక్కకూడా మాట్లాడవేం?!''

గురువు పరోపకార బుద్ధికి పరమేశ్వరుడు సంతసించి— తథాస్తు—పలికి ఇట్లు ప్రవచించెను. —"విప్రోత్తమా! నీ శిష్యుడు గురుద్రోహము తలపెట్టి ఘోర పాపమునకు ఒడిగట్టెను. అయినను నీ సాధు స్వభావమునకు సంప్రీతుడనై యున్నందున వానిని క్షమించుచున్నాను. కాబట్టి ఇతడు పూర్వజ్ఞానము కలిగియుండి జననమరణ దుఃఖములకు అతీతుడై యుండుగాక. ఓరీ శూద్రుడా నీవు శ్రీరాముడు జన్మించిన పావన నగరములో పుట్టియుంటివి. అదియునుగాక భక్తితో నన్ను సేవించుచుంటివి కాబట్టి నీవు ఆ శ్రీరాముని యెడ అపార భక్తి కలిగి నిరంతరము సుఖింతువుగాక. ఇకనిగాదట నీవు బ్రాహ్మణులను నిరాదరించక, స్వేచ్ఛాగామివై సంచరింపుము. నీకు దుర్లభమైనది లోకములో ఏదియును లేదు—" అని శివవాణి నన్ననుగ్రహించెను.

శంకరుని ప్రసన్నవాణి విన్నమీదట నా గురువు పరమానందభరితుడై నన్ననేక విధముల ఆశీర్వదించి నిజాశ్రమమునకు వెడలిపోయెను.

## లోమశమహర్షి శాపము

పక్షీంద్రా! ఆ పైన కొంతకాలమునకు నేను వింధ్యాచల ప్రాంతమున సర్పమునై పుట్టితిని. పిమ్మట క్రమముగా నేను అనేక యోనులందు వివిధ రూపములెత్తితిని! కానీ యేజన్మయందుకూడా నేను నా పూర్వజ్ఞానమును పోగొట్టుకొనక పరమ భక్తితో రామ ప్రభువును సదా సేవించుచుంటిని.

బహుకాల పర్యంతమిట్లు అనేక జన్మ మరణములు పొందిన పిమ్మట, కాలాంతరమున ఒక బ్రాహ్మణ వంశమున మానవుడనై జన్మించితిని. నేను బాల్యదశలో ఆటపాటలందుకూడ శ్రీరాముని విస్మరించకుంటిని. నా తండ్రి నాకు విద్యాబుద్ధులు చెప్పించి నన్ను పండితునిగా చేయ యునని ఎంతో ప్రయత్నించి తుదకు నిరాశ జెందెను. కామధేనువును వదలి గాడిదను ఆశ్రయించుటకు ఎవరు ఇచ్ఛగింతురు! నేను ఏమాత్రము లౌకిక విద్యలను ఆపేక్షించక సర్వదా నిత్తమ నామమాత్తము చేసి భక్తిప్రవతుడనై ఉంటిని.

కొంత కాలమునకు తల్లిదండ్రులు గతించిరి. అనంతరము నేను వనములకు పోయి, అక్కడ మునియాశ్రమములందు ద్రిమ్మరుచూ మహర్షుల యొద్ద కోసలరాముని గుణ కథలను వినుచు కాలము గడుపుచుంటిని.

క్రమక్రమముగా నాలోని కోర్కెలు నశించెను. నానా వాసనలు నన్ను వదలి పెట్టెను. నేను నిరంతరము రామనామ-స్మరణాసక్తుడనై ఉంటిని. అప్పుడు నాలో ఒక బలీయమైన కోరిక మాత్రము ఉండెను,— అది శ్రీరాముని కన్నులారా చూడవలెనను వాంఛ. ఆ యిచ్ఛనాలో ఉత్తరోత్తరా అధికము కాజొచ్చెను. దాశరథి దర్శనార్థమై మనస్సు వికలము కాజొచ్చెను. నేనంతట మునీశ్వరుల యొద్దకు పరుగులెత్తి ఆ శ్రీపతి ఎక్కడున్నాడో చెప్పుమని వారిని ప్రాధేయపడితిని. నా ప్రశ్నకు వారు— 'భగవంతుడు సర్వాంతర్యామి, సకల ప్రాణికోటియందు నివసించుచుండును.' అని నాకు నిర్గుణ బ్రహ్మను గురించి బోధించుట కుపక్రమించిరి. బహుకాలమునుండి సగుణ బ్రహ్మను ప్రేమించిన నామనస్సుకు వారి నిర్గుణ బోధలు రుచించలేకపోయెను.

నేనట్లు నిరంతరము సీతానాథుని దివ్య నామము జపించుకొనుచు లోక సంచారము చేయుచుండు తరి ఒకప్పుడు లోమశ మహర్షిని దర్శించుట తటస్థించెను. ఆ మునీశ్వరుడప్పుడు మేరుగిరి శిఖరమందున్న ఒక వటవృక్షము క్రింద కూర్చొని ఉండెను. నేనా మునీశ్వరుని సమీపించి, అతని చరణములకు సాష్టాంగమొనర్చి, బద్ధహస్తుడనై— "ఓ మునివర్యా! నన్ను కటాక్షించి, నాకు సగుణ బ్రహ్మోపాసన విధానమును గురించి వివరించవలసిందిగా వేడుకొనుచున్నాను—" అని ప్రార్థించితిని.

ఆ తపోధనుడంత పరమానందముతో నన్ను తన చెంత కూర్చుండ బెట్టుకుని, మొదట శ్రీరాముని గుణగాథలు కొన్ని వివరించి చెప్పి, అనంతరము నిర్గుణ తత్త్వమును బోధించసాగెను. కానీ లోమశుని నిర్గుణోపదేశము నాకు నచ్చకపోయెను. ఆ పైన నేను వినయ విధేయుడనై— "ఓ మహాత్మా! చేప నీటిని వీడలేనట్లు సగుణ తత్త్వమును వదల

ఒక ప్రియుడూ, ప్రియురాలు తగవులాడుకొని, వారం రోజుల తరువాత మళ్లీ మంచిఅయ్యారు.

ప్రియురాలు : తప్పంతా నాదే, క్షమించరూ!

ప్రియుడు : అబ్బే! ఫరవాలేదు. నేను నీకు "థాంక్స్" చెప్పుకోవాలి. ఈ వారం నాకు వంద రూపాయిలు మిగిలాయి!

లేకపోవుచున్నాను. కావున నా మనస్సు నిర్గుణోపాసనను అంగీకరించుటలేదు. మహర్షీ ఒక్కమారు ఆ దేవదేవుని దివ్య సౌందర్యము దర్శించుకొనుటకై నానేత్ర ద్వయము బహు దినముల నుండి పరితపించుచున్నది. ఈ కన్నులతో ఒకసారి ఆ దాశరథిని చూచుకొనవలయునని మనస్సు ఉవ్విళ్ళూరుచున్నది. అట్టి భాగ్యము కలుగుటకు మార్గమేదైనా మున్న తెలియజేయవలసిందిగా వేడుకొనుచున్నాను,— పిమ్మట నేను నిశ్చింతతో మీరు బోధించు నిర్గుణోపదేశమును వినగలవాడను" అని పలికితిని.

అందుమీదట మహర్షి అత్యంత గంభీరముద్ర వహించి, సాకారపూజను ఖండించి నిరాకార దేవుని గురించి బోధించసాగెను.

అందుపైన నేనుకూడ ప్రతివాదమునకు పూనుకొని మహర్షి ఉపదేశమునకు పూర్వపక్షము చేయసాగితిని. నిర్గుణోపాసనకంటే సగుణోపాసన శ్రేష్ఠమైనది. అను నా వాదము విన్నంతనే లోమశునికి కోపము వచ్చినట్లగపడెను. ఎక్కువగా రాచిన కట్టైన చందనమందుసైతం అగ్ని పుట్టును. మునీశ్వరుని కుపిత నైఖరికి గాంచి నేనిట్లాలోచించసాగితిని—

"—నా ప్రతి వచనములకు మహర్షి ఆగ్రహించుచున్నాడు. ద్వైత బుద్ధిలేనిదే క్రోధమెట్లు జనించును. అజ్ఞానమువల్లనే కదా ద్వైత బుద్ధి పుట్టుడుట. మాయాధీనుడు, పరిచ్ఛిన్నుడగు జడ జీవుడు ఈశ్వర స్థితిని చేరుకొనగలడా! బ్రహ్మజ్ఞాన సంపన్నుడగు యీ లోమశునికి కోపమెట్లు వచ్చును! ఇతనిలోని జీవుడు పరబ్రహ్మతో సమానుడెట్లగును! చింతామణి లభించినవాడు దరిద్రుడుగా నుండుట అసంభవము. బ్రహ్మ తత్త్వము సిద్ధించిన వారికి లౌకిక స్వభావముండునా! జీవు డెప్పటికీ దేవుడు కాజాలడు........"

అని మనసులో తర్కించుకొని నేనపుడు ముని వాదమును ప్రతిఘటించితిని. నా వైఖరికి ఋషి క్రుద్ధుడై నన్ను చురచుర చూచి "ఓరీ మూర్ఖుడా! నేను నీకు బ్రహ్మ జ్ఞానమును ఉపదేశించగా నీవు దానిని విశ్వసించక గుంటకాకి స్వపక్షమును సమర్థించుకొనుటకు ప్రయత్నించితివి. కాబట్టి నీవు చండాలమైన కాకి జన్మమెత్తి చరింతువు గాక—" అని లోమశుడు శపించెను.

"గరుడా! నేను ఏమాత్రము చలించక నిర్భయముతో మునిశాపమును స్వీకరించి కాకినై పోతిని. తరువాత మునివర్యుని పాదములకు మ్రొక్కి గిడి రామనామము స్మరించుకొనుచూ లోమశునియొద్ద నుండి నిర్గమించితిని."

"—ఉమా! కామ క్రోధాదులు నిర్జించిన ఆనుక్షణము అవధేశుని ఆరాధించుచుండు భక్తుని కంటికి లోకమంతయు రామ మయముగా కన్పట్టుచుండును. అట్టి పురుషుడు అన్యులతో కలహించుటకు ఎట్టి స్థితిలోను ఇచ్ఛగించరు.—" అని భర్గుడు ఆ సందర్భమున భవానితో పలికియుండెను.

## వరదానము

అట్లు తాను వాయస స్వరూపమును ధరించుటకు గల కారణము తెలియజేసిన పిమ్మట, భుశుండి మరల గరుత్మంతుని చేర్చొని ఇట్లు ప్రసంగించెను.

"ఓ ఖగరాజా! నేను వాయసముగా శపింపబడుటకు ప్రధాన హేతువు ఆ రఘురాముని సంకల్పమే గాని లోమశుని మహర్షి మాత్రము కాదు. శ్రీవ సంకల్పముచే ప్రేరితుడై ముని నన్నా విధముగా పరీక్షించియుండెను. నేను స్థిరచిత్తుడనగా ఆ ముని భక్తుడనని గ్రహించిన తదుపరి మునిశ్రేష్ఠ ప్రసన్నుడై నన్ననేక విధముల అభినందించి, నాకు ప్రేమతో రామమంత్రోపదేశము చేసెను. వెండియు, మునిపుంగవుడు ముదముతో మెగాహసమూర్తియగు బాలరాముని సుందర రూపమును ధ్యానించు విధానముకూడ నాకు తెలియజేసెను. బాలరాముడు నా ఇష్ట దేవుడని మునుపొకసారి నీకు చెప్పియుంటిని. తదాది లోమశ ఋషి బహుకాలము నన్ను తనయొద్ద ఉంచుకొని రామచరితమానసము సంపూర్ణముగ నాకు వినిపించెను."

ఒకనాడు ఆ తాపస వర్యుడు నన్ను తన చెంతకు చేరబిలిచి—"ఓ వాయసోత్తమా! నేనింతకు పూర్వము శంకరుని వలన తెలుసుకొని యుండిన యీ రామచరితమానస పుణ్య కథను నీకు సాంతముగా బోధించగలిగితిని. ఒక్క విషయము సదా జ్ఞప్తియందుంచుకొనుము, భక్తిలేని వారికి మాత్రము ఎప్పటికినీ ఈ రామకథను బోధించరాదు.— ' అని ఉద్బోధించి, మునీశ్వరుడు స్వహస్తములతో నా మస్తకమునుస్పృశించినిట్లాశీర్వదించెను—(సశేషం)



# ప్రభుత్వం - పరిశ్రమ

## ఎన్. టి. రామారావు

ఇన్ని సమస్యల సతమతంలో మనం గర్వంగా చెప్పుకునేది, కళాకారులంతా హర్షించి కృతజ్ఞత తెలుపుకునేది, అన్ని రాష్ట్ర ప్రభుత్వాలకూ చిరకాలం ఆదర్శంగా ఉండేది-మన ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వం చలనచిత్ర పరిశ్రమను నేడు పరిగణించిన విధానం; దానిపట్ల చూపిన గౌరవం, **ఈనాడు కళారంగం ప్రభుత్వం నుండి పొందిన ప్రోత్సాహం. ఆదరం, మా అందరికీ గౌరవ కారణం, పరిశ్రమను గుర్తించి, దాని అవుసరాన్ని అంగీకరించి, కళాకారులందరికి సంఘంలో ఒక ఉన్నత స్థాయిలో ప్రతిపత్తిని కల్గించచూనడం ముదావహం !**

మునుపటి మన ముఖ్యమంత్రి గౌ. డా. సంజీవరెడ్డిగారు ఆనాటి కళాప్రియుల్ని కళాపోషకుల్ని మరపించి, తెలుగువారు రాజనీతిజ్ఞతతోపాటు, రసజ్ఞులని నిరూపించి చూపించారు. వీరికీ సౌజన్య దృష్టి మా చిత్రసీమపై కల్గించిన గౌరవం, ఒక విధంగా మా పరిశ్రమవారిదని నా భావన. ఎందువల్ల అంటే—ఆ నాడు శ్రీ సంజీవరెడ్డిగారి పిలుపు వినగానే ఉత్తేజంతో పొంగి, దేశాభిమానంతో ముందుకు వచ్చి, మా ప్రభుత్వమే మేమని ప్రతి కళాకారుడు బద్ధకంకణుడై వారి వారి కార్యకలాపాలను కట్టిపెట్టి ఆనాడు “ దేశరక్షణ నిధికి ” గాను అందరూ ఏకంగా పాల్గొన్న విధానం, మా క్రమశిక్షణ, మా శక్తిసామర్థ్యాలు, ప్రజలలో కళ కున్న పలుకబడి, ఆదరం, గౌరవం, వీటినన్నిటినీ పరిశీలించి మా చలనచిత్ర పరిశ్రమపట్ల ప్రభుత్వానికి ఒక సదభిప్రాయం కలిగించిందని నా నమ్మకం. ఆనాడు శ్రీ సంజీవరెడ్డిగారు భాగ్యనగరులో మా కిచ్చిన గౌరవం, స్వగృహంలో ఇచ్చిన ఆతిథ్యం, చూపిన ఆదరం మేము ఎన్నటికీ మరచిపోలేము. ఆనాటి మా పరవశమూ, ఆనందమూ ఇంతింత కాదు. — ఏమని ? ——

“ కళ ఈనాడు ప్రభుత్వానికి అతిథి ”... అని అంత గౌరవం పొంది ఆనాడు మా అర్హత మేమూ నిరూపించుకున్నాము. ఈ సన్నిహితత్వం తరువాత శ్రీ రెడ్డిగారు వారి హయాంలోనే మా చలన చిత్ర పరిశ్రమను ప్రభుత్వం ఆదరించ వలయునని ఒక సర్వజనామోదమైన నిర్ణయానికి రావడం, ప్రభుత్వానికి మాపట్ల ఏర్పడిన గౌరవ దృష్టికి నిదర్శనం. ఇది ఈనాడే కాక ఏనాడూ కూడా ప్రతి కళాకారుడూ హృదయపూర్వకంగా తన కృతజ్ఞత తెలియజేసుకునే సంఘటన. మరిచిపోని మధురస్మృతి !!

సంకల్పించిన సత్కార్యం, సత్సాంప్రదాయం ఒక స్వరూపం దాల్చకముందే శ్రీ రెడ్డిగారు పదవి విరమణ చేయడం మా దురదృష్టం. అయినా ఒక ఆదర్శం కొరకు పదవీ త్యాగం చేసిన శ్రీ రెడ్డిగారి శీలం అభివందనీయం !

వ్యక్తులు వేరైనా ప్రారంభించిన సత్కార్యాన్ని ప్రక్కకు నెట్టకుండా శ్రీ సంజీవరెడ్డిగారు తలపెట్టిన కళోద్ధరణ కార్యక్రమం కృషి అదే భావంతో, దీక్షతో కొనసాగిస్తున్న మన ఆంధ్రరాష్ట్ర ప్రస్తుత ముఖ్యమంత్రి గౌ. శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డిగారు అభినందనీయులు. మన పరిశ్రమ పట్ల సుముఖులూ, సహృదయులూ అయిన వీరి హయాంలో విచక్షణా దృష్టితో, చలనచిత్ర పరిశ్రమోద్ధరణ కార్యక్రమం నిష్పక్షపాతంగా, సర్వజన హృదయంగమంగా ఒక

గావు కల్పించుకోగలదని మా ఆంధ్ర చలనచిత్ర పారిశ్రామికుల ఆశ ! అపేక్ష !!

**ప్రభుత్వం పరిశ్రమకీయ నిర్ణయించిన ప్రోత్సాహం: హైదరాబాద్‌లో తయారయ్యే ప్రతి చిత్రానికి రు. 50,000/-ల సబ్సిడీ.**

**ఆత్మ పరిశీలన:**

50 వేలు అన్నది ఏ విధమైన కొలబద్ద ? ఇది ఎందుకు? ఈ యాభై వేలు ఏ ప్రభుత్వం యీయని నాడుకూడా పరిశ్రమ స్వయంపోషకంగా బ్రతుకుతూ వచ్చిందే ! పైగా ఏనాటి కానాడు ప్రజాదరమే ప్రోత్సాహంగా, వారి అభిమానమే భాగ్యంగా, భావిసూత్ సంఘ శ్రేయోభిలాషులమై, మానసోల్లాసప్రియులమై కళారంగంలో ఇంతకాలం కృషిచేస్తూ వచ్చామే !

**అటువంటి మాకు ఈ 50 వేలు ఈనాడు దేనికి ?**

**మా దేశభక్తి 50 వేల విలువా??**

లేకపోతే ధనాశతో స్వరాష్ట్రానికి వచ్చారన్న చిన్న మాట మా కెందుకు ? ప్రజాభిమానంతో పరిశ్రమ. ముఖ్యంగా నటీనటులం బ్రతుకుతున్నాం. ఆ ఆదరాభిమానాలతో అందుకొన్న అంతస్థులనుంచి అంచెలవారీ అంకెలు పెంచుకుంటున్నాం — ఈ ప్రజాపోషణ పరిశ్రమకు చాలదా ?

ఈనాడు అనివార్య కారణాలవల్ల, అతి క్లిష్ట పరిస్థితుల పరిణామాలవల్ల పెరిగిన పన్నులభారంతో నడుం వంగినా, మిగిలిన సత్తువంతా కూడగట్టుకుని ఆహారసమృద్ధి సాధించే రైతు సోదరులు... దేశ పురోభివృద్ధికోరి అహర్నిశలూ చమటోడ్చి శ్రమించే కార్మిక సోదరులు. దేశరక్షణ కోసం భార్యాబిడ్డలకు దూరమై, కాని ప్రదేశాలలో కంటిమీదకునుకైనా వేయకుండా రక్తతర్పణకు వెనుకాడని సైనికవీరులు, తిరిగేయంత్రాల రొదలో తన్ను తానే మరిచి తానూ ఒక మరమనిషిగా తయారై ఉత్పత్తులను పెంచుతూ దేశసౌభాగ్యమే ధ్యేయంగా పెట్టుకున్న శ్రామికులు...

ఇందరి శ్రమఫలితంగా ప్రభుత్వ ఖజానాలో చేరిన ప్రజలసొమ్మునుంచి, అభిమానంతో ప్రభుత్వము ఇస్తామన్నా "ఛా"నని మనం పుచ్చుకోవడం సబబా ?

ఇది మనకు ప్రతిష్ఠ ???

ఈ మాత్రం త్యాగం మనం చేయలేమా ?

**ఆ చిత్రంలో నటించే నలుగురు ముఖ్య నటీనటులు వారివారి పారితోషికంలోనుంచి పాతిక భాగం తగ్గించుకుంటే ఈ 50 వేలకన్నా ఎక్కువ నిర్మాతకు మిగులుతుందే!**

**మాకిచ్చే మొత్తం చాలు ప్రత్యేక మర్యాదలకు ఆపైన మీాకేమీా ఖర్చుపెట్టనక్కరలేదని నిర్మాతకు అందరూ హామీాయిస్తే కాఫీ ఖాతాక్రింద అయ్యేఖర్చు 50 వేలకన్నా ఎక్కువ మిగులుతుందే!!**

"ఎవరి కార్లమీాద వారు వస్తాం, ఎవరి ఖర్చులు వారు భరించుకుంటాం అని అందరూ నిర్ణయించుకుంటే ట్రాన్సుపోర్టు ఖాతాక్రింద అయ్యే కార్లు, రిపేర్లూ, పెట్రోలు, 50 వేలకు మించి ఆదాయమౌతుందే ? !! "

ఇచ్చిన కాల్‌షీట్లకు నటీనటులందరూ క్రమశిక్షణ పాటించి సరైన టైముకు వస్తే, నటిస్తే ఈ 50 వేలకన్నా ఎక్కువ నిర్మాతకు మిగిల్చిపెట్టగలమే ! చిత్ర చిత్రానికీ రెండువారాల వ్యవధితో విడుదల చేసుకుందామని నిర్మాతలందరూ కలిసి కట్టుగా ఒక నిర్ణయానికి వస్తే వారి వారి ప్రతి చిత్రం ఈ 50 వేలకన్నా అదనం సొమ్ము గడిస్తుందే!!

చలనచిత్ర వ్యాపారాధికారులైన డిస్ట్రిబ్యూటర్లు పరిశ్రమాభివృద్ధి కోరి వారి కమీాషన్‌లో 2% ఒక ప్రక్కనబెడితే ఆ నిధి ఎన్నోలక్షలకు మించుతుందే !!!

కాస్త రాయల్టీలు, వడ్డీలు రాయితీ చేస్తే నిర్మాతలెందరో సుభిక్షంగా బ్రతికిపోతారే !!!

**శ్రీ యన్. టి. రామారావు రాస్తున్న నాలుగు వ్యాసాలలో ఇది మూడవది.**

థియేటర్ల వద్ద నిర్మాతయొక్క అజమాయిషీకి అవసరం లేకుండా చిత్రం సక్రమంగా ప్రదర్శిస్తే ప్రతి చిత్రానికీ, ఈ 50 వేలకుమించి ఆదాయం వస్తుందే.

ఇంత సులభంగా ఎవరి బ్రతుకుతెరువులకూ భంగం లేకుండా సుహృద్భావంతో, పరిశ్రమపురోభివృద్ధికోరి మేము తేలికగా చేసుకోగలిగినవి ఇన్ని వుండగా ఇస్తామన్నారు గదా అని ప్రభుత్వం వద్దనుండి 50వేల ప్రజల సొత్తుకు ఒడిబట్టడం మనకు తగునా ?

విశాలదృక్పథంతో విజ్ఞులాలోచించండి —— ఈనాడు మనశాంతి భద్రతలు సవాలుచేస్తూ నలు దెసల నుంచీ కమ్ముకువచ్చే కారుమేఘాలు, సమర గర్జనలు సమసిపోయి, దేశం పటిష్టమై సర్వసౌభాగ్యసంపద్విలాసమై వర్థిల్లేటప్పుడు ప్రభుత్వం వద్దనుంచి క్రమబద్ధంగా మనం పుచ్చుకోవడమే సంభవిస్తే — అప్పుడు ఈ 50 వేలేనా ??

ఈనాడు పరిశ్రమనుంచి .... .... ....

ఎంటర్‌టైన్‌మెంటు టాక్సు, ఇన్‌కమ్‌టాక్సు గిఫ్టుటాక్సు, వెల్తుటాక్సు, సూపర్‌టాక్సు, సేల్సు టాక్సు, ఎక్సయిజు సుంకాలు, ఇంపోర్టు సుంకాలు, షోటాక్సు, లైసెన్సు పన్నులు, వ్యాపారం పన్నులు, వృత్తి పన్నులు, .... .... మొదలైన పన్నులెన్నో ప్రభుత్వ ఖజానాకు చేరు తున్నయ్. ఈ రీతిగా మా పరిశ్రమనుంచి పన్నుల రూపేణా వసూలైన ఆ మొత్తంలోనుంచి ఈ పరిశ్రమాభివృద్ధి కార్యక్రమాలకు ప్రభుత్వం అసలు వెచ్చించేదెంత ?

ఇతర పరిశ్రమల అభివృద్ధి విషయంలో ప్రభుత్వము చూపుతున్న ఆతురత, వినియోగిస్తున్న శాతం మా చలనచిత్ర పరిశ్రమాభివృద్ధికి కేటాయిస్తున్నారా ? అని గనుక ప్రశ్నవేసుకుంటే, నేటి పరిశ్రమ స్థితే దానికి సమాధానం !!! ఈనాడు ప్రతి అడుగు ముడి ఫిలిం పరాయి దేశాలనుంచి దిగుమతి కావలసిందే ! ప్రతి యంత్రమూ, యంత్ర భాగమూ ఇతర దేశాల నుంచి మనకు రావలసిందే !— మంచి కలర్ ప్రింట్సు కావాలన్నా పై దేశాల కెక్కడికో పరుగులెత్తాల్సిందే ! అభ్యుదయమింత పెరిగిన యీా ఆధునిక అణుయుగంలో కూడ, ఈ పరిశ్రమ ఇంత నిరాధారంగా వుండంటే దానికి బాధ్యులెవరు ? పన్నులు నిండుగా కురిపించే పరిశ్రమను పోషించాలని ప్రభుత్వానికి తెలియచెప్పాలా ? దీనిని గమనించడం వారి విద్యుక్తధర్మం కాదా ? ఇన్ని ఇబ్బందులు అనుభవిస్తూ, ఇతర దేశ చిత్రాలస్థాయికి ఏ మాత్రం తీసిపోని విధంగా చిత్రాలను నిర్మిస్తున్నాము అంటే అది చలనచిత్ర పారిశ్రామికుల కృషేగాని ప్రభుత్వ ప్రోత్సాహం మాత్రం కాదు. ఈ పరిశ్రమకు కావలసిన సహాయ సంపత్తులేవో సరిగా గ్రహించి, దీనినీ ఒక పరిశ్రమగా గుర్తించి, ఆంధ్ర ప్రభుత్వం చలనచిత్ర నిర్మాణాన్ని ప్రోత్సహించాలి, చిత్ర నిర్మాణంలో ప్రమాణాలను పెంచడానికి సాయపడాలి. — చిత్రాల స్థాయిని హెచ్చించే మార్గాలన్వేషించాలిగాని యిలా 50 వేలతో నిర్మాతలను ఆకర్షించి ప్రయోజనం లేదు.

**ఒకవేళ ఈ 50 వేలైనా, నిర్మాత లందరికీ పరిశ్రమ మొత్తానికీ; లభ్యమా ?**

ఉన్నది ఒక స్టుడియో. క్రొత్తవి నిర్మించాలంటే కనీసం మూడు సంవత్సరాలైనా పడుతుంది. ఇచ్చే ఈ పారితోషికం ఒక రెండు సంవత్సరాలు మాత్రమే. ఇక ఇది లభ్యమయ్యేదెవరికీ ? ఆ ఒక్క స్టుడియోలో చిత్రాలు నిర్మించే కొద్దిమంది నిర్మాతలకు !!! అసలీ కొద్దిమంది నిర్మాతలైనా పరిశ్రమోద్ధరణకు గాని, దేశభక్తితోగాని హైదరాబాదు వచ్చారా ?

**లేక ఒక్క నటుని అవుసరంతో వచ్చారా ? అక్కడ నివాసం ఏర్పరచుకొని మరొక చోటికివచ్చి ఆ నటుడు నటించననడం వల్లనేగాని ఈ 50 వేలకోసం కాదు—ఏ పరమార్థ దృష్టితోనూ కాదు. ఇంతింత పెద్ద మొత్తాలు ఇచ్చి, ఇంత పెద్ద నటులతో, పెద్ద చిత్రాలు, నిర్మించే పెద్ద నిర్మాతకు, ఈ ప్రభుత్వ పారితోషికమే ఆకర్షణ కాదు. అదీగాక ప్రభుత్వం పారితోషికం ప్రకటించక పూర్వమే హైదరాబాదులో ఆ నటుని ప్రయోజనంతో చిత్రాలు**

## "ఈనాడు ఫారెన్ ఎక్స్ఛేంజి గడించ గలిగే మరొక భాష నిర్మాణానికి తోడుగా ఉంటేనేగాని తెలుగు చిత్రాలు రంగులలో తీసే అవకాశం కూడలేదు. ఇంతటి నిస్సహాయ నిరాధార పరిశ్రమకు ప్రభుత్వ సహాయం విదేశీమారక ద్రవ్యంలో జరుగవలెను...."

నిర్మించబడడమే దీనికి తార్కాణం. కనుక గనినిబట్టి ప్రభుత్వం తలపెట్టిన సహాయ కార్యక్రమం ఎంతవరకు ఫలించిందో, ఎంతవరకూ అవసరమో గమనార్హం !

ఈనాడు హైదరాబాదులో చిత్రనిర్మాణానికి ఖర్చు ఎక్కువవౌతున్నది కనుక ప్రభుత్వం ఈ సహాయము ఇవ్వనిశ్చయిందన్నారు.

అసలు ఖర్చు ఎందుకు ఎక్కువౌతుంది? పరిశ్రమలో ఉన్న ప్రతివారూ హైదరాబాద్‌లో స్థిరంగా ఉంటె ఖర్చు అధికం ఎందుకు అవుతుంది ? ఈనాడు మదరాసులో వలెనె మా ఇళ్లల్లో మేము తింటాం, మా కార్లమీద, లేక మా కాళ్లమీద మా స్టూడియోలకు మేము పోతాం, ఇది సాధ్యం కానప్పుడే కదా, ప్లేను ఖర్చులూ, దారి ఖర్చులు, బసల ఖర్చులు ! ప్రభుత్వమే గనుక ఈనాడు ప్రకటించిన విధానమే అవలంభించి 50 వేలు ఇస్తే, సత్యాలలాగే వుంటవిగాని ఏ మాత్రం తగ్గవు. ఇతర భాషా చిత్రాల గిరాకీతో అధిక ఆదాయం మదరాసులో సంపాదించుకుంటున్న మన నటీనటులు — మా ఖర్చు తిప్పది ప్రభుత్వం గనుక మా చేతినుంచి పోయేదేమని ఎప్పటికీ — ఎప్పటికప్పుడు మదరాసునుంచే వస్తూ వుంటారు. దీనితో పరిశ్రమ తరలింపు సమస్య అక్రిందులై కూచుంటుంది.

## క్రొత్త స్టూడియోల నిర్మాణము

హెచ్చు స్థాయిలో అత్యున్నతమైన చిత్రాలు తయారు కావడానికి సాయపడేవి సాంకేతికంగా అభివృద్ధి భావంతో నిర్మించబడిన అధునాతనమైన స్టూడియోలు. వీటి నిర్మాణానికి ప్రభుత్వ సహాయం అవసరం. క్రొత్తగా నిర్మించబడే ప్రతి స్టూడియోకూ ప్రభుత్వం 5 లక్షల రూపాయలు రెండు సంవత్సరాల వరకూ వడ్డీ రాయితీతో అప్పుగా ఇవ్వబూనడం పరిశ్రమకు ఇవ్వగల అత్యుత్తమమైన ప్రోత్సాహం. . . కాని ధనం ఒక్కటే ఆధునికమైన స్టూడియోల నిర్మాణానికి పూర్తి వసతులు కలిగించలేదు. సాంకేతిక మనోభివృద్ధికి పూర్తిగా దోహదం చేయలేదు. ఈ ఆశయ సాధనకు ప్రభుత్వం చేకూర్చవలసిన సహాయాలు వేరే ఉన్నాయ్. ఈ నాడు 35 మిల్లి మీటర్ చిత్రాలు క్రమేపీ వెనక బడుతున్నాయి. టెలివిజన్ పోటీతో పరిశ్రమ ముందుకు సాగుతోంది— స్కోపు—సినిమా స్కోపు— వైడ్‌స్కోపు— 70 మిల్లి మీటర్ల చిత్రాలు ఆధునిక ఆకర్షణలు— వాటి తయారీకి కావలసింది డబ్బే కాదు— నిర్మాణానికి కనువైన ఆధునిక యంత్రాలు, పరికరాలు కావాలి. కావాలంటే అవి ఇతర దేశాల నుంచే మనకు రావాలి. రావాలంటే మనకు "మారకద్రవ్యం" అంటే "ఫారిన్ ఎక్స్ఛేంజి" ఉండాలి. ఉండాలి అంటే మన చిత్రాలు ఇతర దేశాలలో ప్రదర్శించ బడాలి. కాని మన తెలుగు భాషా చిత్రాలు ఒక్క మన ఆంధ్ర దేశంలోనే తప్ప, ఇతర దేశాలలో ప్రదర్శించబడే అవకాశం లవలేశమాత్రం కూడ లేదు. కనక మన పరిశ్రమ ఫారెన్‌ఎక్స్ఛేంజి కాసు గూడ గడించలేదు. ఈ దృష్ట్యా ప్రభుత్వమే మనకీ ఫారెన్ ఎక్స్ఛేంజి సౌకర్యం కలిగించాలి. అప్పుడే అధునాతనమైన స్టూడియో సామగ్రిని మనం దిగుమతి చేసుకోగలం. ఈ నాడు ప్రభుత్వం సాయ తలపెట్టిన 5 లక్షల కరెన్సీ లోనే గనుక స్టూడియోలు నిర్మించబడితే వాటిలో ఉండేది పాత కెమేరాలు— ఉపయోగించి వదలి పెట్టిన సెకండు హేండు సౌండు మిషన్లు; త్రుప్పు పట్టిన లైట్లు, బూజు పట్టిన పాత సామగ్రేగాని, ఆధునిక పరికరాలు అమరే అవకాశం ఆవగింజంత కూడా లేదు. ఈ నాడు, ఫారెన్ ఎక్స్ఛేంజి గడించ గలిగే మరొక భాష నిర్మాణానికి తోడుగా ఉంటేనే గాని తెలుగు చిత్రాలు రంగులలో తీసే అవకాశం కూడ లేదు. ఇంతటి నిస్సహాయ, నిరాధార, పరిశ్రమకు ప్రభుత్వ సహాయం విదేశీ మారక ద్రవ్యంలో జరుగవలెను. అప్పుడే సరిక్రొత్త, ఆధునిక పరికరాలతో అధునాతనమైన స్టూడియోలు ఆంధ్ర రాజధానిలో జాజ్వల్యమానంగా నిర్మించ బడగలవు. మన తెలుగు చిత్రాలు ఇతర భాషా చిత్రాలలో పోటీగా నిలబడగలవు. మన ప్రతిభ చాటనూ గలవు—

## ఫిలిం ఎడ్వైజరీ కమిటీ :

ప్రభుత్వం పరిశ్రమకు తోడ్పడే ముందు, ఆ పరిశ్రమయొక్క లోతుపాతులు, దానికి సంబంధించిన సమస్యలు, అవసరములు క్షుణ్ణంగా ఆకళింపు చేసుకోవడం — అభివృద్ధికి చేయవలసిన సహాయవిధానం ఒక నిర్ణీతపద్ధతిలో అమలుపర్చడం సర్వజనామోదమైనది.

ఈ విషయంలో ప్రభుత్వానికి నిష్పక్షికంగా వరాలు సేకరించడంలోనూ, సూచన లివ్వడంలోనూ సాయపడగల ఒక కమిటీని నియమించడం సరైన మార్గం. తత్ సాంప్రదాయ ప్రకారం చలన చిత్ర పరిశ్రమాభివృద్ధికి సూచనలు చేయవలసిందిగా అప్పటి ముఖ్యమంత్రి శ్రీ సంజీవరెడ్డిగారు ఒక కేబినెట్ సబ్ కమిటీని ఏర్పాటు చేశారు. అందులో ఇప్పటి ముఖ్యమంత్రి శ్రీ బ్రహ్మానందరెడ్డి గారు, శ్రీ చెన్నారెడ్డి గారు, శ్రీ నరసింహారావుగారు ఉన్నారు. ఈ ముగ్గురు మంత్రులతో ఏర్పడిన కేబినెట్ సబ్ కమిటీ తమకు అక్కడ హైదరాబాదులో అందుబాటులో ఉన్న ఒక నిర్మాతను, ఒక నటుణ్ణి, ఒక దర్శకుణ్ణి, ఒక స్టూడియో అధిపతిని, మరి కొందరినీ సంప్రదించి చలన చిత్ర పరిశ్రమకు చేయవలసిన కొన్ని సహాయాలను ప్రకటించడం ముదావహం. ఇందులో ఉన్న సచ్ఛిత్తాశయం, మంత్రివర్గ సబ్ కమిటీ దృష్ట్యా ఉన్న ఉత్సాహం అందరిగా హర్షించ దగినదే. కాని గత ముప్ఫై సంవత్సరాలుగా మదరాసులో మన తెలుగు పరిశ్రమాభివృద్ధికి కృషి చేసిన త్యాగ ధనులు, చిత్రపరిశ్రమకు జీవితాల్ని అంకితం చేసి అమోఘ సేవానిరతితో ఒక ప్రత్యేక గౌరవ స్థానం గడించిన పెద్దలు, చిత్ర నిర్మాణంలో ఐక్యమైపోయి దాని అభ్యుదయ పురోగమనానికి తమ జీవితాలే నీరాజనం పట్టి అఖిలాంధ్ర ప్రజానీకంచే ప్రముఖులుగా గణుతింపబడిన అనేక మంది కళాకారులు, సాంకేతిక ప్రజ్ఞులు ఉండగా, వీరందరి సలహా సహకారములు తీసికోకుండా కాబినెట్ సబ్ కమిటీ పరిశ్రమకు పరిపూర్ణ ప్రాతినిధ్యం వహించని ఏ కొద్ది మందినో సంప్రదించి, వారు సంపూర్ణ పరిశ్రమను గాక కొంతమంది లాభమే దృష్టియందుంచుకొని ఇచ్చిన సంకుచితమైన సలహాలన్నీ పాటించి, నిర్ణయాలు తీసుకోవడం ప్రజాస్వామ్య సిద్ధాంతాలను గౌరవించే మన రాజ్యాంగంలో ఎందుకు జరిగిందో, ఎలా జరిగిందో దురూహ్యం. మదరాసులోని ఆంధ్ర ప్రముఖులకు కూడా గౌరవమిచ్చి, సమ దృష్టితో, సుహృద్భావంతో ఆహ్వానించి ఉంటే, వారిలో తలపండిన వారు వారి అనుభవ సహకార సంపత్తులతో వచ్చి నిష్పక్షికంగా సర్వ శ్రేయోభిలాషతో కాబినెట్ సబ్ కమిటీకి సహాయ కారులుగా ఉండేవారు. ఇంతమంది వయో వృద్ధుల్ని, సాటి ఆంధ్రుల్ని, విస్మరించడం వల్ల పరిశ్రమ తరలింపుతో గమనించవలసిన అతి ముఖ్య విషయములు, యదార్థ సమస్యలు తెలిసికోగల అవకాశం ఏర్పడలేదు. పరిశ్రమ భవిష్యత్తు దృష్ట్యా దాని అభివృద్ధికి చేయవలసిన అనేక పనులు దూరదృష్టితో సర్వ జనా



ముప్పాళ్ళ రంగనాయకమ్మ

### జరిగిన కథ

తను రాసిన కథపై సహృదయంతో విమర్శ రాసిన మధుసూదన్ స్నేహాన్ని శారద వాంఛిస్తుంది. ఒకరోజు బీచ్‌లో ఒకమ్మాయి కేసి తదేకంగా చూస్తున్న మధును చూచి, ఆమెను గురించి అడుగుతుంది శారద. మధు చెప్పాడు. కళ్యాణి జగన్నాథం దంపతులకు సూర్యం, మధు సంతానం. మేనకోడలు పుట్టిందన్న ఉత్సాహంతో జగన్నాథంగారు పద్నాలుగు నెలల్లో పుట్టింటికి బయల్దేరుతుంది కళ్యాణి. పుట్టింట్లో ఆడపిల్లను ప్రసవించి కన్నుమూస్తుంది. భార్యావియోగంతో జగన్నాథం ఎటో వెళ్ళిపోతాడు. మధు, సూర్యం తాతగారింట్లో ఉంటారు. మధు మనస్సు తల్లితండ్రులమీదకు పోకుండా ఉండాలని జమిందారిణి తమ పిల్లల్తో ఆడుకోటానికి రమ్మని చెప్తుంది. మధు సంబరపడ్డాడు.

## 4

మధుకి తరచూ జమీందారుగారి అమ్మాయిలతో తోటలో ఆడుకోవటం బాగా అలవాటైంది.

"అమ్మగారూ!" అంటూ శ్యామసుందరీ దేవితో నిర్భయంగా కబుర్లు చెప్పటం. "అక్కయ్యా" అని చనువుగా పద్మావతిని పిలవటం చేతనైంది. జమీందారిణి ఆదరణ మధుకి పుట్టెడు బలం ఇచ్చింది.

మధూతో ఆడుకోవటం పద్మావతికీ, రాగిణికీ చాలా ఇష్టం. మధు ఎప్పుడూ కొత్త కొత్త ఆటలు నేర్చుకువచ్చి అక్కచెల్లెళ్ళిద్దరికీ నేర్పుతుంటాడు. తెల్ల కాగితాలతో గాలిపడగలు చేసి ఆకాశంలో ఎగరవేస్తాడు. పడవలూ, ఓడలూ చేసి నీటిలో వదులుతూంటాడు. ఇక గట్టి అట్టలతో — గుడ్డముక్కలతో — గాజుపూసలతో — దూదివుండలతో ఎన్నెన్ని రకాల పిట్టల్నీ బొమ్మల్నీ చేయగలడో లెక్కేలేదు. కొన్ని పిట్టలచేత కీచు కీచుమంటూ అరిపించగలడు కూడా. కర్రముక్కలతో మధూ తయారుచేసే బళ్ళు డబడబమని మోత చేసుకొంటూ నడుస్తాయి. ఇక దాగుడు మూతలలో మధు ఎప్పుడూ దొంగేకాడు. తూనీగలా ఎగిరిపోయే రాగిణి కూడా మధుని అందుకోలేదు. పట్టుదల ఎక్కువై ఆయాసం వచ్చే వరకూ పరిగెడుతుంది — "మధు బాబూ దొరికి పోవూ?" అంటూ ప్రాధేయపడుతుంది. మధుకి వచ్చిన ఆటలన్నీ పద్మావతికీ, రాగిణికీ కూడా వచ్చు. ఆ ముగ్గురూ కలిసి తోటలలో ఆడుకొంటూంటే ఎన్ని గంటలైనా గడిచి పోతాయి.

ఊళ్ళోకి ఏ గారడీవాడు వచ్చినా ఏ ఆటగాళ్ళు వచ్చినా ఆ కబురు క్షణాలమీద పద్మావతికి చేరవేస్తాడు మధు. పద్మావతి వెళ్ళి తల్లిని అడిగితే ఆవిడ నౌకర్లను పంపించి ఆటగాళ్లను రప్పిస్తుంది. వాళ్ళ విద్యలన్నీ చూసి తగిన విధంగా సత్కరించి పంపించి వేస్తారు.

సంస్థానంలోని విశేషాలన్నీ మధుకి చాలా వరకు తెలుసు. జమీందారు గారికి కోతుల పెంపకం మహా సరదా. సంస్థానంలో ఆటలాడే కోతులు కూడా వున్నాయి. మధూ అడిగిందే ఆలస్యంగా పద్మావతి నౌకర్లను ఆజ్ఞాపించి కోతులను తెప్పిస్తుంది. కోతుల ఆటలు చూడటం మధుకి మహా ఇష్టం.

వీధి పిల్లల్లో మధూ పలుకుబడి బాగా పెరిగి పోయింది. తోటి పిల్లల వూహలకు కూడా అందని విషయాలు మధు గర్వంగా చెప్తుంటే వాడి చుట్టూ గుంపు పోగవుతుంది — "జమీందారుగారి తోటలో ఎన్నిచెట్లు వున్నాయో మీకు తెలుసా? నాలుగు వందలో తొమ్మిది వందలో వుంటాయి. ఓహో! తెల్ల గులాబీలు ఎంత బావుంటాయనీ! అమ్మగారు ఎప్పుడూ అవే పెట్టుకుంటారు. పళ్ళూ, పువ్వులూ నాయిష్టం వచ్చినట్టు కోసేసుకుంటాను. పద్మావతీదేవికీ, రాగిణీ రాణికి నేనే ఆటలన్నీ నేర్పాను. వాళ్ళిద్దరూ "మధు బాబూ! మధు బాబూ!" అని నావెంట వెంటే తిరుగుతూంటారు. అక్కడ ఎప్పుడూ కొత్త కొత్త ఫలహారాలు తింటాను. ఎంత కమ్మగా వుంటాయనీ! నీళ్ళు కూడా చల్లగా సువాసన వస్తూ వుంటాయి. కోతులు గమ్మత్తుగా ఆడతాయి. భలే నవ్వు వస్తుంది నాకు. ఏనుగు దగ్గరికి వెళ్ళి నించోగలను. తొండం కూడా ముట్టుకుంటాను. అబ్బో! మెత్తగా వుంటుంది. అస్సలు నాకు భయమే వెయ్యదు. అమ్మగారికి నేనంటే ఎంతో ఇష్టం. అయ్యగారు కూడా అప్పుడప్పుడూ నాతో మాట్లాడుతారు. మొన్న నాకు కొత్త చొక్కాలు కూడా ఇచ్చారు. నేను వెళ్ళకపోతే నా కోసం దాసీ వచ్చేస్తుందిగా."—

అలా గంటలతరబడి చెప్పగలిగే మధు చిన్నహీరో అయి కూర్చున్నాడు. వాడి స్నేహం అపురూపమైపోయింది. మధు కబుర్లలోని అతిశయోక్తులు పిల్లలందర్నీ నోళ్ళు తెరుచుకు వినేలా చేస్తాయి. ఒకసారి రామూ అన్నాడు.

"నువ్వు చూసినవన్నీ మాకూ చూడాలని వుందిరా మధూ! మమ్మల్ని ఒక్కసారి తీసుకువెళ్ళ కూడదూ?"

"మిమ్మల్నా?" మధుకి ఆశ్చర్యం వేసింది.

"మేమంతా నీస్నేహితులంకామా ఏమిటి? అమ్మగారు నీమాట వింటారుగా?"

పాపం మధుకి వాళ్ళమీద చాలా జాలి వేసింది. "అమ్మగార్ని అడిగి తీసుకు వెళ్తానురా!"

"నిజంగా?"

"నిజంగానే అడుగుతానుగా?"

స్నేహితులకు మాట ఇచ్చాడేగాని మధు ధైర్యం చేసి పద్మావతిని కూడా అడగలేక పోయాడు.

జమీందారుగారు వేటకి వెళ్ళి పెద్దపులిని చంపి తీసుకు వచ్చారు. దాన్ని అందరూ చూడటానికి సింహద్వారం దగ్గిర పడుకోబెట్టారు. ఆరోజు మధు స్నేహితులంతా తప్పకుండా తమని కోటలోకి తీసుకు వెళ్ళాల్సిందేనని పట్టుబట్టారు. మధు ధైర్యంగా అమ్మగారి దగ్గిరికి బయల్దేరాడు. భయం భయంగా అడిగేశాడు. — "అమ్మగారూ! మరండీ! మాస్నేహితులు ........ ఒక్కసారి ........ మన తోట చూపించమంటున్నారండీ! ఒక్కసారి ........ చాలంటున్నారండీ!"

శ్యామసుందరీదేవి నవ్వింది — వివరంగా విషయమంతా అడిగి తెలుసుకొంది—"దానికేముందయ్యా? సాయంత్రం తీసుకువచ్చి అంతా చూపించు. నేను నౌకర్లకి చెప్తాలే."

"అక్కయ్యగారు కూడా........."

"అలాగే అమ్మాయిలు కూడా వస్తారు. వెళ్ళే ముందు వాళ్ళనందరిని ఇక్కడికి తీసుకురా. ఫలహారం చేసి మరీ వెళ్తారు."

మధుకి పట్టరాని సంతోషం కలిగింది. బాణంలా వీధిలోకి పరిగెత్తాడు.

మరొకరోజు జమీందారు గారికి ఎవరో స్నేహితులు చిన్ని ఏనుగు పిల్లని బహుమతిగా పంపించారు.

మోదంగా చేయగలిగిన వాతావరణం ఏర్పడ లేదు. దీనితో ఇటు ప్రభుత్వం ఇస్తామని ముందుకు వచ్చిన సహాయం పరిశ్రమకు పూర్తిగా లభించదు. అటు ప్రభుత్వం తల పెట్టిన సత్సాంప్రదాయమైన సత్కార్యం బయట పడమూ కాలేదు. ఈ విధంగా ఈ సమస్య నిరాశాజనకమై అందరికీ విస్పృహ కలిగించింది.

## సినీ కాలనీ

కళారంగమన్న పేరు సార్థకమయ్యే తీరులో కళ కళ లాడుతూ సర్వాంగ సుందరంగా ఈ పరిశ్రమ ఒకేచోట విలసిల్లడం సర్వత్రా ఉత్తమమైన విషయం. అమెరికాలో ఉన్న హాలీవుడ్, డిస్నీలాండ్ మొదలైన మహత్తర సుందర స్థలాలు ఈ విధంగా రూపొంది పెంపొందింపబడినవే ! ఆ ప్రకారం హైదరాబాదులో పరిశ్రమకు గాను ప్రభుత్వం కేటాయించ దలచుకున్న స్థలం ఏ మారు మూలనో గాక మనోజ్ఞ పరిసర పరివేష్టితమై సర్వజనాకర్షణకూ అందుబాటులో ఉంటే మంచిది. ఇది ఒక నిర్దుష్టమైన ప్లాను ప్రకారం, ఇవి స్టుడియోలు, ఇక్కడ నటీనటుల నివాసములు, ఈ ప్రక్క సాంకేతిక వర్గము వారి భవంతులు, అది పారిశ్రామికుల కాలనీ, అక్కడ పార్కు, ఆటస్థలం, పాఠశాల, వినోద భవనం, గ్రంథాలయం, వాటర్ టాంకూ అని క్రమ బద్ధంగా రూపొందించబడాలి. ఇలా అయితే నిర్దుష్టాకృతి పొందిన ఆ చలన చిత్ర పారిశ్రామిక కేంద్రం ఆ నాటి మయసభా ప్రాంగణం వలె, ఇతరరాష్ట్రాల వారినేగాక, ఇతర దేశాల వారికి కూడా సందర్శనాయోగ్యమై, నయనానందమై, ఆహ్లాదదాయకమై చిత్రాతిచిత్రమైన విచిత్ర కళా రంగంగా శోభిల్లుతుందనడంలో అతిశయోక్తి లేదు.

కాని ఈ కాలనీ నిర్మాణ సందర్భంలో ఒక ముఖ్య విషయాన్ని విస్మరించ గూడదు. ప్రభుత్వం వారు పరిశ్రమ కోసం, సౌజన్య దృష్టితో ప్రత్యేకించి ఇచ్చిన ఈ భూమికి, పరిశ్రమ స్థిర పడడంతో విలువ పెరగడం ఖాయం. ఆ అవకాశం పురస్కరించుకొని క్రమబద్ధంగా వృద్ధి చేయబడి పరిశ్రమకు చెందిన ఈ భూమిని ఎవ్వరూ అన్యాక్రాంతం చేయకుండా ప్రభుత్వం కట్టు దిట్టాలు చేయడం కూడా అత్యవసరం.

ఇలా ఏర్పాటైననాడు తెలుగు చలనచిత్ర పరిశ్రమ ఒకేచోట పరిశుద్ధాకృతి పుణికిపుచ్చుకుని 'మూడు పూవులు, ఆరు కాయలు'గా విలసిల్లి, మన ఆంధ్ర రాజధానికే ఎనలేని శోభ తెస్తుందనడంలో సంశయం లేదు!



వచ్చే వారం
నాలుగవ వ్యాసం!

దానికి చూట్టానికి కూడా మధు స్నేహితుల్ని తీసుకు వెళ్లాడు.

శ్యామసుందరీదేవి వూహించిన విధంగా మధు తల్లిదండ్రుల ధ్యాసమర్చి దిగులు మాని ఆరోగ్యంగా చురుకుగా మారిపోయాడు. బంతిలా ఆడుకొంటూన్న మనవణ్ణి చూస్తే రాజయ్యగారి వేదనంతా పోయినట్టని పించింది. కాని కొత్త చిక్కొకటి వచ్చిపడింది. ఆటలకు అలవాట్లై చదువుకి పూర్తిగా ఎగనామం పెట్టేశాడు మధు. బడికి వెళ్లమని కేకలేస్తే మొండి కెత్తడం నేర్చుకున్నాడు. సూర్యం బ్రతిమిలాడి తీసుకువెళ్తే అక్కడేదో అల్లరి చేసి పక్కవాణ్ణి రెండు తన్ని ఇంటికి పరిగెత్తుకు రావటం ప్రారంభించాడు. పరిస్థితులు విషమించటంతో ఒకనాడు రాజయ్యగారు శ్యామసుందరీదేవి దర్శనం చేసుకొని మనవణ్ణి గురించి వివరించి చెప్పారు — "వాడికి బొత్తిగా భయం లేకుండా పోయింది. తల్లీ ! పెద్ద వాడు బుద్ధిగా చదువు కొంటున్నాడుగాని వీడు ఎంత చెప్పినా వినటం లేదమ్మా ! కాస్త తమరు మంద లిస్తే ....."

"దానికేముంది బాబాయిగారూ! మధుబాబుకి [illegible] అయ్యారంటే [illegible]."

రాజయ్యగారు అయోమయంగా చూశారు. శ్యామసుందరీదేవికి మగపిల్లలంటే కుతూహలం ఎక్కువ. అది ఆవిడకు కొడుకులు లేకపోవటం చేతనే అవచ్చు. తెలివిగా చురుకుగా వుండే మధూపట్ల ఆవిడకు పుత్రవాత్సల్యమే."

"ఆది కాదు తల్లీ ! ...... " ఏదో అనబోయారు రాజయ్యగారు.

"మధుబాబుని వుదయం కూడా పంపిస్తూ వుండండి బాబాయిగారూ! ఇక్కడే చదువుకుంటాడు. అమ్మాయిలకు చెప్పటానికి మాష్టారు వస్తున్నారు ఇదా ?"

రాజయ్యగారికి ఆశ్చర్యంతో కాసేపు మాట రాలేదు.



" మరేమీ సంశయించకండి బాబాయిగారూ ! ఇక్కడైతే శ్రద్ధగా చదువు కుంటాడు. చదువుపట్ల ఆసక్తి పుడితే తర్వాత ఎక్కడైనా ఫర్వాలేదు."

" అంతా తమ దయతల్లీ ! " రాజయ్యగారు లేచి నిలబడ్డారు. " వెళ్లి వస్తానమ్మా ! "

శ్యామసుందరీదేవి వాత్సల్యంతో అంది — " చూడండి బాబాయిగారూ ! మీకన్నా చిన్నవాళ్లమైనా మీ పరిస్థితి చూస్తోంటే చెప్పక తప్పటం లేదు. మీరు చాలా నీరశించి పోయినట్టు కన్పిస్తున్నారు. అన్నీ అనుభవించిన పెద్దలు. మీరే కష్టాలు సహించకపోతే ఎలా చెప్పండి. మీ మనవలిద్దరూ చక్కగా చదువుకొని పెద్దవాళ్లవుతారు. వాళ్ల భవిష్యత్తుకేమీ భయం లేదు. ముందు మీరు ధైర్యంగా వుండి పిల్లల్ని పెంచితే కదా ? ఇక బెంగ పెట్టుకోకండి బాబాయిగారూ !"

శ్యామసుందరీదేవి మందలింపుతో రాజయ్యగారు పసిపిల్లవాడిలా కడుపులో బాధ వెళ్లగక్కు కున్నారు: " ఏం చెయ్యను తల్లీ ? మర్చిపోదామంటే మరుపు రావటం లేదు. చెట్టంత కూతురు గంగలో కలిసి పోయింది. ఇంకా ఎంతకాలం నేను బ్రతికివుంటాను తల్లీ ? తర్వాత పసివాళ్లు ఏమైపోవాలి ? ఎంత మేనమామలైనా ఒకపేగు ఎడమేకదమ్మా ! పోనీ చిన్నదాని బ్రతుకు చూద్దునా ? లక్షణంగా కాపరం చేసుకోవాల్సిన వయసులో నవ్వుల పాలైపోయింది. నేను బ్రతికివుండగా చక్కబడుతుందో లేదో తెలియటం లేదమ్మా ! "

శ్యామసుందరీదేవి ఏమీ మాట్లాడ లేకపోయింది.

" పులి మీద పుట్రలా పసిదాని చింత ఒకటి వచ్చి పడింది తల్లీ ! అందరిలాగే అదీ పెరిగితే లక్షణంగా వుండును. మూగదై పోయింది."

" ఎవరు బాబాయిగారూ ? "

" తల్లి పోగా బ్రతికిన చిన్నదమ్మా ! రెండోఏడు నడుస్తున్నా మాటా, పలుకూ లేదు. మన మూగ పిల్లల బడిలో వాళ్ళని చూస్తోంటే నా మనవరాలూ అలాగే అవుతుంది కాబోలని కడుపు తరుక్కు పోతోందమ్మా ! "

" బాబాయిగారూ ! సుశీల మూగదా ? " విస్తుపోయింది శ్యామసుందరీదేవి — " నిజంగా మూగదే అవుతుందంటారా ? " అంది బాధగా.

" అయ్యో తల్లీ ! భగవంతుడికి దయ లేదమ్మా ! " నిట్టూర్చారు రాజయ్యగారు.

సుశీల మూగది కావటం శ్యామసుందరీదేవికి చాలా బాధ కలిగింది. సుందరమ్మగారి కోరిక మీద " సుశీల " అన్న పేరు ఆవిడే పెట్టింది.

" ఇదంతా మా దౌర్భాగ్యమమ్మా ! వాళ్ల ఖర్మ ఎలావుంటే అలా జరుగుతుంది. వెళ్ళి వస్తానమ్మా! " రాజయ్యగారు బుజాలు వంగిపోయి భారంగా నడిచి వెళ్తోంటే జాలిగా చూస్తూ నిలబడింది శ్యామ సుందరీదేవి.

జమీందారుగారి ఇంట చదువు ప్రారంభించి మూడు నెలలకు హెచ్చుకాక పోయినా మూడవ తరగతి పూర్తి చేశాడు మధు. మధు తెలివితేటలు మాష్టారిని ఆశ్చర్యపరిచాయి. అతి వుత్సాహంగా చదివి అమ్మగారి అభివందనలు పొందటమే మధు వుద్దేశ్యమై పోయింది. మధు దినచర్యలు ఒక క్రమంలో వడ్డాయి.

*        *        *

సుధా, సుశీలా ఒకే వయస్సులో ఒక్క ఇంట్లోనే పెరుగుతున్నా ఇద్దరికీ ఏ విధంగానూ పొత్తు కుదుర లేదు.

చూపులకు చందనపు బొమ్మవంటి సుశీల నోరు తెరిచి మాట్లాడలేని మూగజీవి. పెద్ద పెద్ద కళ్లతో సంతోషంగా విచారంగా బాధగా ఆశగా చూస్తూ వుంటుంది. ఆ చిన్నారి మనస్సులో ఏ అనుభూతి కల్గినా అది విస్పష్టంగా కన్నుల్లో ప్రత్యక్షమౌతుంది. సుశీలను ప్రేమించే వారికి ఆ పిల్ల మనోభావాలు విపులంగానే అర్థమౌతాయి.

నాలుగైదు నెలల స్థితిలో నవ్వించితే నవ్వటం గానీ పల్కరించితే చూపులు మరల్చటం కానీ చేసేది కాదు సుశీల. ఏదైనా శబ్దానికి వులిక్కిపడ్డట్టు — జోల పాటను వినగలుగుతూన్నట్టూ తోచలేదు. ఒకసారి దీపావళి రాత్రి — టపాకాయల మోతకు వుండి వుండి వులిక్కిపడుతూ కేరు కేరువంటూ సుధ ఏడుస్తుంటే సుశీల కమ్మగా నిద్ర పోయింది. మరొకసారి జానకి పనిమీద నూతి దగ్గరికి వెళ్తూ సుశీలను పొయ్యికి దూరంగా కూర్చోబెట్టింది. జానకి వచ్చేసరికి సుశీల పొయ్యిలో మండుతూన్న కర్రలు లాగటానికి సిద్ధంగా వుంది పాకుతూ.

" సుశీ ! " గావుకేక పెట్టింది జానకి.

సుశీల మండేకర్ర లాగనే లాగింది. జానకి కేకను విన్నట్టు కూడాలేదు. జానకి ఒక్కసారిగా సుశీలను గుండెలకు హత్తుకుంటే అనుమానం వచ్చింది —

" సుశికి మాటలు విన్పించటం లేదా ? " — సుశి మొహంలోకి తేరిపార జూచింది. సుశీల బోసిగా నవ్వింది —

అదే అనుమానంతో జానకి సుశినీ, సుధనీ అనేక విధాల పోల్చి చూసింది. సుశీల కన్నా కొన్నిరోజులు మాత్రమే పెద్దదైన సుధ మనిషి అలికిడి పసికట్టేసి కళ్ళు తిప్పి చూస్తుంది. పల్కరిస్తే కేరింతాలు కొడుతూ నవ్వుతుంది. అస్పష్టంగా వూకలు చెప్తూ మీదికి పాకుతుంది. కోపంగా కసిరితే బిక్క మొహం వేసి ఏడుపు కుపక్రమిస్తుంది.

సుశీల పెరుగుదలలో మానసికంగా ఏ విధమైన చలనమూ లేదన్న సంగతి చూసే వాళ్ళకి స్పష్టంగా తెలిసి పోయింది. ఏడాది నిండే సరికే సుధ చిన్న చిన్న మాటలు మాట్లాడుతూ నడక నేర్చుకొంటే సుశీల్ని ఏవిధంగానూ సుధ పెరుగుదలను అందుకోలేదు — కాని .... పాల కోసం ఆతృత పడటం — ఎత్తుకోమని ప్రాధేయపడటం— సుశీల చూపులు వ్యక్తం చేసే భావాన్ని జానకి తేలికగా తెలుసుకోగలదు.

రెండో సంవత్సరంలో సుశీల శబ్దాలు వినగల్గుతూన్నట్టు అర్థమైంది. పిలిస్తే చిత్రంగా చూసి నవ్వటం చేతనైంది. కాని ... ఇక మాటలు రావనీ, సుశీల మూగదనీ నిర్ధారణ చేసుకొన్న జానకి కూతుర్ని హృదయానికి గాఢంగా హత్తుకుంది —

" తల్లిదండ్రులకు — సిరిసంపదలకూ దూరమైనా సంపూర్ణమైన ఆరోగ్యభాగ్యమైనా లేక పోయిందా తల్లీ ? " అంటూ ఏడ్చింది. సుశీలను ఒడిలో పడుకో బెట్టుకొని కళ్లలోకి చూస్తూ గంటల కొద్దీ గడిపేది.

అత్తలు సుశీలను పల్కరించటంగానీ — ఎత్తుకుని ముద్దులాడటంగానీ ఎన్నడూ లేదు.

కొంచెం పెద్దవాళ్లై ఆడుకోగలిగిన వయస్సులో సుధా సుశీలా కలిసి తిరగటం ప్రారంభించారు. సుధ అంతులేనన్ని కబుర్లు చెప్తూ ఇంటి కంతటికీ యువరాణిలాగ దర్జాగా తిరుగుతుంది. మగవాళ్ళు ఇంటికి రాగానే కాళ్లకు అడ్డం పడి ఎత్తుకోమని మారాం చేస్తుంది. ఆడవాళ్లందరి దగ్గరా ముద్దు ముద్దుగా కబుర్లు చెప్తూ గారాం చేస్తుంది.

సుశీలకు సుధ ఒక ప్రశ్నగా నిలిచింది. సుధ



ఎందుకలా గంతులువేస్తూ తిరుగుతుంది ? మావయ్యలను ఎందుకలా పలకరిస్తుంది ? తను కూడా సుధలా లేదేం ? తనకు గబగబా మాటలు రావేం ? మావయ్యలు తనని ఎత్తుకోరేం ?

సుశీల వేదన గ్రహించ గలిగిన జానకి కూతుర్ని సంతోషపెట్టటానికి ఎన్నో విధాల ప్రయత్నిస్తుంది. సుశీలకు సైగల ద్వారా భావాలు వెల్లడించటం అతి సున్నితంగా పట్టుబడింది.

పండుగనాడు — కొత్త గౌను తొడుకున్న సంబరంతో సుధ ఇల్లంతా పరుగులెడుతోంటే సుశీల సుధ వెనక వెనకే తిరిగి చివరికి తన గౌను వేళ్లతో చూపించింది — "నేనూ కొత్త గౌను తొడుక్కున్నాను చూడు." అన్నట్టు.

సుధ నిర్లక్ష్యంగా నవ్వేసింది — "నీ గౌను ఏమీ బాగాలేదు. నాది సిల్కుగౌను. తెలుసా ?" తన గౌను రెపరెప లాడించింది గర్వంగా.

తన గౌను సుధకు నచ్చలేదని అర్థమై పోయింది సుశీలకు. దీనంగా చూస్తూ అలాగే నిలబడింది.

"మీ అమ్మని అడుగు. వెళ్ళు." అంది సుధ.

సుశీల కళ్లు తుడుచుకొంటూ మొహం చిట్లించుకొంది. సుధ పరిగెత్తినకేసి చూపిస్తూ సంబరపడింది. జానకికి అంతా అర్థమైంది. సుశీలను దగ్గరికి తీసుకొని తలని నిమురుతూ — "మనకు ఇంకా మంచి గౌనులు లేవమ్మా ! సుధ గౌనుకన్నా నీ గౌనే నాకు బావుంది. ఇదే వుంచుకో." అంది లాలనగా.

సుశీలకు సంతృప్తి కలగలేదు. ఆశగా చూసింది అమ్మకేసి — "చెప్పాను కదూ నీ గౌనే బావుందని."

సుశీలవూరుకోలేదు. ఏడవటం ప్రారంభించింది. కొంతసేపు జానకి పట్టించుకోకుండా వూరుకుంది. సుశీల ఏడుపు మానలేదు. ఇంకా గట్టిగా సాగించింది. జానకికి కోపం వచ్చింది — "చెప్తే వినవు కదూ ?" అంటూ చెయ్యెత్తింది.

"అమ్మా !" కెవ్వుమంది సుశీల.

"అమ్మా !" నిర్ఘాంతపోయింది జానకి. కోపం మరిచి మననం చేసుకొంది—"అమ్మా.... అవ మ్మా."

"ఎన్నాళ్ళకు పిలిచావే అమ్మా !" అంటూ కూతుర్ని గాఢంగా హత్తుకుంది హృదయానికి — "సుశీల నన్ను అమ్మా అని పిలిచిందమ్మా !" అని తల్లికి వుత్తరం కూడా రాసింది జానకి సంతోషంతో.

చిన్నపిల్లల మధ్య ఏర్పడే చెలిమి సుశీలా సుధల మధ్య కూడా ఏర్పడక పోలేదు. సుశీలతో మాట్లాడటానికి దానికి అర్థమయ్యే విధంగా కళ్ళూ చేతులూ తిప్పటంలో అనుకోనివిధంగా సుధకు కూడా కొన్ని సైగలు పట్టుబడి పోయాయి. ఒకసారి అన్నంతింటూ మంచినీళ్లకోసం సైగచేసింది. మరోసారి తల దువ్వబోతే రెండుజడలు కావాలని వేళ్లుపెట్టి అడిగింది. అలా నాలుగైదుసార్లు జరగటంతో ఇంట్లో అలజడి బయల్దేరింది — "ఆ మూగపిల్లతో తిరిగి ఇది కూడా మూగదైపోయేలా వుంది ఖర్మ !" అంటూ కలవరపడి పోయింది సావిత్రి.

"అయితే కానూవచ్చు." తోటి కోడలి అనుమానం నిజమే కావచ్చునని నిర్ధారణ చేసింది పార్వతి. కొన్నాళ్లపాటు సుధని సుశీల దగ్గరికి పోకుండా ఎన్నో విధాల బోధ పరుస్తేగాని వారి భయం తీరలేదు. సుధకి సుశీలంటే ఏదో అసహ్యభావం ఏర్పడి పోయింది. సుశీల వెర్రిది. దానికి ఎప్పటికీ మాటలు రావు. దాని జట్టు పడితే తను కూడా మాట్లాడటం మర్చిపోయి వెర్రిదై పోతుంది. అందుకని దానితో కలిసి ఆడుకోకూడదు. సుధకు సుశీలంటే హేళన ! చులకనా ! "ఏయ్ మూగదానా !" అని పిలిచి సుశీలను ఏడిపించటం సుధకి మహాసరదా ! సుశీల దీనంగా ఏడుస్తుంటే చప్పట్లు చరుస్తూ నవ్వటం ఎంతో ఇష్టం. జానకి ఎన్నిసార్లు మందలించినా సుధ చిలిపితనం తగ్గలేదు. ఒకసారి సుధ సుశీలను వెక్కిరించటం జానకి చూసింది. కోపం పట్టలేక గట్టిగా ఒకటి అంటించింది. సుధ గావుకేకలు పెడుతుంటే — "అయ్యో ! ఏమైందే ! ఏమైందే !" అంటూ పరిగెత్తుకు వచ్చింది సావిత్రి. సంగతంతా తెలుసుకుని జానకి మీద విరుచుకు పడింది — "ఉన్నమాటంటే వులుకే మరి. చిన్నదాన్ని కాబట్టి తన్నగలిగావు. కూతురి మూగతనం ఎన్నాళ్ళు కప్పెట్టుకుంటావు ?" అంది హేళనగా. జానకి మాట్లాడలేదు.

"ఆ పిల్లతో ఇది ఆడటం లేదనీ వుక్రోషం కాకపోతే ఏమిటి ? పిచ్చివాళ్లతో మంచివాళ్లలా ఆడగలరూ ?" అంటూ సాగదీసుకొంది మళ్లీ. జానకి మరి ఊరుకోలేకపోయింది. "నీకూతురితో ఆడుకోకపోతే కోకపోతే ఇదేం చచ్చిపోదు. అస్తమానూ దాన్నలా వెక్కిరించి ఏడిపిస్తోంటే దాని మనస్సు బాధ పడుతుందనే నేను చెప్పేది."

టీచర్ : 'ఇంపాసిబుల్' అంటే ఏమిటో సోమూ ?

సోము : మీరు చెప్పింది నేను చదవటం సార్ !

మాధవ్ (తెనాలి)

"అయ్యో విడ్డూరం ! ఇంతోటి తెలివిగల పిల్లకీ మనస్సు బాధ పడటం ఒకటే !"

జానకి అక్కడ నిలబడలేక పోయింది. సుశీలను తీసుకొని జామచెట్టు క్రిందకి వెళ్లి కూర్చుంది.

కొన్ని కొన్ని సామాన్య విషయాలు అందరికీ తెలిసే వుంటాయి. కాని హాటని పాటించటంలోనే నీ, నా భేదభావాలు పైకి లేస్తాయి.

అంగవైకల్యాలతోగానీ — అవలక్షణాలతోగానీ పుట్టిన బిడ్డల్ని ప్రత్యేక శ్రద్ధతో సానుభూతితో చూడాలి. ఎదుటివారి అదృష్టాన్ని చూసి అసూయ పడకుండా — తమని తామే అసహ్యించుకునే అవసరం రాకుండా పెంచి పెద్ద చేయాలి — "నేను అందరిలా తెలివంత మాత్రాన ఎందుకూ కొరగాకుండా పోను. నన్ను కూడా భగవంతుడే సృష్టించాడు. నాలో లోపాన్ని చూసుకొని నేను విచారించను. నావంటి వాళ్లు సంతోషంగా సుఖంగా బ్రతకటానికి మార్గాలు వున్నాయి. ఈ విశాల ప్రపంచంలో నా పుట్టుక నిరర్థకమైనది కాదు. భగవంతుని సృష్టిలో ఎండిపోయిన గడ్డిపోచకుకూడా అపారమైన విలువ వుంది." అన్నంత ఆత్మవిశ్వాసాన్ని కల్గించాలి.

కాని దౌర్భాగ్యురాలైన సుశీలకు ఆ అనురాగమే లోపించింది. ఏదో విధమైన అవమానాలకు గురి అవుతూ ఆ పసి మనసు బండబారి పోయింది. చిమ్మ చీకటిని బెదిరించే సూర్యకిరణంలా జానకి వాత్సల్యం ఒక్కటే ఆ మూగ మనసుని సంతోషపెట్ట గలిగేది.

* * *

ఆ తల్లిలేని పిల్లల్ని చూసి విధి మరొకసారి వికటంగా నవ్వింది — రాజయ్యగారి మరణం హఠాత్తుగానే సంభవించినా అది విన్నవారికి మాత్రం ఏమంత ఆశ్చర్యాన్ని కల్గించలేదు. కొద్దికాలంగా రాజయ్యగారిని చూస్తున్నవారు ఆ వార్త తొందరలోనే వినవలసి వస్తుందని అనుకోక పోలేదు. మనోవ్యథా పిశాచి రాజయ్యగారినిపూర్తిగా వశం చేసుకొని కొంత కాలంపాటు ఆయన బడుగు దేహంలో కాపురం చేసి ఆయన్ని తన శక్తికొలదీ కృంగి కృశింప జేసి చివరికి తానే జయించింది — భోజనానికి పీటమీద కూర్చుని మత్తు శోకినట్లు పక్కకు ఒరిగి పోయిన రాజయ్యగారికి చివరి కోరికలు వెల్లడించుకున్న తృప్తి కూడా మిగలలేదు.

సుందరమ్మగారి శోకం శక్యమైనా కన్నీరు కార్పించగలిగేది. కంటికీ మంటికీ ఏకధారగా రోదిస్తూన్న ఆవిడను వోదార్చాలనే అభిమానంతో జమీందారిణి శ్యామసుందరీదేవి అంతస్థులు దిగి స్వయంగా వచ్చింది. సుందరమ్మగారి దుఃఖం చూసి నోరువిప్పి మాట్లాడలేక ఆవిడ్ని పరామర్శించటానికి కూడా మనసు ఒప్పక మౌనంగా వుండిపోయింది.

మధు పట్ల అత్యంత అనురాగంతో తోచిన నిర్ణయము చేసుకొన్న శ్యామసుందరీదేవి దానిని సమయోచితంగా సుందరమ్మగారి ఎదుట వెల్లడించింది "చూడండి పిన్నిగారూ ! ఎవరు వోదార్చినా తీరే దుఃఖం కాదు ఇది. మిమ్మల్ని విచారించవద్దని చెప్పటానికి కూడా నాకు నోరు రావటం లేదు — మీరు అన్యథా భావించకపోతే ఒకమాట. మధుబాబు గురించి మాత్రం ఏమీ దిగులు పడకండి." క్షణం ఆగింది శ్యామసుందరీదేవి — "మధుబాబుని మా దగ్గిర విడిచి వెళ్లండి. పెద్దవాడై మీ దగ్గిరికే వస్తాడు. మీ బిడ్డ మీకు భారం కాదనుకోండి. మరేమీ అనుకోరనే నమ్మకంతోనే అడగ గలిగాను."

సుందరమ్మగారు విభ్రాంతిగా చూసి తిరిగి కుమిలి కుమిలి ఏడవసాగింది.

"ఇప్పుడు మీరేమీ చెప్పవద్దు పిన్నిగారూ! ఆలోచించుకునే కబురు పంపించండి."

సుందరమ్మగారి కళ్లనుంచి జలజలా కన్నీళ్లు రాలాయి. చేతులెత్తి జోడిస్తూ కంపిస్తున్న కంఠస్వరంతో అంది — "నన్ను మన్నించు తల్లీ ! మీకు నేనేమి చెప్పగలను ?"

శ్యామసుందరీదేవి అర్థంకాక చూసింది — "ఫర్వాలేదు పిన్నిగారూ ! మీ మనసులో మాట చెప్పండి. నా దగ్గిర మీరు జంకు తున్నారా ?"

"పిల్లవాడు మీ ఒడ్డికలో మీ బిడ్డలాగే పెరుగుతాడు. నాకు తెలుసు తల్లీ ! కాని ..... మన్నించవమ్మా! ఆ పసివాడిని విడిచి నేను బ్రతకలేను." కడుపులో మాట కాస్తా జారవిడిచి నిట్టూర్చింది సుందరమ్మగారు — "ఎన్ని జన్మలెత్తినా మీ ఋణం తీర్చుకోలేము తల్లీ ! పసివాడు మీదర్శనం చేసుకొంటూనే వుంటాడు."

శ్యామసుందరీదేవి కించిత్తు ఆశ్చర్య పడింది. సుందరమ్మగారి హృదయం చదవ గలిగి, మారు మాట్లాడక మౌనంగా వుండిపోయింది — చురుగ్గా తెలివిగా వుండే మధుని చదివించి పెంచి పెద్దచేయాలన్న కోరికే శ్యామసుందరీదేవిని అంత వరకూ ప్రయ

త్రింపజేసింది. కాని సుందరమ్మగారి ధోరణి ఆవిడను మరి అడగనివ్వలేదు. — "నన్ను మన్నించు తల్లీ!" అంటూ సుందరమ్మగారు దీనంగా ప్రాధేయపడు తోంటే ఆవిడ మనస్ఫూర్తిగా వారించింది — "అయ్యో! మన్నించటానికి ఏముంది పిన్నిగారూ ? బిడ్డల్ని విడిచి వుండటం మన ఆడవారికి సాధ్యమా ? మీరు నన్ను అపార్థం చేసుకోకుండా వుండాలని మాత్రమే కోరుతున్నాను."

మనవణ్ణి విడిచి వుండలేనని సుందరమ్మగారు చెప్పిన విషయం ఏమంత నిజమైంది మాత్రం కాదు. ఈనాడెంత దిక్కులేని వాడయినా మధు ఒకనాడు అపురూపంగా చూచుకునే తల్లిదండ్రుల అనురాగముల మధ్య అల్లారు ముద్దుగా పెరిగినవాడే. శ్యామసుందరీ దేవి దయార్ద్ర హృదయంతో చేరదీయ వచ్చునుగానీ ఆ సంస్థానంలో వాడు అనాథుడే కదా ? — అంతే కాదు స్వర్గీయులైన రాజయ్యగారు అభిమానధనులు. పిల్లవాడిని పరాయి వ్యక్తుల దయాధర్మాలకు విడవటం ఆయన ఎన్నటికీ అంగీకరించలేరు — "కలిగితే తింటారు. లేదా పస్తులుంటారు. కంఠంలో ప్రాణం వుండగా పసివాళ్లను విడిచిపెట్టను." — సుందరమ్మగారు దృఢంగానిశ్చయించుకుని గాలి పీల్చుకొంది.

*   *   *

కాలం ఎంత విచిత్రంగానైనా మారిపోతుం టనేది అనుభవించితే గాని అర్థంగాని విషయం. ఈ నాడు.... కీర్తిశేషులైన రాజయ్యగారి కుటుంబాన్నంతా ఒక్కసారి పరికిస్తే క్షణం విస్మయం కలగక మానదు.

పెద్దల హయాంలో చల్లగా గడిచిన కాలం చూస్తుండగానే మారిపోయింది. కాలంతో పాటు మనుష్యులూ మారారు. మనుష్యుల విలువలూ మారాయి.

ఒక నాడు సర్వ స్వతంత్రురాలై గృహ యాజమాన్యాన్ని స్వీకరించిన సుందరమ్మ గారు ఈ నాడు కొడుకులకూ కోడళ్లకూ పనికిరాని పరాయి వ్యక్తి ! పుట్టింట చేరినా తల్లిదండ్రుల ఆదరాభిమానాలతో తగిన గౌరవం పొందగలిగిన ఆడబిడ్డ జానకి ఈ నాడు అన్నా వదినెల ముందు ఒదిగి



బాపు

"ఈ...లారీ క్రిందపడి ఒకని దుర్మరణం..."

## కూలిన గోడలు

బ్రతకార్సిన సామాన్యురాలు !

కల్యాణికి జరిగిన సత్కారాలు ఆవిడతోనే అంతరించి పోగా ఈ నాడు కల్యాణి బిడ్డలు పరాయి పంచ చేరిన బిచ్చగాళ్లు ! తల్లిదండ్రులు లేని అనాథలు ! ఆస్తి పాస్తుల్లేని దౌర్భాగ్యులు !— తన తరం గడిపి వేసుకున్న తల్లికి గానీ — దౌర్భాగ్య వశాత్తూ పుట్టింట జేరిన తోబుట్టువుకు గానీ— పరిస్థితులకు బలైపోయిన పసిబిడ్డలకు గానీ ఆ ఇంట ఎటువంటి ప్రత్యేకతలూ సానుభూతులూ లేవు. అందుకే "కాలగతి విచిత్రమైనది" అన టంలో అసత్య మేమీ లేదు.

తిరిగి స్వగ్రామం వచ్చిన కొత్తలో జానకి తల్లితో కొన్ని విషయాలు చాటుగా చెప్పి అంది— "ఇప్పుడు ఇంట్లో అందరూ మారిపోయారమ్మా ! అక్కయ్య ఉన్నప్పటి అభిమానాలు మచ్చుకైనా లేవు. ఇక నాన్న కూడా పోయారు...." దుఃఖావేశంతో మరి మాట్లాడ లేకపోయింది. అంతా విన్న సుందరమ్మ గారు నిస్సహాయురాలిలా నిట్టూర్చింది. "అనుకున్నంతా అయింది తల్లి ! పెద్దవాడి మీద నాకు ఎన్నడూ నమ్మకం లేదు. చిన్నతనంలోనే మీరంటే వాడికేమీ అభిమానం ఉండేది కాదు. ఇక చిన్నవాడి సంగతి సరేసరి. మనసున్నా తప్పించుకు తిరుగుతాడు. ఒక్క రక్తం పంచుకుని ఒక్క కడుపున పుట్టినా వాళ్లే మమకారాలు చంపుకొంటే ఇక పరాయివాళ్లు— వదినె కెలా ఉంటుంది ? వాళ్లని అనుకోవటం కూడా అనవసరం— కల్లాకపటం లేకుండా బ్రతికి తన బిడ్డలకు తనే అన్యాయం చేసుకొంది అక్కయ్య..... భగవంతుడు ఎలా నిర్ణయిస్తే అలా జరుగుతుంది తల్లీ మనం నిమిత్త మాత్రులం" అంది కంపిత స్వరంతో.

గడిచిన కాలంలో ఆ వూరి పరిస్థితులు కూడా చాలా మార్పు చెందాయి. మిడిల్ స్కూలు హైస్కూలుగా మారింది, ధర్మాసుపత్రీ పంచాయితీ లైబ్రరీ వెలిశాయి. విశ్వనాథం పలుకుబడి పెంచుకుని పంచాయితీ మెంబరయ్యాడు— ఏ నాటికైనా ప్రెసిడెంటు కూడా కావాలనే ఆశతో...

రాజయ్యగారు పోయిన కొత్తలో మధు మళ్లా బెంగటిల్లి పోయాడు. తాతయ్య పక్కలో పడుకోవటానికి అలవాటు పడిన మధు— ఒక నాటి రాత్రి ఏదో పీడకల వచ్చినట్టు ఉల్లిపడి లేచి ఏడుపు లంకించుకున్నాడు. సుందరమ్మగారు సముదాయించినా సూర్యం బుజ్జగించినా జానకి ఎత్తుకు తిప్పినా మధు ఏడవటం మానలేదు. చివరికి విశ్వనాథం కేకలేసినా లాభం లేక పోయింది సరిగదా ఏడుపు స్థాయి హెచ్చించాడు. విశ్వనాథానికి చిర్రెత్తుకొచ్చింది. ఛెళ్ళుమని ఒక్కటి అంటించేశాడు. కెవ్వుమన్న మధూ భయంతో సూర్యాన్ని కావిలించుకున్నాడు.

"తమ్ముణ్ణి.... కొట్టావా మామయ్యా ?" జరగకూడని దేదో జరిగినంత విభ్రాంతి కల్గింది సూర్యానికి. విశ్వనాథం కస్సుమన్నాడు—" నోరు మూసుకోరా నువ్వూ తినగలవ్. వెధవ గోల ఎంతకనీ భరించటం ? రాత్రిలేదు. పగలులేదు. తిండి తిననివ్వడు. నిద్రపోనివ్వడు.

సుందరమ్మగారు కోపం ఆపుకోలేక పోయింది—

"పసివాడసలే దిగులుతో అఘోరిస్తోంటే వాణ్ణి పట్టుకు కొడతావా ?" అంది విసురుగా.

"పదేళ్లున్నా పసివాడే. చచ్చినవాళ్ల మీద దిగుళ్లు దేనికి ?" విశ్వనాథం రుసరుస లాడుతూ తన గదిలోకి వెళ్ళిపోయాడు. సుందరమ్మగారు దుఃఖం నిండిన కంఠంతో స్పష్టంగా మాట్లాడ లేక పోయింది. చచ్చి స్వర్గాన ఉన్న కూతుర్ని తలుచుకుని— "అయ్యో ! ఎంత గతి పట్టింది తల్లీ !"— అనుకుంటూ కుమిలిపోతూ కళ్ళు ఒత్తుకొంది.

నిద్రకళ్లతో వచ్చి గది గుమ్మంలో నిలబడి చోద్యం చూస్తున్న పార్వతి— పెద్ద కోడలు అంది సమర్థింపుగా— "ఏదో భయానికి వో దెబ్బ వేస్తే అంతనిష్ఠూరంగా అనుకోవటం దేనికి ? అల్లుళ్లంటే ఆయనకు మాత్రం ఆపేక్ష లేదా ఏమిటి ?"

ఇంకా వెక్కుతూన్న మనవడిని దగ్గరికి తీసుకొంటూ— "భగవంతుడికే ఆపేక్ష లేక పోయింది తల్లీ ! ఇక ఎవరికి మాత్రం ఏం ప్రయోజనం?" నిట్టూర్చింది సుందరమ్మ గారు.

రాత్రుళ్లు ఎంతలేసి గొడవలు జరిగినా చిన్న కోడలు సావిత్రిగానీ కొడుకు సీతాపతిగానీ గది తలుపునైనా తియ్యరు. ముగ్గురు పిల్లల్నీ పెట్టుకుని సుందరమ్మగారూ జానకీ వావిట్లో పడుకుంటారు.

సూర్యం మధుల పసి హృదయాలలో అత్తల పట్ల గానీ మేనమామల పట్ల గానీ మంచి భావం ఒక్కటీ ఏర్పడలేదు. కారణం— ఎవ్వరూ వాళ్లని నిండు మనస్సులతో ఆదరించక పోవటం— సానుభూతితోనైనా పల్కరించక పోవటమే కావచ్చు.

"బావా, బావా !" అంటూ సూర్యం మధుల వెంట తిరిగే కృష్ణుడు కూడా చాలా నిర్లక్ష్యంగా మారిపోయాడు.

"అమ్మమ్మా ! బావ నాతో సరిగ్గా మాట్లాడటం లేదు. ఆడుకోటానికి పిలవటమే లేదు." అన్నాడొకసారి సూర్యం.

"పోనీలే. నువ్వూ తమ్ముడూ ఆడుకోండి. చాలు. మీకు పేరకాదా ఏమిటి ?" అంది జానకి పౌరుషంగా. తర్వాత సుందరమ్మగారు కృష్ణుణ్ణి పిలిచి అడిగింది—

"ఏమిరా ? నువ్వు బావలతో మాట్లాడటమే లేదట. మీరు ముగ్గురూ కలిసి ఆడుకోకూడదూ ?" —అప్పటికి మొహం అదోలా పెట్టి అన్నాడు కృష్ణుడు— "రారా మధూ !"

"నేను రానుఫో, నిన్న రానిచ్చావా ఏమిటి ?" కసిరి కొట్టాడు మధు— "తప్పునాన్నా ! మీలో మీరు దెబ్బ లాడుకోవచ్చా ? బావపిలిస్తే వెళ్లద్దూ ?" అంది సుందరమ్మగారు.

"నేను వెళ్లను అమ్మమ్మా ! వాడితో నేనేం ఆడుకోను. అన్నయ్య లేడా ఏమిటి ?"

"నిన్ను నేను పిలవనే పిలవను" అంటూ పరిగెత్తాడు కృష్ణుడు. సుందరమ్మగారు వెర్రి చూపులు చూస్తూ ఉండిపోయింది— సూర్యం మధుల రాకతో సుశీల మానసిక స్థితి మాత్రం సున్నితంగా మారిపోయింది. సుధకే అన్నయ్య ఉన్నట్టే తనకి ఉన్నారు. సుధని ఎత్తుకున్నట్టే తననీ ఎత్తుకొంటారు— తనని ప్రేమించే అన్నలు కన్నా ఏం కావాలి సుశీలకు ?

(సశేషం)

## మంచి అమ్మ

19 వ పేజీ తరువాయి

బాబిగాడు.

" ఒరేయ్ ! చొక్కా తొడుక్కుని సంచీ సర్దుకో. నేనొచ్చి తల దువ్వుతాను." బాబిగాడి వుత్సాహమంతా చచ్చిపోయింది. బళ్ళోకి వెళ్ళిపోతే ..... ? అమ్మో ! అమ్మ పారెయ్యదూ ?

" ఏమిరా ఇంకా అలా నించున్నావ్ ? " శకుంతల అరచేతిలో కొబ్బరినూనె ఒంచుకొని వచ్చింది బాబిగాడి నెత్తికి రుద్దటానికి.

బాబిగాడు కాస్త తెలివితేటలు వుపయోగించి మారాం చేస్తున్నట్టు ముద్దుగా అన్నాడు — " నీళ్ళోసుకుని అన్నం తినేసి కావలసినంతసేపు ఆడుకోమన్నావుగా ? "

" అయితే బళ్ళోకి వెళ్ళనంటావా ? అమ్మో ఇంకేమన్నా వుందా ? నాన్నకి తెలిస్తే కోప్పడరూ ? మధ్య నన్ను తిడతారు."

ఏం చెయ్యాలో పాలుపోలేదు బాబిగాడికి. తల దువ్వించుకున్నాడు. అన్నీ అయిష్టంగానే. పిల్లిపిల్లను వదలటమే మహా కష్టం. మ్యావ్ ....... మ్యావ్.... అంటూ అది బాబిగాడి కాళ్ళ చుట్టూనే ప్రదక్షిణాలు చేస్తోంది.

" ఒరేయ్ రామూ ! మీ రామూ వున్నాడాండీ ?" వీధిలోంచి గోపాలం కేక బాబిగాడికి, శకుంతలకీ కూడా వినిపించింది.

" ఆ వున్నాడు. వున్నాడు. లోపలికి రా ! కాస్త తొందరగా వీణ్ణి బళ్ళోకి తీసికెళ్ళు. పొద్దుట్నుంచీ అరవలేక చస్తున్నాను." అంది శకుంతల వంటింట్లో కూర్చునే.

బాబిగాడు స్వయంగా వీధిలోకి వచ్చి మహా సంతోషంగా గోపాలాన్ని ఆహ్వానించాడు — " నీకో గమ్మత్తు చూపిస్తానురా గోపీ ! రా గదిలోకి. గమ్మున రావాలి."

లోపలికి అడుగుపెట్టీ పెట్టగానే గోపీగాడి కంట పడనే పడిందా గమ్మత్తు — పిల్లిపిల్ల ! నల్లగా బొద్దుగా....... ఎంచక్కా వున్న చిన్నారి పిల్లిపిల్ల బాబిగాడు గర్వంగా దాన్ని చేతులతో ఎత్తి బుజాలమీద పెట్టుకున్నాడు. ఒళ్లంతా రాచుకున్నాడు — " ఇది నాదే. అచ్చంగా నేను పెంచుకుంటాను." వాడి కళ్లలో అపూర్వమైన ఆనందం తొణకిస లాడింది.

గోపాలం సంచీ దానంతటదే జారి కిందపడి పోయింది. వాడుకాస్తా పిల్లిపిల్ల దగ్గరికి పరిగెత్తాడు " ఎక్కడిదిరా రామూ? ఎక్కడిదిరా నీకు?" ఆశగా అడిగాడు.

" నాదే ఇది. మా అమ్మకూడా పెంచుకోమంది."

" ఎక్కడిదిరా నీకు ? "

" చూశావా ఎంత బావుందో ! ఇలా పట్టుకో. కరవదులే. పాపం చాలా మంచిది. ఎంచక్కా నీకు ముద్దు రావటంలా ? "

పిల్లిపిల్లని అపురూపంగా అందుకున్నాడు గోపాలం. మెత్తమెత్తగా వాడి చేతులు నాకుతూ స్నేహం ప్రదర్శించింది పిల్లిపిల్ల.

" బావుంది కదూ ? "

" ఆ ఎంతో బావుంది."

" ఆ నాకు నచ్చింది. బాగా నచ్చింది."

" మరేమో మా అమ్మ పాలు పోస్తే గబగబా

తాగేసింది...... పావం ఇంకా పోస్తే తాగుతుందేమోకో.
మరి లేవుగా అన్ని పాలు. అయినా ఎక్కువ పాలు తాగకూడదని మా అమ్మే చెప్పిందిలే — అమ్మో ! నువ్వు పడేస్తావో ఏమో ! ఇలా ఇచ్చెయ్ ! ”

“ ఇంకాస్సేపు నా దగ్గరే వుండనివ్వరా ! ”

చటుక్కున గోపీగాడి పిల్లిబొమ్మ మాట గుర్తుకు వచ్చింది బాబిగాడికి. “ ఏది ? నీ బొమ్మేదీ ? నీ పిల్లి బొమ్మ తేలేదూ ? ”

అయిష్టంగానే చెప్పాడు — గోపాలం — “తెచ్చాను. సంచీలో వుంది.”

“ ఏదీ ? తియ్యి. చూద్దాం. పిల్లిపిల్ల దగ్గిర పెట్టి చూద్దాం.” ఉత్సాహంగా తనే గోపీగాడి సంచి ఎత్తి కిందికి దిమ్మరించాడు. బాబిగాడు — గుండ్రటి రబ్బరు పిల్లిబొమ్మ కాస్తా దొర్లి వెళ్లి దూరంగా పడింది. — దాన్ని తెచ్చి పిల్లిపిల్ల దగ్గిర పెట్టాడు. ఛా ! ఏమిటో వెర్రి అనిపించింది ఇద్దరికీ — పిల్లిపిల్ల మ్యావ్....... మ్యావ్....... అంటూ నోరు తెరిచి అరుస్తోంది నిజంగా — బొమ్మ మాత్రం అలాగే.. పెట్టింది పెట్టినట్టే కూర్చుంది మట్టి బెడ్డలా — పిల్లిపిల్ల ఒక్కచోట నిలబడకుండా గునగునా నడిచేస్తోంది. మాటి మాటికీ తోకాడిస్తోంది. కళ్లు తిప్పి కిందికీ మీదికీ చూస్తోంది. — నిజం పిల్లిపిల్లలాగే వుంది.

# మంచి అమ్మ

గోపీగాడికి చాలా సిగ్గువేసింది— ఛా ! తన బొమ్మని చూడటానికే సిగ్గువేస్తోంది. నడవదు. ఎటూ చూడదు. తలేనా తిప్పదు. ఎందుకిలా ఉత్తినే కూర్చుని ఉంటే.... ? ఏం సరదా వేస్తుందనీ.... ?

గమ్మున పిల్లిబొమ్మని కాస్తా సంచీలో అడుక్కి కుక్కేశాడు— “నీ పిల్లిపిల్లే బావుందిరా రాముా! మనం దీనితోనే ఆడుకుందాం.”

“నిన్న నీ బొమ్మని సరిగ్గా చూపించనే లేదు నువ్వు.” నిష్ఠూరం వేశాడు బాబిగాడు.

“కావాలంటే దాన్ని నీకే ఇచ్చేస్తాలే.”

“నాకెందుకూ ? నాకు అచ్చం పిల్లిపిల్ల ఉందిగా ?”

“మీరిద్దరూ ఏం చేస్తున్నార్రా ఇక్కడ ? అయ్యా రాతా ? ఏదో శాస్త్రం చెప్పినట్టు ఒకళ్ల కిద్దరయ్యారా ? ఏవిరా గోపీ ! బళ్లోకి వెళ్తానని వచ్చి ఇక్కడే కూర్చుండి పోయావూ? ఇప్పటికైనా లేవరేం ?”

శకుంతల గావుకేక వేసుకుంటూ వచ్చింది.

“వెళ్తున్నాం పిన్నీ ! 'వెళ్లి పోతున్నాం.”

“ఇంకా ఎప్పుడు ? పొద్దు నడినెత్తికొస్తోంటే —కూర మాడుతోన్నట్టుంది. ఉండండి— మళ్లా వచ్చేసరికి....” గబగబా వచ్చిన ట్టే లోపలికి పరిగెత్తింది.

“మీ అమ్మ బళ్లోకి వెళ్లమంటోందిరా ?”

అడ్డంగా తల తిప్పాడు బాబిగాడు— “వద్దు ఇక్కడే ఆడుకుందాం.”

“మీ అమ్మ మళ్లావస్తే తిట్టదూ ?”

“పోనీ కాస్సేపే ఆడుకుని వెళ్లిపోదాం.”

ఆ ఉపాయం గోపాలానిక్కూడా బాగా నచ్చింది —సంచిలు రెండూ ఓవారగా పెట్టేసి పిల్లి పిల్లని గది మధ్య లాక్కు వచ్చి తీరుబాటుగా కూర్చున్నారు స్నేహితులిద్దరూ.

“అవుతే నీ పిల్లిపిల్ల కేం పేరు పెట్టావు ?”

“పేరా ? పిల్లిపిల్లకా ? ఎందుకన్నా ?”

“మరి పేరు ఉండాలిగా? టామీవో—జాకీవో.”

“ఛీ ! ఛీ ! అవి వెధవకుక్క పిల్లల పేర్లు.”

“పోనీ రాజా అంటే.... ?”

“వూహూ ! రాజా ఏం బావుందని ?”

“అసలీ పిల్లిపిల్ల ఆడదా ? మొగదా ? తెలీపోతే పేరెలా పెట్టటం ?”

“ఎలా మరి ? పెట్టనే కూడదా ?”

“అవుతే మీ అమ్మ నడుగుదామా ?”

“అమ్మో ! బళ్లోకి పొమ్మని తిడుతుంది.”

“పోనీ ఏదో పేరు పెట్టేద్దాం గమ్మని.”

“అవును. పెట్టేద్దాం. నేనే పెడతాను— ఓ క్షణం ఆలోచన—

“తొందరగా పెట్టెయ్ మరి....”

“సుందరి.... సుందరి.... మొన్న చంద్రం వాళ్లకి చెల్లాయి పుట్టిందిగా ? సుందరి అనే పేరు పెట్టారు.”

“సుందరి.... సుందరి.... భలే బావుంది.”

“నిజంగా బావుంది కదూ ?”

“నిజంగా....”

“సుందరి ! ఇటు చూడు. ఇటు, సుందరి !” గట్టిగా అరుస్తున్న బాబిగాణ్ణి కసుక్కున తొడ గిచ్చాడు గోపాలం— “మా అమ్మ వింటే బళ్లోకి పొమ్మని తిట్టదూ ?”

చేసిన తప్పు తెలిసి పోయింది బాబిగాడికి— భగభగ మండుతోన్న తొడ రాచుకుంటూ— “మరీ గట్టిగా గిచ్చేశావు” అన్నాడు కోపంగా గుసగుసలాడుతూ.

“నువ్వలా అరవకు. నేను గిచ్చనులే.”

సుందరి చకచకా నడుచుకుంటూ వెళ్లి మంచం కింద దూరింది.

“సుందరి ! నువ్వూ నేనూ జట్టుకదూ ? ఇలారా !'

“కొంచెం నన్ను కూడా పిలవ నివ్వవూ ?”

“పిలూ....”

“సుందరీ ! నువ్వు నా జట్టు కూడా ఉంటావు కదూ ?”

“మ్యావ్.... మ్యావ్.”

చప్పట్లు కొట్ట బోతూ ఆగిపోయాడు. గొంతు తగ్గించి నెమ్మదిగా— “ని జట్టు కూడా ఉంటానంటోందిరా ! మ్యావ్ అంటే నీకు తెలుసా? ఉంటాను అని అర్థం.”

“నిజంగానా ? అవుతే నేను బిస్కట్టు తెచ్చి పెడతాను సుందరీ నీకు.”

“మ్యావ్...!”



'ఏం బ్రదర్ ! పెళ్లయ్యాకా ఇలా చిక్కిపోతున్నావ్? కాస్త బలకరమైన ఆహారం తినరాదూ ?...'

'బ్రహ్మచారిని కాబట్టి, బలకరమైన ఆహారం నువ్వే తిను ! నేనెలావున్నా... అమ్ముడైపోయిన వాణ్ణి కాబట్టి ఫర్వాలేదు ! నువ్వు చిక్కిపోతే... రేటు తగ్గిపోవచ్చు ! అసలే కొనుక్కోపోవచ్చు !!...'

"ఒద్దంట. ఈ సారి తెలిసిందా ? పాలు తప్పితే ఇంకేమీ వద్దంట."

"దాని మాటలవీ నీకెలా తెలుస్తున్నాయిరా. రాముా ?"

"నాకు బాగా తెలుస్తుందిలే. నేను మ్యావ్ భాషతోనే మాట్లాడ గలను. కావాలంటే విను—మ్యావ్ సుందరీ ! ఇలా చూడు."

నిజంగానే తల తిప్పింది సుందరి.

"మ్యావ్ ! మ్యావ్ ! నువ్వు పాలే తాగుతావు కదూ ? మ్యావ్ ! పెరుగన్నం తినవుకదూ ?..."

తోక కదుపుతూ కళ్లు ఆడించింది సుందరి.

"చూశావా ఎలా మాట్లాడానో పిల్లిభాషతో." గర్వంగా చూస్తోన్న బాబిగాడి మీద ఈర్ష్య పుట్టుకొచ్చింది గోపాలానికి— "నాకూ నేర్పవూ?"

సుందరి ఒక చోటకుదురుగా కూర్చోటం లేదు. అటూ ఇటూ దొర్లి వెల్లకిలా పడుకుంటోంది. లేచి పచార్లు చేస్తోంది. నోరు తెరిచి మూసుకుంటోంది. ఏం చెయ్యాలో తోచనట్టు నానా అవస్థా పడుతోంది.

"సుందరికి నిద్రవస్తోందిరా ! అవలిస్తోంది. చూశావా ?" గోపాలం.

"నిజమేరోయ్. నేనూ అదే అనుకుంటున్నాను. ఉండు అవుతే పడుకో బెడదాం." వంకీన వేళ్లాడు తోన్న నాన్నగారి చొక్కా దిగలాగి ఉండలా చుట్టి కుర్చీమీద సర్దాడు బాబిగాడు.గది మూల తిరుగు తోన్న సుందరి నెత్తుకొచ్చి మెత్తగా కుర్చీలో పడుకో బెట్టాడు గోపాలం.

"ఇక నిద్రపోతుందిలే. మనం బళ్లోకి కూడా వెళ్లొచ్చు."

సుందరికి వరుపు నచ్చలేదో ఏమో— తల తిప్పి విసుగ్గా మరో వైపు తిరిగింది.

"ఏమిటీ మీరింకా బళ్లోకి వెళ్లనే లేదూ ? మీ మాటే మర్చిపోయి నా దోరణిలో నేను కూర్చున్నాను. ఎన్ని గంటలిలా పిల్లిపిల్లతో ఆడుతూ కూర్చుంటారూ ?" ఛెళ్లున బాబిగాడి వీపు మీద చరుపు పడింది. వెనువెంటనే గోపీగాడి వీపు ప్రతిధ్వనించింది— "కంటికి కనిపించారో చీరేస్తాను. దొంగవెధవల్లారా !"

స్నేహితులిద్దరూ తుపాకీ చూసిన కాకుల్లా మాయం ! సుందరి తలెత్తి బిక్కుబిక్కుమంటూ చూసింది.

"నువ్వేమిటే దర్జాగా కుర్చీ ఎక్కి కూర్చున్నావు. అయ్యో ! అయ్యో ! తెల్లచొక్కా ! ఆయన గారు విరుచుకు పడితే నేనేం చెప్పాను ? నీకు మెత్త కావల్సి వచ్చిందా ?" అంటూ కసికొద్దీ ఒక్క తోపు తోసింది పిల్లిపిల్లని క్రిందికి— అది కిమ్మన కుండా వెళ్లి మేజా కిందికి దూరిపోయింది.

రోడ్డుకి దూరంగా చింత చెట్టు చాటున కూర్చున్న స్నేహితులిద్దరికీ ఏం చెయ్యాలో తోచలేదు— "ఇప్పుడు బళ్లోకి వెళ్తే మేష్టారు తంతారు."

"మరి ఇంటికి వెళ్తే అమ్మ తిడుతుంది."

"ఇక్కడే కూర్చుందాం."

బళ్లోంచి ఇళ్లకు తిరిగివచ్చే పిల్లల రాకకోసం ఇద్దరూ అక్కడే కాచుక్కూర్చున్నారు."

"మధ్యాన్నం మళ్లా ఇంటికి వస్తావా ? ఆడు కుందాం."

" అమ్మ తిట్టదూ ?"

"ఇవ్వాళ శనివారంగా ? ఎల్లాగూ మధ్యాన్నం బడి ఉండదుగా ? ఎందుకు తిడుతుంది ?"

"అవుతే తప్పకుండా వస్తాను. మా సీతని కూడా తీసుకురానా ?"

"ఓ చంద్రాన్నీ— రమనీ — బేబీనీ — అందర్నీ పిలుద్దాం— ఎంచక్కా మా పెరట్లో రాత్రి అయ్యేవరకూ ఆడుకుందాం."

అంతలోనే మళ్లా దిగులు ముంచుకొచ్చింది—సుందరి ఎలా ఉందో ! గణగణా విన్పించింది బడి గంట— సంతోషంతో గంతులెయ్యాలని పించింది ఇద్దరికీ— "ఇంటికెళ్లి అన్నం తినేసి వస్తాను." సంచీ తగిలించుకు పరిగెత్తాడు గోపీ.

పెద్ద పెద్ద అంగ లేసుకొంటూ బయల్దేరాడు రాము.

* * *

మధ్యాహ్నం భోజనాలయ్యాక శకుంత లేదో కుట్టుకుంటూ కూర్చుంది వరండాలో, పెరట్లో జరుగుతోన్న సందడిచూస్తూ. "ఎండ్రా గిరలెత్తి చచ్చిపోతారు." అన్నా విన్పించుకోకుండా ఓ అరడజను మందికి పైగా బాబిగాడి స్నేహితులు వచ్చిపడ్డారు— కుక్కో, నక్కో, ఉడతో అందరూ తలో బొమ్మా తెచ్చు కున్నారు— బాబిగాడి నిజం పిల్లిపిల్ల ముందు

ప్రియుడు : ప్రేయసీ, నిన్ను విడిచి, ఎలా వెళ్లగలను ?
అమ్మాయి : ఎలానా?...
బస్ నెంబర్లు 30, 5, 15 ...!

కామేశ్వరి (కాకినాడ)

వాటి సరదా నశ్చేట్లో కలిసిపోయింది— అన్నిటినీ వో పక్కగా పడేశారు. మ్యావ్.... మ్యావ్.... అంటూ అరుస్తూ— నడుస్తూ— తిరిగే సుందరి పెద్ద ఆకర్షణైై కూర్చుంది వాళ్లకి— "సుందరి సుందరి..." అంటూ అంతా కలిసి చప్పట్లు చరిచారు.

"సుందరా ?.... బావుంది పేరు...." నవ్వు కుంది శకుంతల.

"ఇటు చూడు సుందరీ, ఇటూ" అంటూ దాన్ని తలో వేపుకీ లాగి అల్లరి పెడుతోంటే బాబిగాడికి కోపం వచ్చింది— 'అలా చేస్తే దానికి నొప్పి పెట్టదూ ?" అన్నాడు సుందరిని తన ఒళ్లోకి తీసుకుంటూ.

"లేదురా రామూ ! మరేం చెయ్యం. ఒక్కసారి ఇవ్వవూ ?"

"నే నసలు ముట్టుకోనే లేదురా ! కరుస్తుందా?"

"అచ్చంగా ఇది నీ పిల్లిపిల్లేనా ?"

"ఏయ్ ! అలా అనకు పిల్లి పిల్లేమిటి ? సుందరి అని చెప్పటం లేదూ వాడు ?"

"రామూ ! మీ సుందరిని ఒక్కసారి బళ్లోకి తీసుకురాకూడదూ ?"

ఎవరికి తోచినట్టు వాళ్ళు మాట్లాడేస్తోంటే రణగొణ ధ్వని తయారవుతోంది.

"మనం పిల్లి భాషలోనే మాట్లాడుకుందామ్రా."

"ఓ, అలాగే, ఏయ్ పిల్లీ ! మ్యావ్ ! నీ పేరేమిటీ ?— మ్యావ్ ! నా పేరు నీకు తెలుసా ? బేబీ."

"మ్యావ్! మ్యావ్! పిల్లీ! మ్యావ్ ? సుందరీ! కోవాబిళ్ల తింటావా ? మ్యావ్ ! తినవూ?"

"మ్యావ్ ! మ్యావ్ ! ఎందుకు తినదూ ? నాకిస్తే నేను తినిపిస్తాను. మ్యావ్.... ఇలా ఇవ్వవే ?"

"మ్యావ్.... రాధ కూడా వస్తే బావుండేది.... మ్యావ్.... ఎవ్వరూ దానికి చెప్పలేదూ ?"

పకపకా నవ్వుకుంది శకుంతల— "నీ పిల్లలు బంగారం కానూ! అసాధ్యుల్లా ఉన్నారు. వీళ్ల భాషలూ వీళ్లూనూ"

కిలకిలా నవ్వులూ— గట్టిగా చప్పట్లూ— గొంతు చించుకుంటూ అరుపులూ.... మధ్య మధ్య తిట్టుకోడాలూ— రక్కుకోడాలూ— నానా గందర గోళం చేసేస్తున్నారు పెరడంతా.

"అల్లరి చెయ్యకుండా నెమ్మదిగా కూర్చుని ఆడుకోండ్రా !"

శకుంతల అరుపు చీడీ కూడా దాట లేదు.—ఘొల్లుమంటూ గోల విన్పించింది ఏదో ప్రళయం వచ్చి పడ్డట్టు పిల్లలంతా కైవు కెవ్వుమంటూ అరుస్తూ లేచి పోయారు— ఆ గుంపుల్లో ఏం జరుగుతోందో శకుంతల కేమీ అంతు చిక్క లేదు. చేతిలో సూదీ దారం కుర్చీలో పడేసి పరుగు పరుగు పరుగులా నడిచి వెళ్లింది. అందర్నీ తోసేసి తొంగిచూస్తే.... ఝల్లుమంది గుండె ! కుందూ వాళ్ల సీమకుక్క టామీ పిల్లిపిల్లని నోటితో పట్టేసింది. బాబిగాడు రౌద్రమూర్తిలా ఆకుక్కని లాగెయ్యటానికి చేతులు రెండూ దాని కంఠానికి బిగించి బలంగా విశ్వ ప్రయత్నం చేస్తున్నాడు— అది కాళ్లతో రక్కటానికి ప్రయత్నిస్తోన్నా, లెక్క చెయ్యకుండా దానితో పెనుగులాడుతున్నాడు. ఇద్దరు ముగ్గురు పిల్ల వెధవలు దాని తోక పట్టుకు వెనక్కి లాగెయ్యటానికి తంటాలు పడుతున్నారు. మిగతా వాళ్లు కాస్త దూరంగా నిలబడి భయం భయంగా చోద్యం చూస్తున్నారు— పిల్లిపిల్ల భయంతో మ్యావ్.... అన్నప్పుడల్లా బాబిగాడి ఆవేశం పెచ్చు పెరిగిపోతోంది— ఎందుకూ కొరగాకుండా పోతోన్న వాడి శ్రమ చూస్తే శకుంతలకేం పాలుపోలేదు. కాళ్లూ చేతులూ ఆడనట్లయింది ఒక్క క్షణం —మరుక్షణంలో కాస్త చొరవ చేసి కర్రల మోపు దగ్గిరికి పరిగెత్తి చేతికందిన ఓ బెత్తం తీసుకొచ్చి టామీ నడ్డిమీద ఒక్క దెబ్బ వేసింది.

ఖయ్యోమని అరుస్తూ దొడ్డంతా పరిగెత్తింది టామీ. కర్ర పట్టుకుని వెంటపడింది శకుంతల. రెండుసార్లు అటూ ఇటూ పరిగెత్తి ఒక్క గంతులో దొడ్డి గోడ ఎక్కి మాయమైంది. శకుంతల వెనక్కి తిరిగి చూసేసరికి బాబిగాడు పిల్లిపిల్లని ఒళ్లో కూర్చో బెట్టుకుని మృదువుగా దాని మెడా ఒళ్లూ నిమురు తున్నాడు. — పిల్లలంతా దగ్గిర చేరి తలో విధంగా సానుభూతి కురిపిస్తున్నారు.

" వెధవ కుక్క గోడదూకి వచ్చేసిందిరా ! మనం






# మంచి అమ్మ

చూడనే లేదు."

" ఈసారి రాదులే. జాగ్రత్తగా నేను చూస్తూ వుంటాను."

" ఏమ్మా సుందరీ ! నీకు దెబ్బ తగిలిందా ? నొప్పి వస్తోందా ? లేదులే."

" ఒరేయ్ ! ఇక ఆట చాలుగానీ ఇళ్లకు పోండి." — కసురుకుంది శకుంతల. ఒక్కళ్ళూ కిక్కురు మనలేదు — " ఇంకాస్సేపు ఆడుకుంటాం పిన్నీ ! " అన్నాడు గోపీ ధైర్యం చేసి.

" ఎలాగో తగలడండి. నాకు నిద్ర వస్తోంది. కాస్సేపు నడుం వాలుస్తాను." శకుంతల తిన్నగా గది లోకి పోయి పడుకుంది.

పిల్లలు ఆట కొత్తగా పాటల్లోకి దిగింది.

పిల్లీ ... పిల్లీ ... మ్యావ్ — — మ్యావ్ ...
కుక్కా ... కుక్కా ... బౌ — — బౌ ...
మేకా ... మేకా ... మే — — మే ...
కాకీ ... కాకీ ... కావ్ — — కావ్ ...
ఆవూ ... ఆవూ ... అంబా —— అంబా ...

పాట జోరుగా సాగుతోంది. శకుంతలకి వెధవ పిల్లిపిల్ల కోసం బాబిగాడు చేసిన సాహసం అలా కళ్ళకి కట్టినట్టే వుంది. — " అమ్మో ! అలా జిడ్డులా కుక్కని పట్టుకు వేళ్ళాడుగదా అదిగాని కోపంతో కరిస్తే ...... ఇంకేమైనా వుంది ? ఎన్ని ఇంజక్షన్లు .. ఎన్ని మందు సీసాలు ..... ప్చ్ ! వాడికి పిచ్చి బాగా పట్టినట్టే వుంది — " విసుక్కుంటూనే నిద్రపోయింది.

* * *

సాయంత్రం నాలుగంటలు దాటింది. బాబిగాడి నాన్న మరో ఇద్దరు స్నేహితుల్ని తీసుకుని ఇంటికి వచ్చేవరకూ నిద్ర పోతూనే వుంది శకుంతల.

వీధి తలుపులు దడదడా చప్పుడవుతోంటే ఉలిక్కి పడి లేచి కళ్ళు నులుపుకుంటూ వెళ్ళి గడియ తీసింది.

" శకూ ! తొందరగా పోవాలి. టీ కలిపి తీసుకొచ్చేయ్. మూడుకప్పులు ...... " ఆర్డరు జారీచేసి స్నేహితుల్ని వెంట పెట్టుకుని గదిలోకి వెళ్ళిపోయాడాయన.

శకుంతల హడావిడిగా కుంపటి అంటించి టీకి నీళ్ళు పడేసింది. వేరే గిన్నెలో నాలుగైదు చెంచాలు పంచదార వేసి పాలకోసం అలమారుకేసి వెళ్ళేసరికి ఉలిక్కిపడింది—పగిలి ముక్కలై ఉన్న గాజు పెంకులూ ..... ఒలికి అలమారు కిందికి పాకిపోయిన పాల మడుగూ ...... ఏమిటో ఎలా జరిగిందో అర్థం కాలేదు ...... అయోమయంగా నిలబడి పోయింది శకుంతల. — అంతలోనే బాబిగాడి నాన్న కుంటు కుంటూ వచ్చాడు. " ఛీ ! నీకు బొత్తిగా బుద్ధి లేదు. కుర్చీ వెనక్కిలాగి కూర్చునేసరికి మేజాకింద కాలి కేమిటో అంటింది. ఇల్లెలా తగలడుతోందో చూసు కోవూ ?"... అంటూ విరుచుకు పడ్డాడు కోపంగా. కాళ్ళు కడుక్కునేందుకు బాత్‌రూమ్‌కేసి పోయాడు కుంటుకుంటూ.

అంతా అర్థమైంది శకుంతలకి — అది వెధవ పిల్లిపిల్ల పనే. ఇది బాబిగాడి పనీను — దానికి పాలు పొయ్యబోయాడు కావున్ను ఎక్కడి వక్కడ ఇలా నాశనం చేసి ఎటో పరిగెత్తాడు — శకుంతలకి బాబిగాడిమీద కంఠం వరకూ కోపం ముంచు కొచ్చింది.

" ఇంకా ఎందుకలా నించున్నావ్ ? కాస్త తొందరగా టీ కలిపి తీసుకురా ! బయటికి పోతాం. గది శుభ్రంగా కడిగేయ్." టవల్‌తో చేతులు తుడుచు కుంటూ వచ్చాడు — నాన్న.

శకుంతల భయ భయంగా అంది— "పాలు లేవండీ. ఇదిగో బాబిగాడు పాలగిన్నె బద్దలు గొట్టి ఎటో పారిపోయాడు. ఇప్పుడు చూస్తే వరకూ నాకు తెలిసే తెలీదు. టీ డికాక్షన్ కూడా పెట్టాను కుంపటి మీద—"

బాబిగాడి నాన్న గాజు పెంకులూ— పాల మడుగూ— కళ్ళారా చూశాడు "ఛా, నువ్వెప్పుడూ ఇంతే. పిల్లలున్న ఇంటో, జాగ్రత్తగా పెట్టుకో వద్దూ ? నీకు మరీ బద్ధకం లెద్దూ !" అంటూ విసుక్కున్నాడు.

శకుంతలకి ఏడుపొచ్చినంత పనైంది— "పిల్లలుంటే బాగానే ఉండును పిల్లులు కూడాను— జాగ్రత్త చేసుకోటాలూ అవీ నాకివ్వాళ కొత్తా ఏవిటి ? నన్ను పడుకోనిచ్చి వాడిలా గందరగోళం చేస్తే...."

"సరే ! సరే ! పోనీ కాసిన్ని బిస్కట్లయినా తెచ్చి పెట్టు, అలా హోటల్‌కి తీసికెళ్తా లే."

భర్త గార్ని బయటికి పంపించి గది— వం టిల్లూ కడుక్కుని ఉస్సురని నిట్టూర్చింది శకుం తల— బాబిగాడి మీద కంఠం వరకూ ముంచు కొచ్చిన కోపం కాస్త తగ్గుముఖం పట్టింది — వాడు బొత్తిగా చిలిపి వెధవా కాడమ్మా ! వెధవ పిల్లిపిల్ల మూలాన ఇలా తయారయ్యాడు గానీ, అంటూ స్వగతం చెప్పుకుంది.

కను చీకటి పడేవేళకు చంకలో పిల్లిపిల్లని మోస్తూ బిక్కుబిక్కు మంటూ ఇంటికి చేరాడు. బాబిగాడు. వాడికోసం ఒళ్ళంతా కళ్ళు చేసుకు ఎదురు తెన్నులు చూస్తోన్న శకుంతల వీధి చీడీల మీద కొడుకుని చూడగానే ఎదురెళ్ళి నెమ్మదిగా మాట్లాడుతూ లోపలికి తీసుకు వచ్చింది— కప్పు బద్దలు కొట్టిన సంగతి గానీ— పాలు ఒలకబోసిన మాట గానీ ఎత్తలేదు ఆశ్చర్యంతో తల ముక్క లౌతున్న బాబిగాడికి శుభ్రంగా నీళ్ళుపోసి దగ్గిర కూర్చుని అన్నం తినిపించింది—, వాడికీ సంతృప్తి కలిగే పిల్లిపిల్లాకి కడుపు నిండా పాలు పోసింది.

"కాస్సేపు కూర్చుని చదువుకో." అంటూ పుస్తకాల సంచీ ముందు పడేసింది. బాబిగాడు బుద్ధిగా చదువుకుంటూ ఉన్నట్టుండి తలెత్తి చూస్తూ అడిగాడు.

"అమ్మా ! పిల్లిపిల్ల రాత్రంతా ఎక్కడ పడుకుంటుంది ?"

"వంటింటో, జాగ్రత్తగా బుట్టవేసిమూస్తాలే అదే పడుకుంటుంది హాయిగా. నీకేం బెంగ అక్కర్లేదు." అంది నవ్వుకంగా. బాబిగాడికి చాలా సంతోషం వేసింది. "అమ్మకి కూడా పిల్లి పిల్లంటే ఇష్టం వేస్తోంది కావున్ను మంచి అమ్మ." అను కున్నాడు.— చదువుకుంటూ చదువు చదువు కుంటూ నేలమీదపడి నిద్రపోతూన్న కొడుకుని లేవదీసి మెత్తటి పక్కమీద పడుకో బెట్టింది శకుంతల— "పగలంతా ఒక్క పరసన కాకిలా ఎగిరాడు వెర్రివెధవ." అనుకుంటూ,

తర్వాత చెయ్యాల్సిన కార్యక్రమం గుర్తు వచ్చేసరికి కాస్త భయం వేసింది— ఒక్కసారి బాబి

గాడి మొహంకేసి చూసింది. ఎంతో నిశ్చింతగా నమ్మకంగా— అమాయకంగా నిద్రపోతున్నాడు. తెల్లారి లేచి అడిగితే తనేం చెప్పాలి ?— దేవుడా దేవా !—

ఆ ఏదో చెప్పవచ్చును ఏడిస్తే కాస్సేపు ఏడ్చి వూరుకుంటాడు. అంతేగాని రోజూ ఈ గోలెక్కడ భరించగలదు తను ? వాడేమో బడికి ఎగనామం పెట్టి ఆటలో పడితే ఏం చెయ్యగలదు ?— ఏమైనా సరే ఇక ముందువెనక లాలోచించ కూడదు.

గడిచిపోయిన పగలంతా ఒక్కసారి చక్రంగా కళ్ల ముందూ తిరిగి కాఠిన్యం నిండి పోయింది శకుంతలలో— గబగబా వెళ్లి వంటింటి గొళ్లెం తీసింది— మ్యావ్.. మ్యావ్... అంటూ కాళ్లకి అడ్డం పడుతు పిల్లి పిల్ల— దాన్ని అరవనివ్వ కుండా గట్టిగా పట్టుకుని గబగబా వెళ్లి కిటికీ లోంచి బయటికి గెంటింది. దబ్బుమన్న చప్పుడు వినకుండానే భళ్ళున కిటికీ తలుపులు మూసేసింది — “అమ్మయ్య. బతికాను.— ఎక్కడికో మరో ఇంటికి అదే పోతుంది. ఈ ఇళ్ళని నిర్వాకమూ ఏమిటి ?”

ఎంత సచ్చ జెప్పుకున్నా ఏదో భయంకరమైన పని చేసినట్టు భయం పట్టుకుంది పాపం ఆ కటిక చీకట్లో, పసిముండ ఎటు పోతుందో ! ఏ కుక్క నోట కరుచుకు పోతుందో ! ఆ తన పిచ్చి ! ఏమీ కాదు. అదే ఉంటుంది నిక్షేపంలా ఆయుష్షు ఉండాలిగానీ ఎవ్వరూ ఏమీ చెయ్యలేరు. అది పుట్టినప్పటి నుంచీ తనే పెంచిందా ఏమిటి ?

“సుందరీ ! మ్యావ్ ! ఇటూ ! ఇటూ !” నిద్రలో కలవరిస్తున్నాడు బాబిగాడు— ఎంతో బ్రహ్మాండం మీద పట్టిన నిద్ర కాస్తా చెదిరి పోయింది. లైటు వేసి చూసింది— అర్ధరాత్రి ఒంటి గంట దగ్గర!

“సుందరీ— సుందరీ అంటాడేం వీడు ? సుందరి ఎవరూ ?” అన్నాడు నిద్రమత్తుగా బాబిగాడి నాన్న.

శకుంతల గుండెలో రాయి పడింది— “ఎవరో బళ్లో పిల్ల.” అంది అటు తిరిగి పడు కొంటూ— ఎంత ప్రయత్నించినా మళ్లా కన్ను మూత పడలేదు— తీరా తను పిల్లిపిల్లని బయట పారేసింది వీడు గానీ దానికోసం బెంగ పెట్టు కొనేలాగ ఉన్నాడు తెల్లారి ఏం జవాబు చెప్తుంది ? అంత పనెందుకు చేశావని ఈయన గారు మండి పడతారేమో ! కొడుకేం చేస్తున్నా ఈయనకి గాబమేనాయె— అయ్యో పాపం ! ఆ పసి ముండ ఈ కటిక చీకట్లో ఎక్కడ ముడుచుకు పడుకుందో! మ్యావ్— మ్యావ్, మంటూ ఎంత అరుస్తోందో!

ఎందుకో శకుంతలకి తను చేసిన పని చాలా తప్పనిపించింది గొడ్డు దానిలా అలాంటి పని ఈ చేతులతో ఎలా చేశానో అని తిట్టుకొంది. జరగ జరిగిందేదో జరిగింది ఇప్పుడేం చెయ్యాలి ? అది మళ్లా ఎక్కడ దొరుకుతుంది ? ఈ పరికి ఏ ఇంటి వాటికో పోయి ఉండదూ ? ఎవరిళ్లలోకైనా దూరి ఉండదా ?— అలా అయితే ఇంకేం కొన్నాళ్ళ మహా రాజులాగే ఉండును— తర్కించుకుని తప్పించుకొని ఓ నిర్ణయానికి రాగలిగింది— చీకటితోనే లేచి ఇంటి చుట్టూ వెదికితే సరి. ఇరుగు పొరుగూ వాళ్లన అడిగేసరి. అదే దొరుకు తుంది.— ఓ గంట ఆలశ్యంగానైనా దొరుకుతుంది గానీ దేశాలు తెగించి పోదుగా ? వెతికి తెచ్చి మళ్ళా జాగ్రత్తగా ఇంట్లో పెట్టుకోవచ్చు. వాడి సరదా తీరనూ తీరుతుంది. తన బెంగా తగ్గుతుంది. పూటకో గిన్నెడు పాలు తప్పవి కావనుకుంటే పిల్లి పిల్లా బ్రతుకుతుంది—

అప్పటికి కాస్త శాంతపడింది శకుంతల మనస్సు— ఓ నిద్రకాడా పట్టింది కాస్సేపటికి.

చిమ్మ చీకటితోనే లేచే శకుంతలకా ఉదయం మెలకువ వచ్చేసరికి భళ్ళున తెల్లవారింది. తెల్ల వార్లూ నిద్రలేక పోవటం చేతో ఏమో తెల్లవారు జామున బండ నిద్ర పట్టేసింది— పని మనిషి వచ్చి దబదబా తలుపులు బాదుతోంటే గబగబా లేచి తలుపులు తీసింది—

ఎదురుగా రోడ్డు మీదేదో గుంపు !

దారే పోయేవాళ్లంతా ఆగి తొంగి చూస్తూ ఏమిటేమిటో మాట్లాడుకుంటూ పోతున్నారు— గడబిడగా ఒకటే గోలగా ఉంది.

“ఏమిటే అప్పలమ్మా అది ? ఏమైందక్కడ ?” ఆత్రుతగా అడిగింది శకుంతల.

“పిల్లి పిల్లమ్మా ! బండి కింద పడ్డాది.”

“పిల్లిపిల్లా.... ? చచ్చి పోయిందా ?”

“బండి సరాసరి మీద నుంచి పోతే దాని పేణం ఏంతమ్మా ? ఎప్పుడో పోనాది. రత్తం మడుగుతో పడుంది.”

“ఎలాంటి పిల్లి పిల్లే అది ? తెల్లగా ఉందా ?”

“లేదమ్మా ! నల్లగా ఉంది. బొత్తిగా పసిదానిలా ఉంది ”

ఇక వినలేక పోయింది శకుంతల. బావురుమని ఏడవాలనిపించింది. గబగబా గదిలోకి పోయి బాబి గాడికేసి చూసింది. వాడు ప్రశాంతంగా గాఢంగా నిద్రపోతున్నాడు ఏం చెప్పాలి వాడికి ? ఈ సంగతి వింటే ఏమైపోతాడు వాడు ?— శకుంతల కళ్లల్లో నీళ్ళు తిరిగాయి.

ఏడు గంటల ప్రాంతంలో బాబిగాడి నాన్న లేచాడు— “ఒరేయ్ నాన్నా ! ఇంకా ఏం నిద్దరా ? లేవరాదూ ? మొహం కడుక్కుందువు” అంటూ కొడుకుని లేపబోయాడు.

“ఆ ఆ వాణ్ణి లేపకండి లేపకండి పడుకో నివ్వండి ఇవ్వాళ ఆదివారమేగా ? బడిలేదు చదువూ లేదు వాడే లేస్తాడు వాడే లేస్తాడు ” అంటూ వారించింది శకుంతల కంగారుగా.

అంటీ అంటకుండా దుప్పటి కప్పబోతే బాబి గాడు మెలుకువ వచ్చి లేవనే లేచాడు నవ్వుతూ.






“నాన్నగారూ...! యిందాకటి పేపర్లో నా పరీక్షపోయిందా? కానీ— ఈ పేపర్లో పాసయ్యాను......హ్హా హ్హా హ్హా......!”

# ఆ కిటికీ

14 వ పేజీ తరువాయి

జరగబోతుంటే పూలకుండీ చేతికి తగిలి కింద పడ్డది.

వెంటనే పక్కింటి కిటికీలోంచి 'ష్' అన్న శబ్దమూ కిటికీ తలుపులు బంధింపబడ్డమూ ఒకే మాటు జరిగాయి. కిటికీ తలుపు వేసిన వ్యక్తి నల్లగా, బలిష్ఠంగా కనుపించాడు.

'నన్ను చూశాడేమో'—ఈ అనుమానం వచ్చే సరికి ముచ్చెమటలూ పోశాయి ఆనందరావుకి.

'నేను చేసింది ఎంత హీనమైన పని'—అని తనను తనే అసహ్యించుకున్నాడు.

ఆ రాత్రంతా అతడికి నిద్ర పట్టలేదు.

ఆ తీయటి జీవితాన్ని తాను పొందలేడు. ఒకవేళ ధనం అడ్డుపెట్టి పొందినా, అది మరొకరి గొంతు కోయటమే అవుతుంది—ఈ విషయంమీద అతడు ఆలోచించుకుని బుర్ర బద్దలు కొట్టుకున్న రోజులు గుర్తుకొచ్చినయ్. ఇహ నిద్ర ఎలా పడుతుంది ?

మర్రోజు డాక్టరు ఇంజెక్షను ఇచ్చి వెళ్లిం తర్వాత కిటికీవద్దకు జరిగాడు. ఆమె ముఖం ఒక్కసారి చూడాలని ఉన్నది.

గడియారం భారంగా గంటలు కొడుతున్నది. గంటమీద గంట దాటిపోతున్నది. ఫలితం శూన్యం అయింది. తన నిట్టూర్పులు తనకే బరువుగా తోస్తున్నై.

ఆమె కనుపించలేదు. ఎందుచేత ?—ఏమో, ఆమె కిదేనా పని ?—కాని ఆ ముఖ సందర్శనం కోసం ఒక హృదయం తపించిపోతున్నది—ఆమెకు జాలి లేదూ !

'ఆనందూ అన్నం వడ్డించాను'—అమ్మ కేక.

కాని ఆ అమ్మాయి అన్నిటికి అతీతురాలు !

'ఆ కిటికీ వదిలిరా నాయనా, అన్నం చల్లారి పోతున్నది'—

ఎంత అసహ్యమైనమాట—తను కిటికీ 'పట్టుకుని వేళ్లాడిపోతున్నాడా ?— నిజంగానా !—

గబగబ కుర్చీలాక్కుంటూ భోజనం టేబిల్ వద్దకు వచ్చాడు.

* * *

రెండు రోజుల తర్వాత ఒక అర్ధరాత్రి పక్కింటి కిటికీలోంచి సన్నగా మూలుగులు వినిపించి ఆపైన దిగమింగుతున్న ఏడుపులు వినిపించినై ఆనందరావుకి. చెవులు రిక్కించాడతడు. ఎవరు, ఆ అమ్మాయేనా ?—అతడు నమ్మలేదు. అందం మూర్తీభవించిన ఆ అమ్మాయి ఏడుస్తుందా ?—ఛ—మరెవ్వరో అయుంటారు.

తర్వాత కొన్ని రోజులు అదే సమయానికి మళ్లీ అవే ఏడుపులు వినిపించసాగినై. ఎవరో ఎవర్నో తోస్తున్న చప్పుడు. భరించలేక భోరుమన్నశబ్దం.

ఆనందరావుకి మెదడు పనిచేయటంలేదు. ఎవరు? ఆ అమ్మాయేనా ?—ఈ ప్రశ్నకు సమాధానం దొరకటంలేదు. కిటికీ తలుపులు బంధింపబడే ఉన్నాయి.

ఒకరోజు నిద్ర లేవంగానే అమ్మని కేకేసి అడిగాడు. "రోజూ రాత్రి ఎవరేమ్మా, పక్కింట్లో ఆ ఏడుపులు" అని.

శకరకేవరు నాయనా !—ఆ అమ్మాయి—తాసిల్దారుగారి మూడో అమ్మాయి. ఆ మొగుడు వట్టి దగుల్బాజీట. రెండు నెల్లాయె ఇక్కడే తిష్ట వేశాడుట. వాడికి ఉద్యోగం సద్యోగం లేదు. ఖుషీయకోమాటు తే తే డబ్బు తెమ్మంటాడుట. ఈ పిల్లెక్కడనుంచి తెస్తుంది. లేకపోతే పెళ్ళి చేసుకుంటాడంట........"

ఇహ ఆపైన వినలేకపోయాడు.

స్త్రీమీద చెయ్యి చేసుకోవటం అతని వూహకందని విషయం. అందులో తన కళ్లెదురుగా తన జీవితంలో ఒక ప్రత్యేక స్థానాన్నిచ్చిన ఒక స్త్రీ బాధపడుతున్నదంటే అతడి హృదయం పటాపంచలై పోయింది. గదంతా చీకట్లు కమ్మింది.

తర్వాత పది రోజులూ అతడు చెవులు గట్టిగా మూసుకుని పక్కలో అటు నుంచి ఇటూ, ఇటు నుంచి అటూ దొర్లేవాడు. చెవులమీంచి చేతులు తీస్తే ఎక్కడ ఏడుపు వినిపిస్తుందో నన్న భయం. ఒక్కొక్కప్పుడు ఎంత చెవులు మూసుకున్నా చేతుల్ని భేదించుకుని ఏడుపు వినిపించేది. నరకయాతన పడేవాడు.

రోజు రోజుకీ అతడి కళ్లు ఎరుపు వర్ణంలోకి మారుతున్నాయి. దవడలు లోతుకి పీక్కుపోయినై. అమ్మ కంగారుపడి పోతున్నది. నిర్జీవంగా ఉన్న అతడి ముఖంలోని మార్పు డాక్టరును కూడ కంగారు పెట్టింది.

కాలి బాధ కూడా ఎక్కువయిం దతడికి.

ఆరోజు ఇంజెక్షన్ ఇచ్చి వెడుతూ డాక్టరు అమ్మతో 'వేలూరు మళ్లీ తీసుకెళ్లాల్సి వస్తుంది. కాలు పైదాకా తీసేస్తేనే కాని లాభంలేదు.' అనటం విన్నాడు.

అతడికి కళ్లంట నీళ్లు చిమ్మాయి కళ్లు తుడుచుకుంటూ అమ్మ లోపలకు వచ్చింది.

"మళ్లీ వేలూరు వెళ్లాలంటున్నాడు కదనమ్మా ?"

అమ్మ బావురుమంది.

"ఎందు కేడుస్తావ్ అమ్మా—ఇదేం కొత్త కాదుగా. నాకు ఆస్పత్రులూ తప్పవూ, నీకు చాకిరీ తప్పదు. కానీ ఇక్కడనుంచి కదల దలుచుకోలేదమ్మా."

అమ్మ ఏదో అనబోయింది గాని కుర్చీ వెనక్కు తిప్పుకుని పుస్తకాల రాక్ వద్దకు జరిగాడు.

రెండు రోజుల తర్వాత ఒక తెల్లారగట్ల పక్కిల్లు గంద్రగోళంగా ఉంటే కంగారుగా మేల్కొన్నాడు ఆనందరావు. అమ్మ కూడా మేల్కొంది. హడావుడిగా పక్కింటికి వెళ్లింది గబుక్కున కుర్చీమీదికి గెంతి కిటికీ రెక్క జరుపుకున్నాడు.

అవతల కిటికీ బార్లా తెరిచి ఉంది ఎదురుగా మునుపు కనిపించిన పురుష విగ్రహం కనుపించింది. చేతులు కట్టుకుని తల వంచుకుని నిలబడి ఉన్నాడతడు.

ఏమయింది ? ఎందుకా గంద్రగోళం !— అంత జనం ఎవరు ?—ఇంకా అమ్మ రాదేం ?—

అమ్మ వచ్చేసరికి తెల్లవారింది.

'ఏమిటమ్మా, ఏమిటది' ఇంకా తన మాట పూర్తికాకుండానే 'ఆ అమ్మాయి బావిలో దూకి ఆత్మహత్య చేసుకున్నదట' అంది అమ్మ. కుర్చీలో వెనక్కు కూలిపోయాడు ఆనందరావు. అమ్మ ఎంత కుదిపినా అతడు కదలలేదు. ★

# రాజధాని కబుర్లు

9 వ పేజీ తరువాయి

జ్ఞాపకం వచ్చింది. హైద్రాబాదులో నిర్మించిన ప్రతి చిత్రానికి, భాషా భేదం లేకండా ఏభై వేల రూపాయలు ఇస్తామన్నారు దాంతో మహారాష్ట్ర నిర్మాతలు, మన సారథీ స్టూడియోస్ వైపుకు దృష్టులను మరల్చారు. షిర్డీ ఫిలిమ్స్ వార్ను మహారాష్ట్ర భాషలో మూడు చిత్రాలు తీయటానికి అప్పుడే నిర్ణయించారు. మొదటి చిత్రానికి ప్రారంభోత్సవం కూడా జరిగింది. సి. రామచంద్ర సంగీతం, షుణోకర్ డైరెక్షన్, కామినీ కదమ్ నటీమణితో, తీస్తున్న ఈ చిత్రం, అన్ని విధాల బాగుంటుందని అంచనా, ఇంకా కన్నడ నిర్మాతలు కూడా ఇక్కడికి రావటానికి ఆసక్తి చూపెడుతున్నారు.

[illegible] మోడీ అంతటి వాడే వచ్చి, ఇక్కడ పిక్చర్ హిందిలో తియ్యటానికి నిర్ణయించుకున్నాడు. శాంతారాం [illegible] మహారాష్ట్ర ఫిలిమ్ ప్రొడ్యూసర్స్ గా వచ్చి, హైద్రాబాద [illegible] క్చర్స్ తియ్యటానికి ఆలోచిస్తున్నట్లు తెలుస్తోంది. ఇంకా ప్రస్తుతం ప్రొడక్షనలో ఉన్నవి చాలా ఉన్నాయి. అశోక్ మూవీస్ వారి సుమంగళి, నాగేశ్వరరావుగారు, అమెరికా నుంచి తిరిగి రాంగానే పూర్తి అవుతుందనుకుంటున్నారు. బాబూ మూవీస్ వారి 'లేత మనసుల'కు ప్రారంభోత్సవం జరిగి పోయింది. ఇప్పుడేమో సుగంధి పిక్చర్స్ వారి 'గ్రామ దేవతలు' ప్రారంభ మయింది. ఇది హాస్య రస ప్రధానంగా ఉంటుందని 'ఇన్‌స్పెక్టర్ జనరల్'కు అనుకరణని అన్నారు. శ్రీనిలయం పిక్చర్స్ వారి సినిమా ఒకటి ఉంది. ఇంకా సారథీ స్టూడియోస్ వారి సొంత పిక్చర్ ఒకటుంది.

ఇంత వత్తిడిగా ఉంది సారథీ స్టూడియోస్. సంవత్సరారంభంలో ఈ స్టుడియోస్ ఆర్థిక స్తోమత బాగా లేదనే దృష్టిలో మూసి వేద్దామని అనుకున్నప్పటికి వోపిక వహించి, ఇంకా కొన్నాళ్ల పాటు చూద్దామని ఆశాభావంతో ఉండి పోవటం, ఈలోగా దుక్కిపాటి మధుసూధనరావుగారు ఇక్కడికి రావటం, మళ్లీ సారథీ స్టూడియోస్ ఠీవిగా నిలబడే అవకాశం కలగటం, ఇవన్నీ తలుచుకుంటుంటే ఆశ్చర్యంగానే ఉంటుంది. అన్నీ కాకతాళ న్యాయంగానే జరిగి పోయినాయి. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వారు ఇస్తామన్న ఏభై వేలు తీసుకోవటానికి ముందుకొస్తున్న నిర్మాతలందరికీ, మా స్టూడియోస్‌లో అవకాశం కల్పించటమే మా కర్తవ్యము, ఇంతవరకు పిక్చర్ తీస్తామని వచ్చిన నిర్మాత లెవ్వరికీ కూడా అవకాశం లేదని చెప్పలేదు అన్నారు సారథీ స్టూడియోస్ వారి శ్రీ సి. వి. ఆర్ ప్రసాద్ గారు, కాని ఇక ముందు ముందు వత్తిడి బాగా ఉంటుంది. సారథీ స్టూడియోస్ వారు, నిజంగానే, యేనిర్మాతకైనా అవకాశం లేదని ముందు చెప్పాలసి వస్తుందేమో !

ఐ. ఎల్. ఎన్. ★




ఆంధ్రా ఫిలిం ఛేంబర్ జర్నల్ అంటూ ఒకటి ఉంది. మార్చి— ఏప్రిల్ సంచికలో చాలా వింతయిన విషయాలు ఉన్నవి. అందులో రెండు. కె. కుటుంబరావు వ్రాసిన వ్యాసంలో ఇలా ఉన్నది. "మద్రాసులో తయారయిన తెలుగు సాంఘిక చిత్రాలలో తెలుగు సంస్కృతి లోపిస్తున్నది. అదీ సాధారణంగా కాదు, కళాత్మక దృష్టితో పరిశీలిస్తే." వారి ఉద్దేశంలో దీనికి విరుగుడు హైదరాబాదులో చిత్రాలు తీయుట మనుకుంటాను. ఇంకా వారంటారు. "కలసి ఉంటే కలదు సుఖం", "ఆత్మ బంధువు," "చదువుకున్న అమ్మాయిలు" "ఆత్మబలం", "మూగ మనసులు" ఆర్థిక విజయం పొందిన ఈ చిత్రాలన్నీ హైదరాబాదులో తయారవటం కాకతాళీయం కాదు."

స్థూలంగా చూసినా, సూక్ష్మంగా పరిశీలించినా ఇంతకన్న అప్రస్తుత ప్రసంగం మరి ఉండదు. హైదరాబాదుకి వెళ్ళనివ్వండి, మద్రాసులో ఉండనివ్వండి. అది వేరే సంగతి. హైదరాబాదుకి వెళ్ళినంత మాత్రాన తెలుగుదనం వస్తుందా ? భ్రమ. అందులో వారు పేర్కొన్న చిత్రాలు గమనించారా ? "క. క. సుఖం." "ఆత్మబంధువు" తమిళ చిత్రాల నకళ్ళు. వాటిలో పూర్తిగా కథనంలో, సంగీతంలో తమిళదనమే ప్రతిబింబించినది కాని తెలుగుదనం కాదు. "ఆత్మబలంలో" "చదువుకున్న అమ్మాయి"ల్లో తెలుగుదనమే లేదు. ఇక "మూగ మనసు"ల్లో తెలుగుదనం హైదరాబాదు స్టూడియోలో తీసినందు వలన రాలేదు. గోదావరొడ్డు కెళ్ళినందుకు వచ్చింది.

ఏదో ఒక ఉద్దేశం మనసులో పెట్టుకోవటం, దానిని సమర్థించుకోవటం కోసం అవక తవక కారణాలు చూపడం దానిని ఛేంబర్ వారు, తెలుగు చిత్ర పరిశ్రమకు ప్రతినిధులన తగ్గవారు, ప్రచురించటం సిగ్గు చేటు.

రెండవ వింత. ఇటీవల కీర్తి శేషులైన శ్రీ సన్నివీసు రజనీకాంత్ గారు సంగీత దర్శకులట. సుమారు పది చిత్రాలు తీసి, సినీ టెక్నీషియన్స్ అసోసియేషన్‌కి మూల విరాట్టు ఉండిన వ్యక్తి గురించి ఆ తప్పు ప్రచురించటం !

ఆ సంచిక సంపాదకుడు ఎం. సన్యాసి రాజు.

* * *

ఈ మధ్యన నవ, యువ దర్శకుల చుట్టూ పెట్టుకొని కార్యదర్శిగా, పిలవని పేరంటంగా ఒక యువకుడు తిరుగుతున్నాడు. ఇలా మంచి చేసుకొని సినిమాలో వేషం సంపాదిద్దామని అతని ఉద్దేశమని తెలుసుకోలేని దర్శక సుహృదయులు అతన్ని చేరదీస్తున్నారట. కారణం ? అతడు రాజవంశీయుడు కానటపోనని కొందరి వూహ. అంతే అతనిది "కాకా— తీయాని" వంశమే అయి ఉంటుంది మరి. ఆ దర్శకులతో అతను మాట్లాడటం వినాలి. క్షణానికొకమారు 'సారు' నిమిషానికొకమారు 'అండి' ! ! ఇంతకు అతనికేవేషం ఇస్తారు ? బృహన్నల అయి ఉంటుంది !

* * *

చాలా భాగం ఈ నాటి సినిమా కథలు ఒకరి వలన తయారయినవి కావు. నిర్మాత, దర్శకుడూ, కథకుడూ, ఒకోవేళ మరి ఇద్దరు ముగ్గురూ కూర్చొని తప్పో ఒప్పో రూపొందిస్తారు. విడుదలయే వేళకు కథ యెవరి పేరున వేద్దామా అని ఆలోచన కలుగుతుంది. చిత్రం విజయవంతం అయే పక్షాన అందరూ పేరు తమకే వస్తుంది, రావాలని వూహిస్తారు. కథ అడ్డం తిరుగుతే మాత్రం యెవరి నెత్తిన రుద్దటానికి వీలవుతుందా అని ఆలోచించటం కూడా కద్దు. ఈ నిర్ణయం విడుదలక ముందే జరగాలి కనుక కారణాలు ఈ విజయాపజయాలే కాకపోవచ్చు. కాని ఉండవక పోవు. "కలవారి కోడలు" కథలో, కథనంలో, సంభాషణలలో ప్రత్యగాత్మకు కొంత పాలుందని అందరికీ తెలిసినదే. కాని రచన నార్ల చిరంజీవి అన్నారు టైటిల్స్‌లో.

అలానే "మూగ మనసులు" చిత్రం తయారవుతున్నప్పుడు కథ ఆదుర్తి సుబ్బారావు, ముళ్ళపూడి వెంకటరమణ, ఆత్రేయ, సంభాషణలు పూర్తిగా ఆత్రేయ అని నెలకు రెండు మారులు ఉద్ఘాటించారు. ఇది సినిమా చూసే సరికి కథ సంభాషణలు ఆచార్య ఆత్రేయ, ముళ్ళపూడి వెంకటరమణగా మారింది. ఇక ఇప్పటి "తేనె మనసులు" చిత్రానికి కథ వెంకటరమణ, పాటలు సంభాషణలు ఆత్రేయ అనీ, "విశాల నేత్రా"లకు కథ పిలకా గణపతిశాస్త్రి సంభాషణలు రమణ, పాటలు ఆత్రేయ అనీ ఇప్పుడు అంటున్నారు. అప్పటికి యెలా అంటారో, కాని అసలు విషయం తెలిసిన వారు కథలో, కథనంలో, సంభాషణలలో, ప్రతిపాటలో, ఆదుర్తి వూహ, రమణ ప్రభావము, ఆత్రేయ వరవడి ఉంటాయి. వేర్వేరు పేర్లతో మార్చిమార్చి వేయడం కేవలం సరదాకి అని అంటారు. నిజం ఆ నిర్మాత సుందరానికైనా తెలుసునో తెలియదో ! ఒకటి మాత్రం నిజం "గోరమ్మా" పాటలో అంత భావం, కొంత మాటలు రమణవని కొసరాజే అన్నారు. కాని పాట కొసరాజుదనే ఉంది సినిమాలో !

* * *

ఒక రకం పత్రికలు కొన్ని వుంటాయి. వాటిలో ప్రధాన వార్త. ఫలానా టెయిలర్ ఇంటి ముందు ఫలానా ప్రఖ్యాత నటీమణి కారు రాత్రి పది నుంచి ఉదయం ఆరు వరకు జాగారం చేసిందని ఆ కారు ఫోటోతో, నంబరుతో సహా వేస్తారు. అంత వరకు నిజమే. కాని చదువరులకు ఆ కారులో శవజాగరణ చేసింది ఆ ఫలానా తార డ్రైవరనీ, ఆ లోపల ఆ టెయిలరు కుడుతున్నది మరుసటి రోజు షూటింగ్‌కి కావలసిన దుస్తులనీ గ్రహించరు. ఏదేదో వూహించుకొని సరదాపడి పోతారు. పాపం. నిజం తెలియక !

* * *

నేపథ్య గాయకి ఆర్. బాలసరస్వతికీ 'అతని యజమాని కంఠం' రికార్డు కంపెనీకి కాంట్రాక్టు



'డా॥ చక్రవర్తి'లో ఒక దృశ్యం.

రద్దయిందట. దీనికి కారణం ఆమె కొన్ని పాటలు పాడకపోవటమో, లేక కాంట్రాక్టు ప్రకారం సంవత్సరానికి నాలుగు పాటలు రికార్డు చేయటం కంపెనీ వారికి ఇష్టం కాకపోవటమో అని తెలిసిన వారనుకొంటున్నారు ! అన్నట్లు కుక్కా, పులీ రాజులు ఆస్థాన అశ్లీల కవివరుడు ఈ మధ్యన యెక్కడా కనా, వినా బడటం లేదే ! కాకినాడ వెక్కేసి ఉంటాడు ?

* * *

ఏనాడో రిపబ్లిక్ సీతారాం తీసిన "పెళ్ళి సందడి" బాగా సందడి చేసింది. దానిని తమిళంలో, హిందీలో "కాదలిక్క నేరమిల్లై" "జిద్ది" అన్న పేర్లతో మారు సందడి చేసినందుకు, తన అనుమతి లేకుండా, వెంగళ్రావు (తాను తీస్తున్న బొబ్బిలి యుద్ధంలో) సీతారాంకి ఒడలు మండి పోయినట్లూ, మనవాడే శ్రీధర్ పోసి అని హిందీ చిత్ర నిర్మాతలకు లాయర్ నోటీస్ పంపినట్లు తెలిసింది. ఏ స్టూడియో దారులో చేపట్టవలసి వంత గురు వస్తువును తీసుకొని, ప్రప్రథమంగా దర్శకత్వం నిర్వహించటమే కాక, తాను వెంగళ్రావు పాత్రను ధరించడమే కాక, మధ్యలో జగ్గయ్య పాత్రనుంచి విరమణనూ, సి. ఎస్సార్ ప్రపంచం నుంచి విష్క్రమణనూ సహించిన మగవాడే ఆ హిందీ వారితో తలపడ్డానికి యెంతయినా తగిన వాడు. 

# మద్రాస్ సినీమా వార్తలు

## విఠల్ ప్రొడక్షన్సు "అగ్గిపిడుగు"

విఠల్ ప్రొడక్షన్స్ వారి తాజా జానపద చిత్రానికి " అగ్గి పిడుగు " అని నామకరణం చేశారు. ఇంత వరకు 10 రీళ్ల చిత్రం పూర్తి అయింది. 4 పాటలను రికార్డు చేసి చిత్రీకరించారు. మే 14వ తేదీని గోల్డెన్ స్టూడియోలో సి. నారాయణరెడ్డి వ్రాసిన మరి రెండు పాటలను రికార్డు చేశారు.

" కన్ను కన్ను చేర — పున్నెము వెన్నెలేరా — "

పై పాటను జి. కె. మూర్తి వ్రాయగా, జానకి పాడగా రికార్డు చేయ బడింది. జయంతితో చిత్రీకరించారు.

" లడ్డు లడ్డూ మిఠాయి ........... "

పై పాటను కూడా జి. కె. మూర్తి వ్రాశారు. ఘంటసాల, జానకి పాడగా రికార్డు చేశారు. రామారావు, కృష్ణకుమారితో చిత్రీకరించారు.

" ఏమో — ఏమో — ఇది "

" నాకేమో — ఏమో — అయినది....... "

పై పాటను సి. నారాయణరెడ్డి వ్రాశారు. ఘంటసాల — జానకి పాడగా రికార్డు చేశారు. రామారావు, కృష్ణకుమారిలతో చిత్రీకరించారు.

" నేనే — నేనే — నేనే."

ఈ పై పాట కూడా సి. నారాయణరెడ్డి వ్రాశారు. యల్ ఆర్. ఈశ్వరి పాడగా రికార్డు చేయ బడింది. రాజశ్రీతో చిత్రీకరించారు.

" ప్రభువులు అంటే సాక్షాత్తు భగవంతుడు. అడగకుండానే భగవంతునికి ఆరగింపులు పెడ్తారే ! మన ప్రభువులు కోరి అడిగితే ఇంత రగడ చేస్తారా ! "

" వేదండా ! మేం అడగటం ఏమిటోయ్, బిచ్చమా ! వీళ్ళు చచ్చినట్లు శిస్తులు చెల్లించ వలసిందే."

" ప్రభూ ! ఏటా చెల్లించ వలసిన శిస్తులు చెల్లిస్తూనే ఉన్నాం. ఇంకా ఎక్కువ తెమ్మంటే, ఎక్కడనుంచి తేగలం ప్రభూ ! "

" అదంతా మాకనవసరం — మాకు కావాలి. మీరివ్వాలి."

" ప్రభూ ! పేద వాళ్ళం. ఈ ఏడు పంటలు పాడయి పోయాయి. భార్యా బిడ్డలుతో పస్తులు పడుకుంటున్నాం. చెల్లించలేం ప్రభూ! చెల్లించలేం!"

" పాపం ! అయితే వెళ్లండి. వెళ్లి మా విలాసోద్యానవనంలో ఒక చక్కని పాలరాతి కోనేరు నిర్మించండి. ఆ కోనేటి నీట్లో, పండు వెన్నెల్లో మా హృదయేశ్వరి ప్రియ హాయిగా జలక్రీడలాడుతుంటే చూడాలని వుంది. ఊ ! ఈడ్చుకెళ్లండి."

"రాముడు—భీముడు"లో జమున, రామారావు.

"ఇటు వంటి దండాలు వెయ్యమంది వచ్చినా భయం లేదు. నేను చెప్ప దలచుకున్నది చెప్పి మరీ వెళ్తాను. నీవు పూర్వ పుణ్యాన ప్రభువయి పుట్టావు. పట్టుపాన్పుల్లో పెరిగావు. పాపం కష్టపడలేవు. బ్రతకడం చేతకాదు."

"ఏమన్నావ్ ? చేతకాదా ! మాకు బ్రతకడం చేత కాదా ?"

"ఏది ! ఆ గద్దె దిగి ఒక్కరోజు సామాన్య మానవునిగా బ్రతుకు చూద్దాం. సవాలు చేస్తున్నా. నీ పొట్టకి ఒక్క పిడికెడు అన్నం సంపాదించుకో చూద్దాం ! ఒళ్ళు వంచి కష్టపడలేవు ! ఒక్క గింజ కూడా పండించలేవు."

"మా కష్టం మీద బ్రతుకుతూ మమ్మల్ని పశువులంటావా ! ఇంత హీనంగా చూస్తావా ! జాగ్రత్త ! మాకు భూదేవికి ఉన్న ఓర్పు ఉంది. మమ్మల్ని రెచ్చగొట్టావా ఈ రాజ భవనం పునాదులతో సహా పెకలించేస్తాను."

"వేదండా ఏడెవడో విప్లవ కారునిలా ఉన్నాడు. ఆవేశంతో అలసి పోయాడు. కాస్త వేడివేడిగా"

"రోగి నోటికి పథ్యం రుచిస్తుందా—మంచి మాటలు చేదుగానే ఉంటాయి."

ఈ సన్నివేశం కూడా విఠల్ ప్రొడక్షన్సు వారి "అగ్గి పిడుగు" చిత్రం లోనిదే. ఈ సన్నివేశంలో యన్. టి. రామారావు, రాజనాల, సత్యనారాయణ పాల్గొన్నారు.

వీరుగాక ఇంకా ఈ చిత్రంలో నాగయ్య, ముక్కామల, బాలకృష్ణ మోదుకూరి సత్యం, మద్దాలి, కృష్ణకుమారి, జయంతి, రాజశ్రీ మొదలగువారు నటిస్తున్నారు.

రచన : జి. కె. మూర్తి, బి. ఏ., పాటలు : జి. కె. మూర్తి, సి. నారాయణరెడ్డి, సంగీతం : రాజన్ అండ్ నాగేంద్ర, ఛాయ : రవికాంత్ నిగాయిజ్, కళ : బి. సి. బాబు, నృత్యం : చిన్నీ సంపత్, కూర్పు : గోవిందస్వామి, స్టూడియో : విజయా, వాహినీ, కోడైరెక్టర్ : యస్. వి. లాల్, నిర్మాత, దర్శకుడు : బి. విఠలాచార్య.

## పద్మజా ప్రొడక్షన్సు "శ్రీవిఠల్ భక్తతుకారాం"

"రంగా ! రంగా ! రంగా !. . . .

. . . ఇదా నీదు నీల— ఇలా మాయవేల

వినోదాలు పెంచి— విషాదాల ముంచే. . ."

పై పాటను రాజశ్రీ వ్రాశారు. ఘంటసాల పాడగా రికార్డు చేయబడింది. తుకారాంతో చిత్రీకరిస్తారు.

"ఆది నీవేనయ్యా— జగములకు— ఆది

నీవే నయ్యా . . .

ఈ యుగములకు ఆది నీవేనయ్యా"

పై పాటను రాజశ్రీ వ్రాశారు. ఘంటసాల పాడగా రికార్డు చేయబడింది. తుకారాంతో చిత్రీకరిస్తారు.

"బొజ్జలో పదునాల్గు భువనాలు నిల్పియు

రూపమే లేని చిద్రూపి ఎవరో—"

పై పద్యం రాజశ్రీ వ్రాశారు. ఆర్. బాలసరస్వతి పాడగా రికార్డు చేయబడింది. చిన్న పాండురంగనితో చిత్రీకరిస్తారు.

"ఛీ ! వెర్రి బాగులా బ్రహ్మయ్య తాతా !

. . . వింత వింతల బొమ్మల తాతా"

పై పాటను ఆరుద్ర వ్రాశారు. సుశీల పాడగా రికార్డు చేయబడింది, నూతన నటి సుచిత్రతో చిత్రీకరించారు."

"రెక్కలు రాని పక్షులను— ప్రేమతో

పెంచిన పెద్ద దిక్కునే. . .

డక్కటు కన్ను మూయుట— ఆశ్రయ

మిచ్చిన పండుటాకు యే"

పై పాటను కూడా ఆరుద్ర వ్రాశారు. సుశీల పాడగా రికార్డు చేశారు. సుచిత్రతో చిత్రీకరించారు.

"నోరు వాయీ లేక నాగులును మాయన్న..

అన్న మెరుగనట్టి అబలవోయి. . .."

పై పద్యాన్ని ఆరుద్ర వ్రాశారు. సుశీల పాడింది. సుచిత్రతో చిత్రీకరించారు.

"చూశారా ! చూశారా ! భగవంతుడి పేరు చెప్పి సొమ్ము తింటే భార్య కాస్త ఎగిరిపోయింది."

"ఎన్ని పాపాలు చేయక పోతే అలా దిక్కు, మొక్కూ లేకుండా పడి చస్తుంది."

"చాల్లే వూరుకుందూ ! పాపాత్ములయితే



"దేశద్రోహులు"లో గిరిజ

కుక్క మంచంలో చస్తార్సు గాని, గుళ్ళో ఎందుకు పోతారు. అయినా మీ కంఠశోషే గాని, ఆవిడ ఈ పాటికి వైకుంఠం చేరే ఉంటుంది."

"వెర్రి మొహమా ! ఆ లొడితెడు వైకుంఠంలో ఇలాంటి వాళ్ళందరకూ చోటు ఎక్కడ ఉంటుందే."

"ఎందుకుంటుంది ! మీలాంటి వాళ్ళకు మాత్రం వైకుంఠం ఖాళీ చేసి మరీ అట్టే పెడ్తారు."

"ఓహో ! నువ్వా ?"

"ఏం ! రూపా ! ఇంత ఆలస్య మయింది !"

"తాతకొళ్ళు బాగా లేదమ్మా ! ఇవిగో పూలు !"

"ఉ ! ఫో ! అవేవో తీసుకొని లోపలికెళ్ళి పూజ సంగతి చూడు."

"వెళ్తా ! వెళ్తా ! పుణ్యం కొద్దీ పురుషుడూ, దానం కొద్దీ బిడ్డలనీ నన్ను చూసే రాసినట్టు న్నాడా బ్రహ్మ !"

ఈ సన్నివేశం "శ్రీ విఠల్ భక్త తుకారాం" చిత్రంలోనికి ఈ సన్నివేశంలో ముక్కామల, శివశం, బాలసరస్వతి, సుచిత్ర పాల్గొన్నారు. వీరు గాక ఇంకా ఈ చిత్రంలో రేలంగి, జగ్గయ్య, నాగయ్య, రమణమూర్తి, వదలవాడ, రాజబాబు, కృష్ణకుమారి, గిరిజ, పుష్పవల్లి, లక్ష్మీకాంతమ్మ మొదలగువారు నటిస్తున్నారు.

ఈ చిత్రానికి రచన : రావూరి సత్యనారాయణ, పాటలు : ఆరుద్ర, రాజశ్రీ, సి. నారాయణరెడ్డి, సంగీతం : యస్. రాజేశ్వరరావు, నృత్యం : వెంపటి చినసత్యం, కళ : సి. హెచ్. ఇ. ప్రసాద్, ఛాయ : మల్లీ ఇరానీ, దర్శకుడు : పి. సుబ్బారావు.



'జకార్తా ఫిలిం ఉత్సవాల్లో' ఉత్తమ 'డెకార్' బహుమతి పొందిన శ్రీ టి. వి. ఎస్. శర్మ.

## జకార్తాలో యస్. వి. రంగారావు సావిత్రి బాల్ రూమ్ డాన్స్

జకార్తాలో జరిగిన ఫిలిం ఉత్సవాలకు మనదేశం నుండి "నర్తనశాల" ఒక చిత్రం మాత్రమే వెళ్ళిన విషయం అందరికీ తెలిసిందే.

జకార్తాలో ఏప్రియల్ 19వ ప్రారంభమయ్యాయి. ఇండోనేషియా ప్రెసిడెంటు శ్రీ సుకర్నో ఆ రోజు ప్రారంభించారు. ఢిల్లీలో జరిగిన అవార్డు ప్రధానోత్సవం ఏప్రియల్ 26వ జరిగినందున, ఆ ఉత్సవం చూసుకొని ఆ రోజునే నర్తనశాల చిత్రంతో పాటు డిస్ట్రిబ్యూటర్లు, నిర్మాతలు, యస్. వి. రంగారావు, రేలంగి, సావిత్రి, కూడా వెళ్లారు. చిత్రం 28వ తేదీన ప్రదర్శించడం జరిగింది. ఆ థియేటర్ సుమారు 1500 మందికి సరిపోతుంది. నర్తనశాల ప్రదర్శించే రోజు థియేటర్‌లో అంతగా ప్రజలు లేరు. 30వ తేదీని ఫలితాలను తెలియజేస్తూ బహుమతి ప్రదానం కూడా ఆ రోజే జరిగింది. శ్రీ సుకర్నో బహుమతి ప్రదానం చేశారు.

నర్తనశాలలో కీచక పాత్రధారి శ్రీ యస్. వి. రంగారావుకి ఒక ఉత్తమ బహుమతి "టుమంబా ఎవార్డు" 12" ఎత్తుగల వెండి విగ్రహాన్ని అందచేశారు. హాజరైన ఇతర దేశాల నటీనటులు, మిత్రులు, శ్రేయోభిలాషులు శ్రీ రంగారావును చూసి "కీచక్" "కీచక్" అని సరదాగా ఆనం

ంతో పిలుస్తూ హర్షధ్వనులు చేశారు. శ్రీసుకర్నో వీరి గౌరవార్థం విందును ఏర్పాటు చేశారు. శ్రీ సుకర్నోతో ఆ విందులో శ్రీ యస్. వి. రంగారావు, సావిత్రి బాల్‌రూమ్ డాన్సు చేశారు. తర్వాత శ్రీ సుకర్నో ప్రత్యేక కోరికపై సావిత్రి తమిళ చిత్రం "కర్ణగం"లో ఒక పాట పాడింది.

భారత దేశానికి ముఖ్యంగా ఆంధ్ర ఫిలిం పరిశ్రమకు శ్రీ రంగారావు గర్వకారకుడయ్యాడు. జకార్తాలో శ్రీ రేలంగి కొన్ని బైరాగి చిటికెలు చేశారు. అక్కడ చేరిన వారు కడుపుబ్బ నవ్వేరు.

## విజయభట్ మూవీస్ ప్రొడక్షన్సు నెం. 1

విజయభట్ మూవీస్ వారు తమ ప్రధమ సాంఘిక చిత్రాన్ని ఈ నెల 8వ తేదీని వాహినీ స్టూడియోలో ప్రారంభోత్సవం చేశారు. శ్రీ సుందర్‌లాల్ నహతా స్విచ్ ఆన్ చేశారు. ఫిలిం పరిశ్రమలో ప్రముఖులు శ్రీ నాగిరెడ్డి, డూండీ, వి. మధుసూధనరావు, మొదలగువారు హాజరైనారు.

ఈ చిత్రంలో యన్. టి. రామారావు, సావిత్రి, యస్. వి. రంగారావు, రమణారెడ్డి, చలం, నాగయ్య, గీతాంజలి మొదలగువారిని ఇంత వరకు ఎన్నుకున్నారు. మిగిలిన నటవర్గాన్ని త్వరలోనే ఎన్నుకుంటారు.

ఈ చిత్రానికి దర్శకుడుగా ఆదుర్తి సుబ్బారావు పని చేస్తున్నారు. కె. వి. మహాదేవన్, సంగీతం, మాటలు : సముద్రాల (జూనియర్) పాటలు : ఆత్రేయ, ఛాయ : యం. కె. రాజు, కళ : యస్. కృష్ణారావు, కూర్పు : టి. కృష్ణ.

దరా॰రావు

## అమెరికాలో అక్కినేని

ఆరోజు బుధవారం. అప్పుడప్పుడే చీకటి పడుతోంది. అమెరికాలో పర్యటిస్తున్న నాగేశ్వరరావు మా గారికికూడా వస్తున్నారని తెలిసి, ముందుగానే స్వాగతం చెప్పేందుకు యూనియన్ ఫసిఫిక్ రైలు స్టేషన్‌కి వెళ్లాం. నేనూ, నావెంట మరో ఇద్దరు, ముగ్గురు ఆంధ్ర సోదరులూ వున్నారు.

మరి కొన్నిక్షణాల్లో, సాన్‌ఫ్రాన్సిస్కోనుంచి 'డేలైట్ ఫసిఫిక్ ఎక్స్‌ప్రెస్' వచ్చింది. నాగేశ్వరరావుగారూ, ఆయన వెంట పర్యటిస్తున్న ప్రభుత్వ అధికారి శ్రీ సిద్దిక్ ఇద్దరూ దిగారు. అక్కినేనితో అందరం పరిచయాలు చేసికొని, మెల్లగా ఆయనుండబోయే హోటల్లోకి దారి తీశాం.

నాగేశ్వరరావుగారు తమంతట తామే ఎన్నో విశేషాలు చెప్పారు. కబుర్లతోనూ, ముచ్చట్లతో మాతో ఆత్మీయతను నెలకొల్పుకొన్నారు. కబుర్లలోపడి, అమెరికాలో వున్న విషయమే మరచిపోయాం. అలాగే చాలాసేపు గడిపి, ఆరాత్రి ఆయన్ను భోజనానికి తీసుకెళ్లాం. తాను కేవలం సినిమాలో హీరోనని, భోజనంలో మాత్రం కాదని చెపుతూంటే మాకెంతో సరదా అనిపించింది. పైగా 'మజ్జిగ' తప్ప మరేమీ 'తాగ' నన్నారు. ఇంతలో ఎవరో మిత్రులు, 'దేవదాసులో మీరు తాగలేదా ?' అని అడిగేసరికి శ్రీ అక్కినేని నవ్వుతూ "అక్కడ తాగింది వింటో" అన్నారు. "అలా అనుకుంటే సెట్టుమీద నాకు శాస్త్రోక్తంగా 150 వివాహాలయ్యాయి. వాళ్లంతా నిజ జీవితంలో కూడా భార్యలెలా అవుతారూ" అన్నారాయన.

అలాగే, నాగేశ్వరరావుగారు ఇక్కడవున్న కొద్ది రోజుల్లో, ఒకరోజు 'ట్వంటీయత్ సెంచరీ — ఫాక్స్ స్టూడియో' చూశారు. హిందీ నటుడు దేవానంద్ కూడా అక్కడే కలిశారు.

నాగేశ్వరరావుగారు మాతో గడిపింది కొన్ని రోజులే కావచ్చు. కాని, ఆయన మమ్మ విడిచిపోతుంటే ఒక ఆత్మీయుడు మాకు దూరమై పోయినట్లు అనిపించింది. — "కొన్ని బంధాలు విడతీయనివిగా మారుతాయి" అన్న వారి మాటల్లోని వాస్తవికత మా హృదయాల్లో ఇంకా ప్రతిధ్వనిస్తూనే వున్నది.

వి. ఎస్. రాయుడు (కాలిఫోర్నియా యూనివర్శిటీ)



శ్రీ గిల్లన్; (వీరు అమెరికను ఆంధ్రదేశంలో చాలాకాలం వున్నారు. తెలుగు బాగావచ్చును. డగ్లస్ కంపెనీలో వున్నారు ప్రస్తుతం); శ్రీ అక్కినేని (సుజాత); శ్రీ రామదాసుగారు; శ్రీ రామయ్యగారు,
ఫోటో : వి. యస్. రాయుడు, లాస్ ఏంజిల్స్.

## న్యూఢిల్లీ లేఖ

8 వ పేజీ తరువాయి

ఇండియాకు, ఆయనకూ అవమానకరమూ, అన్నదే ప్రస్తుతాంశం. చివరి సమస్య: కాశ్మీర్ విషయమై నిర్ణయం, కాశ్మీరు ప్రజలను తృప్తి పరచాలన్న సూచన. కాశ్మీరు ప్రజల అభిమత మేమిటో, అబ్దుల్లా ఇంతవరకు వెల్లడించలేదు. కాశ్మీరును పాకిస్తాన్‌తో కలపాలని కాశ్మీర్‌లోని ఒక వర్గం వాదన. ఇలాంటి పరిష్కారం ఇండియా యొక్క 'సెక్యూలరిజాన్ని' తుడిచి పెట్టవచ్చు.

ఇండియాతో కాశ్మీర్‌ను కలపాలన్నది, రెండవ మార్గం. ఇలాంటి 'పరిష్కార మార్గం పాకిస్తాన్‌కు వోటమినే కలుగ జేస్తుందట !— అందువల్ల దానికీ ఆస్కారం లేదట !

**అందువల్ల అబ్దుల్లా ఏం కోరు కుంటున్నదీ అవగత మవుతూనే వున్నది. కాశ్మీరు స్వతంత్రం కావాలని దానికి తాను నాయకుడు కావాలని ఆయన అభిమతం. అంతే కాదు, కాశ్మీరుకువచ్చే ఆ స్వాతంత్ర్యాన్ని ఉభయ దేశాలు సంరక్షించ గలవనికూడా అబ్దుల్లా వూహా.**

హిందువుల భావనలు ఎటువంటివో కూడా తెలిసికోవలసి ఉంది. ఒక సారి గతంలోకి వెళదాం. 1946 నాటి మాట— ఆ రోజుల్లో 'ఆర్థిక శాఖ' ముస్లింలీగ్ వారికి అంగీకారం లేక పోవచ్చునని కాంగ్రెసు అభిప్రాయం. పైగా, తమకు 'హోం' శాఖ కావాలని 'ముస్లింలీగ్' నటనను ప్రదర్శించింది కూడా. అందువల్లనే కాంగ్రెసు 'ఆర్థిక శాఖ'ను ముస్లింలీగ్‌కు ఇచ్చింది. అప్పుడు ఆర్థిక మంత్రి అయిన లియాఖత్ అలీఖాన్ చాలా తెలివైన వాడు. నెహ్రూగారి సోషలిజమూ, ఆయన మనస్తత్వమూ ఆధారం చేసుకొని అలీఖాన్ ఒక బడ్జెట్టును రూపొందించి ఎన్నో వన్నాగాలు పన్నాడు. అవన్నీ నాకు ఇంకా గుర్తున్నాయి.

ఈ రోజు కూడా అటువంటి తత్వమే ప్రబలుతున్నట్లు కనుపిస్తుంది. ఈ నాడు చాలా మంది పెద్దలకు, కొందరు పత్రికా సంపాదకులకూ స్పైతం తెలుసు— కాశ్మీరుకు స్వాతంత్ర్యం ఇవ్వటాన్ని లేదా కాశ్మీరుకు రాజాజీ 'ఫార్ములా'ను, పాకిస్తాన్ అంగీకరించబోదని. కాని, ఈ పెద్ద అందరికీ మహమ్మదీయ తత్వం తెలియక పోవచ్చు.

ఉన్న ప్రమాగం అంతా అక్కడేవుంది. తన సూత్రాలను నెహ్రూగారు ఆమోదించినట్లు అబ్దుల్లా ప్రకటనలు చేసుకొంటున్నాడు. దానికితోడు నెహ్రూగారి మౌనంకూడా అబ్దుల్లా భావాన్నే ధృఢపరుస్తుంది. తాను పదునెనిమిది నెలల క్రితం రాజకీయంగాను, మానసికంగా ఎంతధృఢంగానో వున్నాడో, యీనాడూ అంతధృఢంగా వున్నానని నెహ్రూగారు అనుకొన్నే, ఇలా చేశారు.

పాకిస్తాన్‌ను కాసేపూ, ఇండియాను కాసేపూ సమర్థించే తటస్థులతో కన్నా, తన మంత్రి వర్గం వారితోనే గడుపుకు పోవటం నెహ్రూకు కష్టతరమయి పోతున్నది. అబ్దుల్లా పథకాలు పాకిస్తాన్ ఆమోదం పొంది, ఇండియా తిరస్కారం పొందినవాడు, నెహ్రూగారికి అన్నీ కష్టాలే. మొదటిది అయన గౌరవ ప్రతిష్టలు తరిగి పోతాయి. రెండవది, అంతర్జాతీయ స్థాయిలో ఇండియా హోదా తగ్గుతుంది.

మంత్రి వర్గంలోని కొందరు మిత్రులు నెహ్రూగారికి చెడు సలహాల నిచ్చారని ఒకవాదం. తాను చెప్పింది, పార్టీలో వేదంగా పరిగణించబడు తుందన్న భ్రాంతితోనే శ్రీ నెహ్రూ ఇంకా వున్నారు. అది కేవలం భ్రాంతి. నెహ్రూ అబ్దుల్లాను లొంగిపోతే, తిరుగుబాటు తప్పదని పార్టీ ఏనాడో హెచ్చరించింది. అందువల్లనే నెహ్రూ భావాలు కేవలం భ్రాంతి

ఒకటిమాత్రం నిజం-యిండియా యీనాడు ఎంతో క్లిష్టపరిస్థితి నడుమున వున్నది.

శ్రీకృష్ణ ★



తులసీదాస్ పరమపదించిన 'అస్సీ', ఘట్టము.

—ఫొటో: జితేంద్ర అగ్రవాల్.

# కాశీపట్నం...

13 వ పేజీ తరువాయి

ఘన యశుండు!—'

కాశిలో మెట్టమొదట డుంఠి వినాయకుణ్ణి చూడాలి. ఆ తరవాతే విశ్వనాథుణ్ణి దర్శించాలి.

విశ్వనాథుడి ఆలయంలో చూసితీరవలసింది స్వర్ణమందిరం. ప్రతినిత్యమూ విశ్వేశ్వరుడికి జరిగే ధూప దీప నైవేద్యాలూ, స్వామి దర్శనానికి వచ్చే ఆ అశేష జనాన్నీ, ఆ వైభవాన్నీ చూచి ఆనందించాలంటే ఈ నేత్రాలు చాలవు.

కాశీ విశ్వనాథుడ్ని కొలిచిన వెంటనే అన్నపూర్ణాదేవిని సేవించ కోవాలి. దేవి ఆలయం ముఖ్యంగా శుక్రవారంనాడు రక రకాల అలంకారాలతో దేదీప్యమానంగా ప్రకాశిస్తూ ఉంటుంది. ఈ లోకమాతను ఒక పూర్వకవి ఇలా కీర్తిస్తున్నాడు:

'అక్షయంబుగ కాశి లోపల
అన్నపూర్ణ భవానివై
సాక్షి గణపతి గన్నతల్లివి
సద్గుణావతి శాంభవీ!—
మోక్ష మొసగెడు కనకదుర్గవు
మూల కారణ శక్తివి
శిక్ష చేతువు దుష్టజనులను
గిరీ భ్రమరాంబికా!'

ఇవిగాక మనల్ని ఆకర్షించేవి అస్సీఘాట్‌కు అరమైలు దూరానఉండే దుర్గా మందిరమూ, ఇంకా మానస మందిరమూ, రామ మందిరమూ వంటివి మరెన్నో.

పూర్వం వ్యాసముని ఒకానొకప్పుడు తన శిష్య బృందంతో సహా కాశిలో తిరుగుతూ, భిక్ష దొరక్క అలమటించాడు. ఆకలిమంటతో కాశీ నగరాన్నే శపించబోయేసరికి అన్నపూర్ణ అవతరించి సాక్షాత్కరించి గురు శిష్యులకు కడుపునిండా తిండి పెట్టింది. వారు శాంతించాక

'ఎట్టు పురాణము ల్పదియు నెన్మిది జెప్పితి?
ఎట్లు వేదముల్
గట్టితి వేర్పరించి? మడికారము దప్పక
యుండ భారతం
బెట్లు రచించి? తీవు ఋషి వెట్లయి?
తొక్క దినంబు మాత్రలో
బొట్టకు లేక తిట్టెదవు పుణ్య గుణంబుల
రాశి గాశికన్!'

అని మహర్షిని మందలించింది. "కాశినుండంగ నర్హుండు గాడు వీడు పో పో"మ్మన్నాడు విశ్వనాథుడు. వ్యాసుడు గంగానది దాటి అవతలి గట్టు చేరుకన్నాడు. అదే వ్యాసకాశి. రామనగరు. వ్యాసుడు కాశిని బాసిన కథ ఇది. కాశీయాత్ర చేసుకుని వ్యాసకాశి చూడకుంటే ముక్తిలేదు. అలాగని వ్యాస కాశిలో మరణించినా ముక్తిలేదు. పైగా గాడిద జన్మ వస్తుందిట.

కాశీయాత్ర పూర్తి చేసుకుని ఇల్లు చేరుకున్నాక గంగా సమారాధన జరిపించటం ఆచారం. సమారాధనలో విస్తట్లో బూరెలు దొర్లుతూవుంటే బ్రాహ్మల నోళ్లమ్మట:

హరహర కాశీ
నేతిలో బూరె వేసీ
అటు యిటు చూసీ
నోటిలో జారవేసీ

అంటూ రక రకాల శ్లోకాలు ఊరుతుంటాయి. అన్నపూర్ణ, కాలభైరవ, అష్టకాలలో శ్లోకాలు ఇటువంటి సమారాధనల్లో గుప్పిస్తారు.

ఇటువంటి కాశీ నగరంలో వాసం చెయ్యాలంటే మరొక చిన్ని ఆప్త వాక్యం గుర్తుంచుకోవటం ముఖ్యం:

సాండ్ రాండ్ సీడీ సన్యాసీ
ఊన్సే బచేసే రహేవై కాశీ

—దీని భావమేమి తిరుమలేశా?—అంటే ఆబోతులు, వేశ్యలు, (గంగానది) మెట్లు, సన్యాసులు—వీటిని తట్టుకునే శక్తి ఉంటేనే కాశిలో ఉండటానికి సిద్ధపడ్డాలని.

★

## వచ్చే వారం!

'బాలసాహితి' లో

# 'బద్ధకస్తులు'

కొలంబియా జానపద కథ!














Edited, Printed and Published by S. Radhakrishna at the AndhraPatrika Press; 6 &7 Thambuchetty Street Madras-1. Phone: 22244 & 23713. Chief Editor S. Sambhu Prasad.

